# స్వప్నయాత్ర

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితులు

కావ్యస్మృతితీర్థ

శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచియింపఁబడినది.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1935

తకు మఱికొంత ఉబ్బి తబ్బిబ్బులగుదురు. కొందఱు తెలిసినను దెలియకయున్నను గరతాళధ్వనుల నుపన్యాసవేదిక మ్రోగు లాడఁ జేయుదురు. ఇవియన్నియుఁ దమయోగ్యతను జాటు నని యుపన్యాసకులు తలంతురు. ఇందు సత్య మేమూల నుండును?

ప్రాయికముగా స్వప్నము లసత్యములని తలంతురుకదా. కొన్నియైన సత్యములుకావా యని తలంపరు. అవి మిగులఁ బొరపాటు. తా నెన్నఁడు వినని చూడనిపదార్థములఁ గనఁబడఁ జేయుశక్తి స్వప్నమునకుఁ గలదు.

"అదృష్టమప్యర్థమదృష్టవైభవాత్,
కరోతి సుప్తిర్జనదర్శనాతిథిమ్"

నైషధము ౧ సర్గము

అన వినమా! మనశ్శక్తి యత్యధిక మని యెఱుంగుటయే బుద్ధిమ ల్లక్షణము. పూర్వపుణ్యవశమున భగవంతుఁడు భక్తులకు సకలబ్రహ్మాండములఁ గనఁబఱచును. తనయందే సకల బ్రహ్మాండము లున్నయట్లొకప్పుడును, వేఱొకప్పుడు భక్తులం బిలుచుకొనిపోయియుఁ గనఁబఱచును. అర్జునునకు యుద్ధప్రారంభమునఁ దనవిశ్వరూపమును జూపి సకలబ్రహ్మాండముల నందుఁ గనంబడునట్లు చేసినశ్రీకృష్ణమూర్తియే సైంధవవధార్థమై స్వప్నమున నర్జునుం బిలుచుకొని కైలాసమున కరిగి శంకరుని గనఁబడఁజేసి పాశుపతాస్త్రరాజము నిప్పించెను. కావునఁ గర్మాను రూపముగా మానవులకు ఫలములను గల్గఁజేయు నని యంగీకరింపవలయును. భక్తి చక్కఁగాఁ గుదురుటకై యిన్నిరీతులఁ బన్ను ననియే యిందలిసారము. ప్రస్తుత మీగ్రంథకర్తను గృపాపరతంత్రుఁడైన శ్యామసుందరచక్రవర్తి హిమాలయము

నకుఁ బిలుచుకొనిపోయి యందుఁగల మహనీయస్థలములం
జూపి యందలి మహర్షులు సంభాషించున ట్లొనర్చి దానిమూల
మునఁ దనభక్తునకుం గల సందేహములు తొలఁగఁజేసెను. పామ-
రులు నమ్మువిషయములు సత్యములు గా వనియు, మాయావులు
పల్కుమాటలు విశ్వాస ముంచఁదగినవి కా వనియు వానిని
నమ్మిన బాగుపడఁజాల రనియు స్పష్టము గావించెను. హిమాలయ
మహిమము వాఙ్మానసాతీతము. అందుఁ గలశిఖరములు మాన
వుల కగమ్యములు. అత్యల్పసంఖ్యాకములఁ గనుఁగొని యన్నిం
టిని బరిశీలించితి మని కొందఱందురు. అది యేనాటికిఁ బొసఁ
గనిమాట. దేవభూములు కనుఁగొనఁదరమా! ఏవారికేఁగానరాక
యుండును. ఆవిషయ మెఱుంగక యన్నింటిఁ బరిశీలించితి మని
ప్రల్లదము లాడుదురు. భగవంతుఁ డవ్వారిమాటలకు నవ్వు
చుండును. ఆపర్వతరాజమే దేవతానగ మనఁ బ్రఖ్యాతి గాంచిన
దని యెఱుంగందగు. అందే కలికాలమున మహర్షులు వసిం
చుచుఁ బ్రజలమేలు కోరుచుందురు. సత్కర్మములు బీజమాత్ర
ములుగానైన నుండుంగాక యని కోరుదురు. వారిని దర్శించు
టకుఁ బెక్కండ్రు సజ్జను లుత్సుకులుగా నుందురుగాని మౌనులు
రూపాంతరములఁ బొడసూపి తమమహిమము గప్పిపుచ్చు
చుందురు. పూర్వపుణ్యమువలనఁ గొందఱకు దర్శన మిచ్చుటయుఁ
గలదు. జిజ్ఞాసువులే యుండనికాలమున హిమాలయమునకు
మహర్షులదర్శనార్థ మరుగువా రుండిన నంతకంటె సంతోషవార్త
మునుల కింకేది యుండును? వారి దర్శనమున జనులు దుష్కృత
విముక్తు లగుదు రనుట యొక యబ్బురమా?

మహామునులసంభాషణములే యిందుఁ గలముఖ్యవిషయము. వారియాశయములే యిందుఁ గలవు. వారిసాన్నిధ్యమున నెట్టి క్రూరజంతువులేని సాధుస్వభావములుగా మాఱుననుట సామాన్యవిషయము. అందుఁగల నదులమహాత్త్వములిందుఁ జక్కఁగాఁ దెలుపఁబడినవి. మొత్తముమీఁద నీయాఖ్యాయిక భక్తిని మతాభిమానమును గల్గించును. దేవతాశక్తిని బయలుపఱచును. వ్రతములమహిమమును వెల్లడించును. శ్రీకృష్ణుఁడు సర్వకారణుఁ డని తేటపఱచును. కావున దీనిని శ్రద్ధ మెయింజదువ భగవద్భక్తి కుదురును. పామరుల మోసపుచ్చుఁ బూనినమాయికుల డంబములు కరతలామలకములుగాఁ దెలియును. ఆస్తికులందఱు దీనిం జదివి కృతకృత్యు లగుదురుగాక యని యాశించుచున్నాఁడను. ఇంతకంటె వ్రాయఁదగినవిషయములు విశేషించి కానరావు. పుణ్యకార్యములయం దుత్తమోత్తమము మహాత్ముల కాశ్రయభూతమగు హిమాలయదర్శన మని యందఱెఱుంగవలయును. తక్కుంగలవిషయములు గ్రంథపఠనమున విశదములు కాఁగలవు. సర్వే జనాస్సుఖినో భవంతు.

ఇట్లు సాధుజనశ్రేయోఽభిలాషి

కాశ్యపుఁడు

శ్రీ. శ్రీ. శ్రీ.

# విజ్ఞప్తి

మహాశయులారా!

ఈయాఖ్యాయిక వ్రాసి ముగించినవెంటనే దీనిముద్రణమునకై నాలుగుప్రక్కలకుఁ జూపులు సాగింపఁ బూనితి. మహారాజశ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారే కనఁబడిరి. ఇదమిత్థమ్మని వ్రాసితిని. బదులు త్వరగాఁ బంపిన ముద్రింతుమనియే వచ్చెను. ఇంతదనుక నే నేపుస్తకమును వ్రాసినను వ్రాయఁబూనుకొన్నను నాపూన్కికిఁ దోడ్పాటు చూపుటలో వెనుకంజవేయక నన్నాదరించుచు నాదాయవ్యయములఁ బాటింపక నాపుస్తకములఁ బ్రకటించుటయే ప్రధానముగా భావించు నుదారహృదయులకుఁ బరోపకారధురీణులకు విశేషించి నన్నాదరించు సుగుణమణులకు వేంకటేశ్వరశాస్త్రిగారికి నాకృతజ్ఞత నేతన్మూలమునఁ జూపుట యొక్కటితప్ప నితరవిశేషము లిటఁ బెంచివ్రాయ నాకేమియు లేవు.

ఇట్లు విన్నవించుసాధుజనసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః

జయ పరమేశ్వరి !

# స్వప్నయాత్ర

చ. సిరుల నొసంగుచున్ ముదముఁ - జేకుఱఁ జేయుచు సాధువ
ర్తనం, బరుదుగఁగల్గఁ గూర్చుచు దు-రాత్ములు వంచకు
లర్థలాభత, త్వరులును నైనవారల ని-తాంతము తూలఁగఁ
జేయుచున్ మనో,హరగతిఁ బొల్చుదైవము మ-దాత్మను
నిల్చి చెలంగుచుండుతన్. 1

చ. కృతుల నొనర్చువారలకుఁ - గేవలకీర్తియె కాదు పుణ్యమ
ప్రతిమముగల్గుఁ దత్కృతిని - శ్రద్ధఁ బఠించెడువారు ధర్మసం
గతిఁగనుచుండఁగాఁ దగును - గావున సద్గతిబోధకంబుగాన్
గృతిని రచించువాఁడఁ బర-మేశ్వరు నమ్మి జగద్ధితార్థినై. 2

క. ఆఖ్యాయిక యిది చదువఁగ
విఖ్యాతపురాణధర్మ-వితతులఁ దెల్పున్
బ్రఖ్యాతిఁ గల్గఁజేయు స
దాఖ్యన్ వెలయించుఁ జూఁడి మ-హాశయులారా! 3

క. తమ కించుక తెలియనిధ
ర్మములన్ బోధించి దానఁ - బ్రఖ్యాతిని గో
రుమనుజుల మాయలను దె
ల్పుమహిన్ స్పష్టముగ నిద్ది - పూనికఁ జదువన్. 4

తే. కాన నోపికఁబూని యిద్దానిఁ జక్కఁ
జవివి వంచకు లోఁగిఁ దెల్పు సజ్జనులఁ దెలి
సికొని దానికి లోఁబడి - చెడక ప్రాక్త
నవిహితాచారములఁ గైకొనంగఁ దగును. 5

శ్రీకరుం డగుభగవంతునిచరిత్రమువలె నాకాశము నిర భ్రమై యుండెను. అందు జ్యోతిస్సులు మిణుకుమిణుకుమని ప్రకాశించుచుండెను. అందుఁ గొన్ని మిణుఁగురుంబుర్వులవలెఁ గనఁబడుచుఁ గనఁబడనియట్లుండెను. మఱికొన్ని యించుక స్పష్టముగాఁ గానఁబడుచుఁ దమయత్యల్పకిరణముల భూమి పైకిం బంపుచుండెను. ఆకిరణము లేభూభాగమునఁ బడుచున్నవో దేనిని బ్రకాశింపఁజేయుచున్నవో యదిమాత్ర మెఱుంగ నేరికింగాని తరముగాదు. ఇట్లసంఖ్యాకము లగుజ్యోతిర్విశేషములు తమతమయల్పకిరణముల వ్యాపింపఁజేయుచుండెను. గాని యాకిరణము లన్నియుం గూడి పెద్దవెలుఁగును గలిగింపఁజేయఁజాలకపోయినను సూక్ష్మముగాఁ బరిశీలించువారలకుఁ దమప్రకాశ మిట్టిదని తెలుపుచుండెను. ఆజ్యోతిర్విశేషములనే తారక లందురు. తెనుఁగుబాసను జుక్క లందురు. చిన్నివలయములుగా నవి కనఁబడుటం గాఁబోలు చుక్కలని పేరుగల్గినది. సత్యము పరికింప నవియన్నియు బ్రహ్మాండములు. భూలోకమునకంటె నొక్కటొక్కటి వేయిమడుంగులో లక్షమడుంగులో కోటిమడుంగులో గొప్ప వని స్పష్టమగును. ఎంతదూరమున నుండుటనో యవి యంతచిన్నయాకృతులుగాఁ దోఁచుచున్నవి. వానిదూర మింత యని యెంతటిసూక్ష్మయంత్రములమూలమునఁ బరిశీలించినను దెలియఁ దరము గాకయున్నది. అతీంద్రి

యజ్ఞు లగుపెద్దలు (అనఁగా మహర్షులు) జ్ఞానదృష్టిం బరికించి వానిని బ్రహ్మాండము లనిరి. భూమండలమున కెట్లు చంద్ర సూర్యులు మఱియుఁ గుజాదు లుపకర్తలుగ నున్నవారో యా బ్రహ్మాండములకు నొక్కొక్కదానికి నిట్లే యొకరు మొదలుకొని యేడుగురువఱకుఁ జంద్రులు గల రనియు సూర్యుఁ డొక్కఁ డొక్కఁడే కలఁడనియుఁ గుజాదులంబోలిన లోకోపకర్తలు గ్రహములు మండలముల నధివసించి వానిం గాపాడుచుందు రనియుఁ గనుఁగొని తెలిపిరి. శనిగోళమున నేడుగురుచంద్రు లున్నవారని మహాత్ములు తెలుపఁగా విని పక్కన నవ్వినవారిప్పు డిపుడు సూక్ష్మదర్శకయంత్రములమూలమున నది సత్యమని యెఱింగి ముక్కుపై వ్రేలిడుకొనుచు నమ్ముచు వారిని బొగడు చున్నవారు. ఔరా! జ్ఞానదృష్టులమహత్వము! అద్దిరా పూర్వుల పరిశీలనము! బళీ! ఆర్యులపాండిత్యము! ఇప్పటివారికి వింత గొలుపుచున్నది. ఇంకను వారిమహత్త్వము నెఱుంగుట కిప్పటి వారికిఁ దరంబా? కాలము జరగఁగా నింకను బరిశీలించి వారి యమేయమహత్త్వమును గనుఁగొని తలయూఁతురుగాక. శిర ములవంచి నమస్కరింతురుగాక. చిరకాల మవ్వారిమహిమ ములఁ దెలిసికొని యట్టిమహత్త్వమును సంపాదింపఁ దలంచుచు వారికి జోహారు లొనరింతురుగాక. మనయోగ్యత కట్టిమహిమ మలవడునా యని నిస్పృహులగుదురుగాక.

అట్టి తారకలు మెఱయుచుండఁగా నవ్యక్తప్రకాశము రాజ్యముచేయుచుండెను. భగవంతుఁడు కాన రాక యున్నను దత్కార్యములు స్పష్టములుగా నెల్లరకుం గనఁబడుచున్నయట్లు నక్షత్రముల ప్రకాశము వ్యక్తముగా నంతట వ్యాపించినట్లు

తోఁచకయున్నను గాఢాంధకారమునందు నించుక పదార్థములు గోచరించుచుండుట యచ్చెరువుగదా. దీనింబట్టి యూహింపఁగా సర్వదా భగవదాజ్ఞచే నెన్నిలోకములనుండియో ప్రకాశము వచ్చుననియు దాని సాయమున మనము చరించుచున్నవార మనియు గ్రహింపవలయును. ఇన్నిలోకముల సహాయము మనకుఁ గలుగుచున్నదని మాత్రము మనమాలోచించుట లేదు. అదియె మానవులయందున్న లోపము. చంద్రుఁడు భూగోళము నకు సమీపభాగమున నున్నవాఁడు. కాఁబట్టియే యీలోకమునఁ గల వృక్షములు లతలు సస్యములు మానవులు, తీవ్రపరితాప ములనుండి తప్పించుకొనఁగల్గుట. అమృతకిరణుఁ డనుపేరా చంద్రునకు సార్థకము. చంద్రుఁడు భూగోళముయొక్క యాక ర్షణశక్తిచే నాకర్షింపఁబడునఁట. అంతియకాక యాశీతాంశుని సూర్యగోళముకూడ నాకర్షించునఁట. కావుననే కాఁబోలు జ్యోతిశ్శాస్త్రమునఁ జంద్రుఁడు స్త్రీగ్రహ మని చెప్పఁబడినది. స్త్రీగ్రహ మనఁగాఁ బరతంత్రగ్రహ మని భావము. తా నితరులకు లోఁబడియుండు నని సారము. దీనింబట్టి చూడఁగా భూమికి సమీపమందున్నయది చంద్రలోక మని స్పష్టంబగు.

చంద్రగోళము భూగోళమువంటిదే. అనఁగా నందును భూతకోటి కల దని భావము. చంద్రలోకమునఁ బితృదేవతలు గల రని పురాణములు తెల్పుచున్నవి. పితృదేవత లనఁగాఁ దండ్రుల వలె భూలోకజీవకోటులఁ బరిరక్షించువా రని యంతరార్థము. మనుష్యులతండ్రు లందఱు నందుండువా రని కాదు. మనుష్యు లకు విశేషించి మేలుగల్గగోరు వా రని సారము. ఈలోకమున

ననేకపుణ్యకార్యము లొనరించి కృతకృత్యులై చంద్రలోకమున నివసించి స్వార్థపరులుగాక లోకోపకారమే తమకృత్యమని భావించు సుకృతాత్ములందుందురనియు, వారు దేవతలవలె జరా మరణములులేకయుండజాలువారనియు మనము గ్రహింప వలయు. *ఆపితృదేవతలు సకలలోకవాసుల క్షేమము గోరు చుందురు. మహర్షులకొడుకులై తపంబొనరించి మానవత్వమును వదలి దేవత్వమునొంది చంద్రలోకమున నివసించి మానవుల మేలుకోరుచుందురని స్మృతులు తెలుపుచున్నవి. పురాణముల యందుఁ గొన్నితావుల భూమిపై సూర్యుఁడు, ఆపైఁ జంద్రుఁడు నున్నయట్లు కానంబడుఁగదా యదెట్లుసరిపడును? అని కొంద ఱాక్షేపింతురు. కాని వారాపురాణముల తాత్పర్యమే మని గ్రహింపఁజాలకున్నారు. సూర్యునికంటె భూలోకమునకు నుప కారి లేఁడు కావున నాసూర్యునిం బ్రధానముగా సమీపబంధు వని లోకులు వాడుకొనునట్లు చెప్పఁబడినది. అంతకంటెఁ

---

* విరాట్సుతాస్సోమసదః సాధ్యానాం పితరస్స్మృతాః, అగ్నిష్వాత్తాశ్చ దేవానాం మారీచా లోకవిశ్రుతాః. ౧౯౫. దైత్యదానవయక్షాణాం గంధర్వోరగరక్షసాం, సుపర్ణకిన్నరాణాం చ స్మృతాబర్హిషదోఽత్రిజాః. ౧౯౬. సోమపానామవిప్రాణాం క్షత్రియాణాం హవిర్భుజః, వైశ్యానామాజ్యపానామ శూద్రాణాం తు సుకాలినః. ౧౯౭. సోమపాస్తు కవేః పుత్రా హవిష్మంతోంఽగిరస్సుతాః, పులస్త్యస్యాజ్యపాః పుత్రా వసిష్ఠస్య సుకాలినః. ౧౯౮. అగ్నిదగ్ధానగ్నిదగ్ధాన్ కావ్యాన్ బర్హిషదస్తథా, అగ్నిష్వాత్తాంశ్చ సౌమ్యాంశ్చ విప్రాణామేవ నిర్దిశేత్. ౧౯౯. య ఏతే తు గణాముఖ్యాః పితౄణాం పరికీర్తితాః, తేషామపీహ విజ్ఞేయం పుత్త్రపౌత్త్రమనంతకం. ౨౦౦. ఋషిభ్యః పితరో జాతాః పితృభ్యో దేవమానవాః, దేవేభ్యస్తు జగత్సర్వం చరం స్థాణ్వనుపూర్వశః. ౨౦౧. మనుస్మృతి. 3 అధ్యాయము.

దక్కవగ నుపకారముచేయుటంబట్టి దూరబంధువనుకొనునట్లు చంద్రుఁడు దూరముననుండునని చెప్పఁబడినదని గ్రహించుట మంచిది. అంతియకాని పురాణముల కింతమాత్రము తెలియదని మన మొక్కసారి యాక్షేపింపరాదు.

చంద్రలోకమునుండి భూలోకమున కనేకమార్గముల నుపకారముకలుగుచున్నది. దాని సామాన్యు లెఱుంగఁజాలరు. పితృదేవతలు నిరంతర మీలోకమునకు మేలుకోరుచుందురు. ఒక్కొక్కవర్ణములవారికి నొక్కొక్కతెగ పితృదేవతలు నిరంతర మాశీర్వాదములఁ బంపుచుందురు. చంద్రమండలమునుండి యమృతధారలు కిరణముల మూలమున వృక్షలతాదులఁ దృష్టి చేయుచుండును. రోగుల కనేకవిధములఁ జంద్రకిరణము లుపకరించుచుండునని పెద్దలు చెప్పుచుందురు. అంతియగాక చంద్రగోళమునఁ గల భూతకోటులన్నియు నితరుల మేలుకోరునవియే. అట్టిభూతములకే యామండలమున నివసించునధికారముకలదు. స్వార్థపరుల కందుండఁ జోటుండదఁట. చంద్రునకు నోషధీశుఁడను పేరు గలదుకదా. ఆతనికిరణముల మూలమున నవి బ్రదుకుచు మానవులకుఁ బెక్కువిధముల నుపకారముచేయుచుండును. పశువులకుఁ బక్షులకు వీనికి వానికి నన నేల సకల భూతములకు నోషధులు వనస్పతులు ప్రాణాధారములై యున్నవి. అవియే లేకయున్న నివన్నియు నశించియేయుండును. ఒక్క క్షణమైనను బ్రదుక వలనుపడదు. కావుననే

"హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ,
ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణామవపాతనమ్." ౬౩

మనుస్మృతి. ౧౧ అధ్యా.

అని యోషధుల హింసించుట యెండిపోవని వృక్షములను
వెగఁగొట్టుటయు, నుపపాతకము లని మనువు బోధించెను.
వానివలని యుపయోగము లిట్టివని వారి కెఱుకపడక
యున్న వారది గొప్పపాపకార్యమని యేల శాసింతురు? లోకమున
కుపకరించువాని హింసించుటయే యొక మహాపాపకార్య
మనుట సర్వసమ్మతనియమము. ఈరీతి నీలోకమునకుఁ జంద్రుని
వలన మహోపకారములు గలుగుచున్నవి. కాఁబట్టియే యందున్న
పితరులఁ బితృపితామహ ప్రపితామహులనుగా భావించి
పూజించు చున్నవారము.

చంద్రలోకమునుండి యెట్లుపకారములు మనకుం గల్గు
చున్నవో యట్లే బుధశుక్రభాస్వంగారక గురుశని లోకముల
నుండి మన భూమండలమునకు మహోపకారములు పెక్కుచంద
ములఁ గలుగుచున్నవనుట నిర్వివాదాంశము. ఈయేడుగోళముల
నుండి మనకు క్షేమము గలుగుచుండుటచేతనే వారము లను
పేర వాని నిత్యము స్మరించుచున్నవారము. నీయేడు నొక
దానిపై నొకటిగా నసఁగా దూరముగా నున్నవి. ఇన్నియు
బ్రహ్మాండమున నిమిడియున్నవి. ఇన్నింటియందును భూతకోటులు
గలవు. చంద్రుఁడు సూర్యుఁడు ననుపురుషనామముల గోళములను
జెప్ప నేల యని యనుమానించువారు గలరు. రాజ్యమునకు
రా జుండునట్లు గోళమునకు నధిపతియుండును. మానవులా
గోళాధిపతులనే యుపాసించుచున్నవారు. కృతజ్ఞతకు లక్షణ
మిదియే కదా. కనఁబడునవి గోళము లనియుఁ దదధిపతిపురుషుఁ
డనియు మనవారు చెప్పి రని గ్రహింపక కొందఱపార్థములం
గల్పించి యాకాలపువారికి యంత్రసహాయము లే దనియుఁ

గావున వారికి సత్యము తెలియ నవకాశము లేకపోయె ననియుఁ దూలనాడుచుందురు. అట్టివారికిఁ బ్రపంచజ్ఞానము తక్కువ యని మనము చింతింపవలయును. మఱియు వారికంతటి యోగవిద్యా జ్ఞానము లేదనియు వగవవలయును. సూర్యచంద్ర కుజ బుధగురు శుక్ర శను లాయాగోళాధిదైవతము లనియు వారు భగవదాజ్ఞా ధారులనియు వారిని గొల్చినఁ గష్టములుతొలఁగి భగవత్కరుణకుఁ బాత్రు లగుదు రనియు మన మెఱుంగవలయును. లోకమున నెల్లవారును గష్టకాలమున గ్రహచారము చాలదనుకొనుట సాధారణముకదా. అట్టిగ్రహముల నారాధించినఁ దొలఁగఁ దగు కష్టములు తొలఁగు నని మనము నమ్మవలయును.

ఇట్లు భూలోకమునకు మహోపకారమును సర్వదాకోరు చుండు గ్రహములు నక్షత్రములు వియద్వీథియందు వెలుగు చుండెను. కాని శీతాంశుప్రకాశము లేనికతన నా రాత్రి చీకటి రాత్రియనియే లోకులువాడుదురు. స్పష్టముగా వస్తువులు కనఁబడక యించుకించుక గోచరించుచుండుటం జేసి యా రాత్రి చోరప్రముఖుల కనుకూలముగా బాటసారుల కుపద్రవకరముగా నుండెను. సాయంకాలమునఁ జేయఁదగు సంధ్యావందనాదులగు నిత్యకృత్యములం దీర్చి భానువార మగుట భుజింపక *భాగవత మును గొంతసేపు చదివి యొక నులకమంచముపై శయనించితిని. ఆ రేయి తాంబూలచర్వణము చేయుట నాయలవాటు

* ప్రాతర్ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగతః, రాత్రౌ చోర ప్రసంగేన కాలోగచ్ఛతి ధీమతామ్. తొలిజామున భారతమును బఠించుచుఁ బగటినడుమ రామాయణపారాయణముచేయుచు రాత్రి భాగవతమును జదువుచుఁ గాలముఁ బుచ్చవలయునని ప్రాచీనులగు మహాత్ములభావము.

గాదు. కావున నియమమునసే శయనించితిని. శయనించు నపుడు భగవద్గీతలసార మేమియని వితర్కించుట నాయలవాటులలో నొకటి. తలఁచుగా భగవద్గీతల నాయుద్ధకాలమున నుపదేశించి యుండునా యను నాక్షేపముల వినియున్న వాఁడఁగావున సర్వ కర్తయగు నాశ్రీకృష్ణపరబ్రహ్మమున కింత మాత్రపుఁబనిచేయ సాధ్యము కాదా యనియుఁ దలంచుచుందును. ఎంతటికార్య మైనను క్షణకాలమునఁ జేయఁగలశక్తి భగవంతునకుఁ గలదనియు, నాపరాత్పరునికార్యముల నిర్ణయించి తెలిసికొను యోగ్యత మానవులకే కాదు మహర్షులకు దేవతలకుం గూడ లేదనియే నావిశ్వాసము. ఎన్నియోయుపన్యాసములవింటిని. వారియా క్షేపములను బరిశీలించితిని. కాని వారి కించుకంతయుఁ దెలియఁ దనియు వారికి భగవద్భక్తి లేదనియు నానమ్మకము. కాఁబట్టి యారాత్రి శ్రీకృష్ణమహిమమును నాయోపినంతమాత్రము తలంచితిని. ఏమికారణమో చెప్పఁజాలనుగాని యారేయి గాఢ నిద్ర పట్టెను. భగవన్మహిమమును దలంచుచుండఁగనే నాకుఁ దెలియకయే నిద్ర నన్నుఁ బరవశునిగా నొనర్చెను. అనఁగా నేయూహ మదిఁ దోఁచునపుడు నిద్ర నన్నలముకొనియెనో చెప్పఁజాలనని యిందలిసారము.

నిద్రాదేవి యిట్లు నన్ను వశపఱచుకొనఁగా నామె స్వాధీన మున నుంటిని. ఆమెపరిజనుల, వర్ణింపఁదగిన భాష నాయధీన మునలేదు. గాఢనిద్రపోవుచున్నవాఁడనని నాయాత్మకుఁదోఁచు చునేయుండెను. గాఢనిద్రయం దిట్టిజ్ఞానమున కవకాశము గలదా యన్న ప్రశ్నమువచ్చినపుడు బదులుచెప్పుటయుం గూడఁ గష్టమే యని నాభావము. అయిన నారేయి నిద్రగాఢతరస్వరూప యని

చెప్పఁగు. అంత నొకముహూర్తమునకు నెవఁడోయొక పురు
షుఁడు నాచెంతకువచ్చుచున్నయట్లు తోఁచెను. ఈసమయమున
నెవ్వఁడు వచ్చుచున్నవాఁడో యని తొలుదొలుత దిగులు
పడితిని. అంతలో దేహము కంపించెను. చిఱుచెమటలు దేహము
నిండఁ బొడమెను. ఇంక దిక్కెవఁడు గలఁడాయని యూహ
యొకటి తోఁచెను. ఇంచుక దూరములో నాబంధువులు
పరుండి యుండి రనుట స్మృతికిం దగిలెను. వారిని బిలువఁ
బ్రయత్నించితిఁగాని మాట రాదయ్యెను. పిశాచమా యను
భ్రాంతి కల్గెను. భగవత్సేవ చేయువానిచెంతకుం బిశాచము
లరుదెంచునా యన్నధైర్యము కల్గెను. నాచేయు దైవసేవ
పిశాచోచ్చాటన పటుత గలది కాదేమోయన్న సందియము
కూడ నుదయించెను. ఇన్నియు నొక్కబుద్ధియందె ట్లిమిడినవో
స్థలము చాలినదో, యొకదానిపై నొకటి యెక్కికూరుచుండెనో
వచింపఁజాలను.

ఇట్టిశంకాదులు కలుగుచు నడంగుచుండునంతలో
గజ్జెలకలరవము వీనులంజొచ్చెను. ఇదేమి? వచ్చువాఁడు పురు
షుఁడను కొంటినిగదా. ఇపుడువచ్చునది స్త్రీయని తోఁచెడు.
మొలనూలు చిఱుగంటల చప్పుడా లేక మణిమంజీరనాదమా
యను వితర్కము పొడసూపెను.. ఇట్టులూహించుచుండఁగనే
వేసిన తలుపు వేసినట్లుండఁగనే యొకబాలుఁడు శ్యామసుందరా
కారుఁడు కనఁబడెను. మణిమయమకుటము దివ్యరత్నకుండల
ములు లోనగునాభరణములు మెఱయుచుండఁగా నురమున
శ్రీవత్సకౌస్తుభములు తేజరిల్లుచుండఁగా నాబాలుఁడు కనఁబడి
చెంత కరుదెంచెను. మురళి దక్షిణకరమున నలరారుచుండెను.

లీలారవిందము సవ్యకరమున మనోహరముగఁ గనంబడుచుం డెను. ఆనయనారవిందములు కర్ణమూలములవఱక వ్యాపించి యుండ నారూపమునుజూడ రెండు కన్నులు చాలవనుట యతిశయోక్తి యనువారుసుందురాయని తోఁచెను. ఆబాలుని నడక నృత్యముసలుపుచు వచ్చువానివలె సుండెను. మంద గమనము నాబాలకుని ప్రశాంతచిత్తమును దెల్పుచుండెను. ముఖసరసిజముపఁ దోఁచుసుస్మిత మతనియానందమయత్వమును వెల్లడించుచుండెను. నామంచమునకు నాబాలకుఁడు నృత్యము చేయుచువచ్చినతావునకు నడుమ బారెడు దూరము గలదు. మహానందమున నాబాలకుంగని రాధానాథునిఁగా నెంచి

శ్లో. "కనకరచితచేలం యక్షరాజత్కుచేలం
కరతలధృతశైలం కాలజీమూతనీలం
త్రిజగదవనశీలం ఖండితారాతిజాలం
నతజనసురసాలం నౌమి గోపాలబాలమ్."

అని స్మరించితిని. ఇంతలో

సీ. "ఇందీవరశ్యాము - వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ - గామితమందారు
సురుచిరలావణ్యు - సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు - నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను - గౌశేయపరిధాను
బన్నగశయను న - బ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు - మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు." 1

అను భాగవతపద్యము స్మృతికిం దగులఁ బఠించితిని. ఆపద్యము పఠించునప్పుడు నాకెన్నఁడు గలుగనియానందము గలిగి కన్నులనిండి జలము ధారగా వెలువడసాగెను. దాన నవ్వలి స్తుతిపాఠమును బఠింప వలనుపడదయ్యెను. కన్నీటి ధారలు చెక్కిళ్లపైఁ బాఱుచుండఁగా నేమియుఁ బలుకఁజాలక యూరకయుంటిని. ఆబాలుఁడు మఱింతచెంత కరుదెంచెను. అంతలో నాకన్నులు మూఁతపడియెను. దేహము వివశ మయ్యెను. అత్తఱుణముననాబాలుఁ డేమి మాటలాడెనో నేనేమి బదులు చెప్పితినో నాకుం దెలియదు. మనస్సుగూడఁ దనపనిని దాఁచేసిన ట్లగపడదు. చేసియే యున్న నాకేల తెలియకుండును ? ఎంతసేపు తద్రీతిగానుంటినో నాకుం దెలియదు. కాని నా కించుక దేహముపై స్మృతివ్యాపించునప్పటికిఁ గృష్ణానదీతీరమున నున్నట్లు తోఁచెను. నాకంటె ముందాబాలుఁడుపోవుచు నాతో నేమేమో మాటలాడుచున్నయట్లును, నేనూఁకొట్టుచున్నట్లును నడుమ నడుమ బదులేమో చెప్పుచున్నయట్లును మాత్రము నాకుఁ దెలిసెను. అంతనా బాలకుఁడు వత్సా ! ఇది కృష్ణవేణీ తీరము. పరమపావనమైనది. దీనిగాలిసోఁకినయంతన పాపజాలములు తొలఁగును. ఇఁక నిందలి యుదకస్పర్శము మహాఫలద మని వేఱుగఁ జెప్పనేటికి? ఇది రాత్రిసమయము కాన స్నానము చేయరాదు. భక్తిభావమున వీనిని స్పృశింపుము. నమస్క-

రింపుము. ఈజలబిందువులఁ దలపైఁ జల్లుకొనుము. జ్ఞానాజ్ఞాన కృతపాపముల నిర్మూలింపుము. లోకపావనీ! యని ప్రార్థింపుమని యానతిచ్చెను. అతఁడిట్లు పలుకుచుండ జలములు గానవచ్చెను. జలచరములుగూడఁ గదలకయుండెను. వారు చెప్పినట్లే చేసితిని. అంతలో వేఱొకనది కనబడెను. ఏమో పిలువఁబోయి గోపాల కృష్ణా! యంటిని. ఆఁ అని యాబాలగోపాలుఁడు పలికెను. కాని తిరిగి చూడక పయనము చేయుచుండెను. నేనునుగూడఁ బోవుచు నిదియొక నదియకదా యని యడిగితిని. వత్సా! ఇది గౌతమీనది. గోదావరియని దీని నిప్పు డందురు. మున్ను చెప్పినట్లే యిందును జేయుము. అని యాజ్ఞాపింప నేనట్లే చేసితిని. ఇఁకఁ గన్నులు మూసికొనుమనియె. కన్నులు మూసి తెఱచునంతలో నొక సముద్రతీరమున నున్నట్లు నాకుం దోఁచెను.

సర్వకాలము పరిపూర్ణమై యద్వంద్వమై మహానందమున నోలలాడుచున్న భావమును దెలుపుచు నిర్వికారమై బహువిధ ప్రాణిసంతతి నిబిడగర్భమై యపరిమేయ గాంభీర్యమై యనంత మహిమమై యగ్నిగర్భమై శుద్ధమై యాసాగరము పరబ్రహ్మము వలె నొప్పారుచుండెను. అకాలమగుటం గాఁబోలు యాదస్సు లించుకయుఁ జలింపక యుండెను. అత్తఱి నాజలరాశి యభంగ కరమ్ముల వానిని జోకొట్టునట్టులుండెను. దానిమహిమము వర్ణింప నెవ్వరికే నశక్యమని తలంచితిని. భగవత్స్వరూపమే కాకయున్న నిది పరిపూర్ణత నవ్వదా కాంచఁజాలునా యని నిశ్చయించితి. ఇంతలో నాకు ముందు నిలిచియున్న శ్యామ సుందరుఁడు వత్సా! యని నన్నుం బిలిచెను. ఊఁ అని పలికితిని.

ఇది లవణవారాశి. పరమపావనమైనది. భక్తిమై నమస్కరింపుమా అని యాజ్ఞాపించెను. తదాజ్ఞ శిరసావహించి భగవత్స్వరూపము గనే దానిని భావించియున్నవాఁడ గావునఁ జేతులెత్తి నమస్కరించితి. పరమేశ్వరస్వరూపమా, సాగరవర్యమా, నాపాపముల లోఁగొని నన్నుఁ బాలింపుమా యని వేఁడితి. స్నానము చేసిన బాగనుబుద్ధి నాకప్పుడు తోఁచెను. రాత్రికాలమునఁగాని పర్వదినేతరదినములలో యందుఁగాని సాగరస్నానము చేయరాదు. గ్రహణకాలమున రాత్రి దోషము లేదని యాకిశోరమూర్తి తెలిపెను. నామదిఁగలయూహ యెట్లెఱింగెనో యని యాలోచించి బాలకృష్ణమూర్తి గావున నాతఁడెఱుంగనివియుఁ గలవా యని సమాధానము చేసికొని నిలిచితిని. వత్సా! ఈసాగర భావముననే పురుషోత్తమక్షేత్రము గలదు. ఇందే యాపురుషోత్తముని మూర్తికనువగు వృక్షముండెను. దానిశాఖచేతనే పురుషోత్తము నాకృతి యలవరింపఁబడియెను. కావున నీస్థలము సకలపాపములఁ బోఁగొట్టునది. అని పలికెను. నేను మహాత్మా! పురుషోత్తముఁడనఁగా నేయవతారమని యడిగితిని. పక్కునే నవ్వి యేయవతారమెత్తినను పురుషోత్తముఁ డనఁబడునుగదా యని పలుకుచు నవ్వుచు నాదేవాలయ మున్నదిక్కు మొగంబై నిలువం బంచి జగన్నాథునకు నమస్కరింపుమనిరి. అంతకుమున్నే రెండు మూఁడు తడవ లాదేవాదిదేవుని దర్శించినవాఁడను గావున దన్మహిమమును వినియున్నవాఁడఁ గావునను బుద్ధరూపా! మహాత్మా! కృపానిధీ! నన్నుఁ గావుమా యని నమస్కరించితి. అంతలో నామది నొక్కసందియ మంకురించెను. బుద్ధావతార మిదిగాదని కొందఱు వచింతురు. తద్విషయమడిగి తెలిసికొనుట యుక్తము.

ఈయూహ నామదిందోఁచునంతలోఁ బక్కుననవ్వి బాలకా! సంశయము నడంచుకొని విచారింపుచుంట బుద్ధిమంతులలక్షణము కాదు. పెద్దల నడిగి తెలిసికొని దానిని దొలఁగించుకొనవలయును. నీవూహించిన సిద్ధార్థుఁడు బుద్ధావతారమని పరిగణింపఁబడు నవతారపురుషుఁడుకాఁడు. అట్టి బుద్ధనామధారులు పలువురుకలరు. *బౌద్ధమతమనునది పురాణములయందుఁ జెప్పఁబడుచు దూషింపఁబడుచుండుట తెలియవా. నీవూహించిన సిద్ధార్థుఁడు మతము స్థాపింపఁబూని యందులకుం దగు తపశ్శక్తిలేక యుపవాసాది నియమములం బూనునంతటి మనోదార్ఢ్యము చాలమి నెట్టు లింక మతమును స్థాపింతునాయని యూహించి పాండిత్యము లేనికతన వేదముల కర్థముచేసికొనఁజాలక యొట్టకేలకు భూతదయ ప్రధానమని బోధింపసాగెను. కాని యక్కాలమున నతఁ డొసరించిన కార్యము మహత్తరమనుటను శంకనొందఁబనిలేదు. చాలమంది యాతనికి శిష్యులైరి. వేదములను దూషించుట యతని పాండిత్యలోప మనక తప్పదు. అతీంద్రియ విషయముల నాతఁ డెఱుంగఁజాలకపోయెను. అయినను బుణ్యపురుషుఁ డనవలయును. ఆ కాలమునఁ గేవల దురాచారముగనున్న భూతహింసను మాన్పఁ బ్రయత్నించెను. శక్తివంచనచేయక తన యాయుస్సును దారవోసెను. అంతియకాని యవతారములలోఁ బరిగణింపఁ బ్రయత్నించుట యసంగత కార్యములలోఁ

*బుద్ధులు:—ఇహ ఖలు బౌద్ధశాస్త్రేషు సంప్రోక్తాః పంచవింశతిర్బుద్ధా దృశ్యంతే. తేషాం శుద్ధోదనారసాత్ మాయాదేవీ గర్భజాతః శాక్యసింహ సర్వార్థసిద్ధార్కబంధు గౌతమేతి నామచతుష్టయేన ప్రసిద్ధః. అంతిమతమః లోకవిశ్రుతో బుద్ధః. అని శబ్దకల్పద్రుమము.

బ్రధానము. తపోనియతి నెఱుంగనివా రాతనినే బౌద్ధావ
తారమందురు. వారికేమియుఁ దెలియదు. ఇంకను గలియుగమునఁ
గొంతకాలముజరుగఁగా వేదములబద్ధము లనువారును, వారిని
మహాత్ములనుకొనువారును బెక్కురుందురని తలంపుము. వేదముల
పూజ్యములని తోఁచినఁగాని ధర్మము నశింపదు. ధర్మము
నశించినఁగాని పాపము తలయెత్తదు. అప్పుడు పాపమతులు
లోకవంచనకుం బూని తిరుగుదురు. వర్ణధర్మములు పనికి
రావందురు. కల్పితములందురు. ఉండరావందురు. వారిమాటల
నమ్మువారు పెక్కండ్రుందురు. వారే లోకము నుద్ధరింప నవత
రించిరనియు భగవదంశసంభూతులగు మహాత్ములు వారి
కీకార్యము నొనర్ప నాజ్ఞాపింతురనియు నమ్ముదురు. కావున
నీవాశంక నిర్మూలించుకొనుము. అని పలికి నిమీలితనేత్రుఁడవు
కమ్మా యని హెచ్చరించెను.

కన్నులుమూసిన క్షణకాలమునకు గయాక్షేత్రమున
నున్నట్లయ్యెను. వత్సా! ఇదియే గయాక్షేత్రము. పితృముక్తి
హేతువనంబడు పుణ్యభూమి యిదియే. ఇందు శ్రీమహావిష్ణు
పాదచిహ్నిత పాషాణముగలదు. ఆ దేవాలయమున నదిగలదు.
నమస్కరింపుమనఁ గరయుగము జోడించి నమస్కరించితి. అంతలో
గంగాతరంగశీకరసంభృతవాయువులు మేన సోఁకిన ట్లయ్యెను
శీతబాధమించెను. దాసశరీరము కంపించెను. వత్సా! ఇదియే
గంగాతరంగిణి. పరమపావని. త్రిలోకపూతచరిత్ర. వందన
మాచరింపుము. ఇదియే మణికర్ణికయనుచోటు. ఇందేకదా
నీవొక్కసారి మునిఁగిపోవుచుండ నెవ్వరోపట్టి యీడ్చి బయట
వైచిరి. నీవచ్చెరుపడితివి. సంశయ మింకను దొలఁగకున్నది.

ఆమెయే యన్నపూర్ణా భవాని. పరదేవత. మహామాయ. నీకా
జననియందు భక్తి కలదుగాని యామెయే నిన్నుద్ధరించెనని
యెఱుంగఁజాలవైతివి. వయస్సున నపుడు కడుంజిన్నవాఁడవు.
ఆయన్నపూర్ణయను పేర నొకవిగ్రహ ముండుతా వదియే.
విశ్వేశ్వరనామకలింగవరము గలయాలయ మదియే. వినతుఁ
డవు కమ్మనఁగా శిరస్సువంచి నమస్కరించి తలయెత్తునంతలో
నయోధ్యగనంబడియె. సరయూనదీతరంగములు తటము నాస్ఫా
లించుధ్వనులు శ్రుతివివరంబులంబడియె. వత్సా! ఇదియే శ్రీరామ
జననపవిత్రీకృతభూతలం బగునయోధ్యాపురవరంబు. పరమ
పావనసరయూనదీసమన్వితము. భక్తితో మ్రొక్కు మనఁగా
నామాటలు నాకెంతయో సంతోషము నొసంగుచుండఁగా
నార్తరక్షామణీ, ఆపన్నివారణా! శ్రీరామచంద్రా! కాపాడుమా
యని నమస్కరించితిని. అంతలో నొకశంక నామదిఁ దోఁచెను.
మనసునజీర్ణింపఁజేసికొనుట మంచిదికాదని తలంచి మార్గద
ర్శకా! శ్యామసుందరా! త్రేతాయుగమున శ్రీరామమూర్తి
యవతరించిననాఁటియయోధ్య యింకను నశింపకయుండఁ
దరమా. ఆపేరఁగట్టిననగరము కదా యనియంటిని. కుమారా!
యని నన్నుంబిలిచి యాబాలరూపపరబ్రహ్మము నీమది నిట్టి
సందియము లుపయింపనీయకుము. ఆనగరమే యిది. కాలము
మాఱుచుండిన భూభాగములు మాఱ్పునొందవు! పెక్కుమా
ర్పుల నొందినదిగాని యీస్థలము మాఱ్పునొందలేదు. గృహ
ములుమాఱినవి. రాజగృహభూమి మాఱలేదు. కావున నదియే
యీనగరమని భావింపుము. సరయూనదియుం దింకను గొన్ని
యాకాలపుఁజిహ్నములు గలవు. ఆస్తికులు కానివారియు

క్షులఁ జెవియొగ్గి వినకుము. అవి స్థిరములు కావు. క్షణక్షణవిలక్షణములు. నిరర్థకములు. వృథాకాలము గడపువారట్లు పల్కుచుందురు. వానితో సకేల! ఇట్టిపవిత్రనగరమును జూడఁగనే భగవన్నివాసమని భావించి నమస్కరింపుమని హెచ్చరించెను.

## హరిద్వారము

అత్తఱి నొకతమస్సు నన్నలముకొనినట్లాయెను. దాన నాయొడలు పరవశమయ్యెను. ఎందున్నవాఁడ? అన్నయూహ కలిగెను. అంతలో నొకనదీతటమున నున్నజాడ మదిఁదట్టెను. తుహినబిందువులఁ గురియించువాయువులు మేనసోఁకెను. జలప్రూరమునుండి వీతెంచువాయువు కదా యిది యని తోఁచెను. ఎట్టకేలకుఁ గన్నులు విప్పఁజాలితిని. శ్యామసుందరమూర్తి నాపురోభాగమున నుండెను. నేనూహించినట్లే యదొక నదీతీరము. తుహినముమించు నంపలిజలము తనమహిమమును లోకులకు నభంగతరంగవిశాలకరములం దెల్పుచున్నననఁజాలి యుండెను. తటమునుదాఁకి తరంగములు శకలములై జలబిందువులచే నందున్నవారికిఁ దమభంగమును దెల్పుకొనుచు వెనుకకుంబోవుచు మరల వీరావేశమున మఱింత పెరిగివచ్చుచున్న చందమున నొకదానిమించి యింకొక్కటిగ వచ్చుచుండెను. వాయువులు గంధవహనామమును సార్థకము చేసికొన నెంచి కాఁబోలు జలములపైఁ దేలియాడుకలువపూవుల నటునిటు తూలించుచు నందున్న సౌరభమును గొనివచ్చుచుండెను. అంపలి జలజంతువులు విశ్రాంతినొందియుండెను.

అంత బాలకా! యని పిలిచి యాబాలమూర్తి ధరఁడుసు చూడుము. ఇదియ హరిద్వారక్షేత్రము. ఇది గంగాతరంగిణి.

భరతఖండమున సత్కృత్తమస్థలములలో నిది విఖ్యాతిం గాంచి నది. నమస్కరింపుమనియె. నే నట్లే యొనరించి మహాపురుషా! ఒక్కసందియ ముదయించెడిని. హరిద్వారమనఁగా నర్థమేమి? అనేకులుతోఁచినట్లెల్ల నర్థము చెప్పుదురు. దేవాలయమునకు ద్వారములు మూయఁబడినవనియు, అవి తెఱచికొని లోనికిం బోయినచో వైకుంఠమునకుం బోవుననియుఁ గొందఱు పలుకుదురు. గుహాగలదనియు, దానింజొచ్చినవారు మరలనేరరనియు నాకారణముననే ద్వారము మూయఁబడియుండుననియు ము న్నొకతఱి నొకఁ డీరహస్యమును బరీక్షింపఁగోరి యొకధీరుని నడుమునకుఁద్రాడుగట్టి లోనికిఁబంపెననియుఁ గొంతసేపటి కారశ్మిని లాగఁగా నాపురుషుఁడు వచ్చెఁగాని పరవశుఁడై వెఱ్ఱివానివలె నవ్వుచు నెంతకాలముచూచినను వానికి యథాపూర్వస్మృతిరాదయ్యెననియు దానిచే లోపలనున్నదేవత లందలి రహస్య మితరులకుం దెలియకుండుగాక యని లోనికిం జొచ్చిన వానినున్మత్తునిగాఁ జేయుదురనియు నిట్లెన్నియో తెఱంగులఁ బల్కుదురు. ఈసంశయము తొలఁగింపుమని వేఁడితి. దరహాస మలర నాబాలుఁడు కుమారా! హరిద్వారమనఁగా వైకుంఠ ద్వారమని యర్థము. ఇందు భగవంతు నియతి నారాధించు వారు కైవల్యము నొందుదురు. ఇదియ యిందలిరహస్యార్థము. ఇతరస్థలముల వేయివత్సరములు నియతి భగవంతు నారాధించుటయు నిందొక్కదినము మాత్రము నియతి నారాధించుటయు సమానఫలము నిచ్చును. చక్కఁగా నిందున్నగంగానదిసి ధ్యానింపుము త్రిలోకపావని. గంగారూపుఁడగు భగవంతుని బ్రార్థింపుము. గంగ స్త్రీయనియు భగవంతుఁడు పురుషుఁడనియు

నిట్టి లోకదృష్టిని దూరము చేయుము. లింగ భేదము సామాన్య లకు. భగవంతుఁడు సర్వశబ్దవాచ్యుఁడు. గంగయు భగవత్స్వ రూపిణియే. ఆబుద్ధితో స్నానముచేసిననే పాదములు తొలఁ గును. లేకయున్న దేహమలినము తొలఁగు. ఇది సత్యమని నమ్ముము. ఇఁక నిటఁ దడవుండరాదు. పోఁదగుతావు లనేకములు గలవు. అని హెచ్చరించెను.

ఆసమయమున రాత్రియందెంతకాలము గడచెనో నాకె ఱుకపడక యుండెను. నక్షత్రములం గాంచి రాత్రిగతశేష్య ముల నిర్ణయింపఁజాలునంతటిజ్యోతిశ్శాస్త్రపాండిత్యము నాకుం గలదు. కాని యపుడంబరమునఁ బొలుచునక్షత్రములఁ జూచి నను దెలిసికొనఁజాలకయుంటిని. ఇదియొక తమోవికారము కాఁబోలునని యపుడపు డెంచుచు నెంతకాలము త్రియామ యందు గడచెనని యాబాలునడుగఁ దలఁచియు నంతలో దానిని మఱచిపోవుచుంటిని. అంతలో నాచోటు నాకగపడక వేఱొకస్థలము కనఁబడియెను. ఇంతలో నెట్లువచ్చితినని యచ్చెరు వందితి. ఆస్థలమున నొకగ్రామము కనఁబడియెను. చెంతకుం బోయిచూడఁగా నది గ్రామముకాదు. వృక్షవాటి. ఆగాఢాంధ కారమున నదేమికారణముననో సకలపదార్థములు నాకుఁ గనఁ బడుచుండెను. ఆబాలునిమహత్త్వమునఁ గాఁబోలు. ఆవృక్ష వాటిం జొచ్చితిమి. నీరంధ్రముగా వృక్షశాఖ లుండెను. ఆకాశమే కనఁబడదయ్యెను. పరిశీలించి చూడఁగా మినుకుమినుకు మని యొకటిరెండు తారకలప్రకాశము కనంబడుచుండెను. మఱినాలుగడుగులు పెట్టితినో లేదో యందొకగృహము కనం బడెను. అదిపరిశీలింపఁగాఁబర్ణశాల. అందెవ్వరో నియతిమీాఱఁ

కూరుచుండియున్నట్లు పొడకట్టెను. ఆబాలుఁడు నాకాపర్ణ
శాలం గనఁబఱచి యందొకమహాత్ముఁడు కలఁడు. యోగము
నుండి విరమించుచున్నవాఁడు. నమస్కరింపుము. ఆయన నిన్ను
డుగుమాటలకు బదులిమ్ము. అనిపంచెను. లోపలి కేగిన నేమ
నునోయని యనుమానించితిని. కాని యోగియని వింటినిగాన
వారికిఁ గ్రోధమునకుఁ జాలదూరమనియుఁ దలంచితిని. మహాపు
రుషుఁడాజ్ఞాపించుచున్నవాఁ డనియు నూహించి నాలుగడు
గులు ముందుంచితిని. అంతలో నాయోగి సమాధిచాలించి
కన్నులు విప్పి నన్నుంగాంచి మరలఁ గన్నులుమూసి యొకక్షణ
కాలముండి నిమీలితనేత్రుఁడై రమ్ము, కూరుచుండుమని సంజ్ఞ
లఁదెల్పెను. నేనుభక్తియుక్తి నాతనికిం బ్రణమిల్లి కరములొగ్గి
నిలుచుంటిని. కూరుచుండుమని దర్భాసనము జూపెను. వారి
యానతిమైఁ గూరుచుంటిని. బాలకా! నీయాగమనము నెఱింగి
తిని. పరమేశ్వరుఁడు సాయపడి త్రోవచూపుచుండ నరుగరాని
చోటు లుండవు. పుణ్యవిశేషమున సర్వజ్ఞుఁడు మార్గదర్శకుఁ
డయ్యెను. ఇది హిమాలయారంభభాగము. ఇందే నివసించుట
కష్టము. ముందుముందు నీవరుగుమార్గములు దుర్గమములు.
మానవులకు సామాన్యుల కగమ్యములు. కొన్నితావులుమాన
వులకు సర్వథా గమ్యములు కావు. ఈయర్ధరాత్రమున
సాంద్రనీహారసంవృతభాగములు చూడఁజాలవు. మేముయో
గులము గావున సిద్ధులుకొన్ని మాకుం దెలిసియుండు. ఈ
యంజనము నయనముల నలందుము. నిదాఘకాలసూర్యరశ్ములు
వ్యాపించియున్నట్లు సకలపదార్థము లగపడును. భగవంతునను
సరించువాఁడవు గావున దుర్గమమార్గములు సుగమములవు.

అనిపలికి యొకయంజనము నీయఁ గన్నులకుఁ బూసికొంటిని ఆయంజనమాహాత్మ్యమేమనివర్ణింతును! పదియోజనములదూరముఁ నున్న యత్యల్పపదార్థము స్పష్టముగాఁ గానంబడుచుండెను. అత్తఱి నామునికి మరల నమస్కరించితి. కృతార్థుఁడవుకమ్మా యని యాశీర్వదించెను. సెలవొంది బయటికి రాఁగా నందే నిలుచున్న శ్యామసుందరమూర్తి యద్భుతమహిమముగలయోగి వర్యునింగంటివికదా. ఏమిలాభము గలిగె? అని ప్రశ్నింప నంతయు విన్నవించితిని. పకపక నవ్వి యిఁకఁ బయనము సాగింతము రమ్ము. అని ముందునకు నడువసాగెను. నేను నామహాత్మునివెంట నడువ నారంభించితిని.

## హిమాలయపాదము

ఆవృక్షషండముదాఁటి పదియడుగులమేర దారిసాగి పోఁగా మహోన్నతమగుపర్వత మొక్కవిధముగా నాకుంగన్పట్టెను. దానినెక్కఁ బోవుచున్నామనునూహయుఁ దోఁచెను. మదిఁగలయుత్కంఠతో మహానుభావా! ఈగాఢాంధకారము లేకయున్న నీపర్వతరాజమును జక్కఁగాఁ జూడఁ జాలుదు. వేఁకువజామువఱకిటనుండి యవ్వలఁ బయనముసాగించిన మేలని నాకుందోఁచుచున్నది. తమచిత్తమురీతిఁ జేయుఁడంటిని. వెనుకఁ దిరిగినన్నుంగాంచి నీవన్నది నిక్కము. నిస్పృహాచెంద నీయక మదినుత్కంఠ దీపింపఁజేయుము. త్వరపడకుము. నా వెంట రమ్ము. అని పలికి ముందునకు నడువసాగఁగా నేనును నలుప్రక్కలం జూచుచుఁ గనఁబడియుఁ గనఁబడనియట్లున్న మహీధ్రములం గాంచుచుఁ బలుసందియములంజిక్కినమదితోఁ జనుచుంటిని. కొన్నినిమేషములు నడచితిమో లేదో అంతలో

లోకవిచిత్రము తోఁచెను. ముందరుగుచున్న శ్యామసుందర
మూర్తి పకపక నవ్వెను. ఆనవ్వుతోన యాకసమంతయుఁ దెల్ల
నయ్యెను. చీమలు మొదలుకొని యేనుఁగులవఱకుఁ గలయల్ల
మహాభూతకోటి గానంబడియెను. పర్వతమెంతయెత్తుగానున్నదో
యందేయేవృక్షము లెంతయెత్తుగా నున్నవో వానియం దెన్ని
ఖగము లున్నవో స్పష్టముగఁ దోఁచెను. నక్షత్రములును గనఁ
బడుచుండెను. నాకప్పుడు గలిగినసంశయముల పిండు తొలగింప
శక్యము కాదు. కాని ముందరుగుబాలుఁడు మనుష్యమాత్రుఁడే
యైన నాగతి యేమగునో. అతఁడు పిలువకయే పలికి నాప్రక్క
మోము త్రిప్పి బాలకా! సంశయింపకుము. ఇదేమి విచిత్రమా
యని యూహింపకుము. నీకుఁ గనఁబడవలయుననియే యీ
తేజస్సు కల్పింపఁబడినది. దివాకరనిశాకరులతేజస్సు కాదు.
ఇది యనిర్వచనీయ మనఁదగు. పట్టపగటియందువలె వస్తువ్రాత
మగపడును. జ్యోతిస్సులును గనంబడు. ఆచర్చ నీకేల? నీశంకలం
దీర్పఁగదా వచ్చినాఁడను. ఇఁక నాలకింపుము.

ఇదియె హిమాలయపాదము. ఇది పరమర్షిసంవాసము.
ఇందుఁ బెక్కండ్రుమహర్షులు గలరు. వారిజాడ లితరులు గనుఁ
గొనఁ జాలరు. ప్రచ్ఛన్నవేషముల వారుందురు. వారినిం గాంచి
నప్పుడు వనవాసము చేయు ననాగరకు లని తోఁచును. యోగు
లగువారలే వారిజాడం గాంతురు. ఇతరులు వారిం జూచి
యేవగింతురు. వారుండుగుహలు సామాన్యులకు గోచరింపవు.
గుహాయుండినజాడయే తెలియరాదు. హిమావృతములై గుహా
ముఖము లుండును. వారు వలయునప్పుడు ద్వారముగానున్న
గండోపలము జారి నొసంగును. ఇది వర్ణనమనుకొనకుము.

ముందుముందు నీకీవిషయము ప్రత్యక్షము గాఁగలదు. మంచుగప్పుకొనఁగా గండోపలము ద్వారమున నుండఁగా లోపలనున్నవా రంధకారమున నేమిచేయుదు రని సందియ మొందెదవేమో వత్సా! వినుము. కలరూపు తెలిపెదను. గుహాంతరాళములు రమ్యహర్మ్యములవలె నుండును. వారి తపశ్శక్తిచే నందు వెలుతురు తోఁచును. దివారాత్ర భేదము వారికి స్పష్టమగుచుండు. సంధ్యాకాలములు తెలియఁ బడుచుండు. కాలోచితసత్కృత్యముల వారాచరించుచుందురు. ధర్మమభివృద్ధియగుంగాక యని వారు నిరంతరము కోరు చుందురు. వారితపశ్శక్తిని ధర్మరక్షణకై యుపయోగింతురు. అట్టివారికిఁ గాలభేదములు తెలియఁజేయుట భాస్కరునిపని. కాఁబట్టియే జగచ్చక్షువు, కర్మసాక్షి, లోకబాంధవుఁడు నను పేరులు సూర్యునకుం గల్గెను. పావనజలము లాగుహాంత రాళములం బాఱుచుండును. అందే వారు స్నానము చేయుదురు. ఆగుహాలయందే విశాలాంతరాళములు కలవు. అందు వనస్పతులు క్రిక్కిరిసి యుండును. కందమూలఫలము లనవరతము వారికందే దొరకును. వారు వెలుపలికి రానక్కఱయే యుండదు. రోగబాధలందుండువారికిం గలుగవు. జ్యోతిర్లతలు రాత్రులయందు దీపములవలె వెలుఁగుచుండును. అవి యున్నస్థలముల వసియించువా రరోగులు, దృఢకాయులు నై యుండురని నమ్ముము. ప్రపంచచరిత్రము వారపుడపుడు దివ్యదృష్టిం బరికించుచుందురు. అధర్మముంగూర్చి విచారింతురు. ధర్మాత్ములు కొలఁదిగా నున్నవారని వారికిం దోఁచిన బరితపింతురు. ధర్మదేవతనే దారనవరతము పూజించుచుందురు. వేయేల?

ధర్మరక్షణమున బద్ధాదరులై పాటుపడుదురు. వారికి వాంఛలు వేటియొక్కటియైనను లేవు. క్షుత్పిపాసలు వారిని బాధింపవు. కందమూలములు భక్షించువారు కొందఱు గలరు. వాయుభక్షణము చేయుచుండువారు కొందఱు గలరు. మనశ్శక్తి ననుసరించి వారినియమములు నాహారములు నుండును. వనస్పతుల శక్తి యమోఘమైనది. ఒక్కపత్త్రము నమలిన నాకలిదప్పు లుండవు. అట్టిశక్తి కలదని మహర్షు లెఱుంగుదురు. అట్టి వృక్షము లీమహాపర్వతరాజమున ననేకస్థలములఁ గలవు. ఇతర సందియముల మాని ముందు చూడఁదగుతావులం జూపించెద రమ్ము. అని తెలిపి ముందడుగు వైచెను.

## పర్వతపాదోర్ధ్వభాగము

మాటలాడుచునే పోవుచు నొకయున్నతభాగముం జేరితిమి. పట్టపగటివలెనే యుండెను. ఆపర్వతము పైభాగమునుండి దృష్టి వ్యాపింపఁజేసితి. క్రిందిజంతువులు సూక్ష్మరూపముల నున్నయట్లు కనంబడెను. ఎంతయెత్తుననున్నారమోకదా యని తోఁచెను. మేమున్నతావునకు నొక ప్రక్కనుండి యుత్తుంగతరంగములతో శరవేగమును మీఱి నది ప్రవహించుచుండెను. అది యత్యున్నతపర్వతభాగమునుండి వచ్చుచుండ దానివేగము వర్ణనాతీతముగ నుండెను. దానిలోఁతు నెఱుంగ నావంటివానికిఁ దరమగునా? మదపుటేనుఁగు ప్రమాదవశమున దిగిన దాని దానిరూపము సహస్రశకలము లగు ననుట స్వభావోక్తియే కాని యతిశయోక్తి కానేరదు. దానిం జూడఁగనే నాకమితానందము భక్తియుఁ బొడసూపెను. మహాపురుషా! ఇదొక సెలయేఱు. దీని కేమేనిపేరు గలదా యంటిని. కుమారా! ఇది

నెలయేఁబనుభ్రాంతి కలిగినదా. కాదు కాదు. పవిత్రీకృతవిశ్వంభర యనంబరఁగు గంగానది. ఇది యీ పర్వతమున ననేకనామములం బరఁగుచుండును. ఇది మందాకిని యనంబరఁగు. మఱొక పేరు కూడఁగలదు. నీవు మందాకిని యనియే ధ్యానింపుము. మఱొక గంగాశాఖయే దీనం గలియు. ఆస్థలములను జూడఁగలవు. ఇందు స్నానమొనరింపుము. ఆలసింపకుము. భయంపడకుము. ఇందుఁ దుహినవాతములు నిన్ను బాధింపఁజాలవు. నదీవేగము నిన్ను విపన్నుంజేయంజాలదు. అని యానతీయ నందు స్నానమొనరించి యాచమించి వచ్చి యీ మహాత్మునిపాదములకు నమస్కరించి నిలిచితిని. నన్నుఁ జూచి నదీజలముల కవ్వలిభాగమును జూడు మనియె. మందాకినికవ్వల నత్యున్నతపర్వత మొకఁడుండెను. దానిక్రింద నదీజలములకు నించుకదూరమున నొక చట్రాతిక్రింద నొకముని తపమొనరించుచుండెను. కౌపీనమును ధరించి జడలు ముడిగి నీరుకావిరంగునున్న యుపవీతమును దాల్చి యూర్ధ్వ బాహుఁడై యాతఁడు తపమొనరించుచుండెను. ఎంతటి వర్షమైనను, ఎంత హిమము కురియుచున్నను మహాత్ముఁడగు నాతనినియతికి భంగమురాకుండఁ గాపాడుట కాగండోపలము చాలియుండెను. నిర్మలమై దానిక్రిందిభాగము కన్నులపండువుగా నుండెను. హరిణశాబకములు నలుప్రక్కలఁ బరుండియుండెను. కొన్ని నెమరువేయుచుండెను. ఇష్టదేవతను మదిం జేర్చి యామహనీయమూర్తి నిశ్చలస్వాంతమున ధ్యానముచేయుచున్న జాడ కనంబడెను. తన్మూర్తి నాకన్నులకుఁ బండువుచేయఁగా నమస్కరించితి. ఆవ్యక్తియందే మనస్సు లగ్నమయ్యెను. కొలఁదినిమేషము లట్లే నిలుచుంటిని.

అంతట వత్సా! యనుశబ్దము శ్రుతివివరములం బ్రవేశించెను. తిరిగిచూచితిని. శ్యామసుందరమూర్తియే. ఊఁ అంటిని. ఆముని యొక్కఁడో తెలిసికొంటివా యన నంతటిశక్తి నాకుఁ గలదా యని విన్నవించితిని. కుమారా! వినుము. ఇది ముచుకుందాశ్రమ మనునది. ఇచ్చటఁ దపోనియతిం బూనినమానవులు ఫలసిద్ధిగాంచఁజాలరు. వీతరాగులకే యిటఁ దపము ఫలము నొసంగం జాలియుండును. కాని రాగలేశ ముండిన నది నిష్ఫలమగు నని యెఱుంగుము. ఆముని కలియుగమున రెండువేలయేండ్లు కాఁగా నీయాశ్రమమునఁ జేరి తపోనియతిం బూనెను. ఈమందాకినియందుఁ ద్రిషవణస్నాన మొనరించుచు భక్తిచే భగవంతు నారాధించుచున్నవాఁడు. ఆహారము కందమూలములు. అవి యాగుహకు నలుప్రక్కల నున్నవి. ఒక్కపూట మాత్ర మన్నాదిం గొనుచుఁ గాలము ద్రోయుచున్నవాఁడు. కణ్వముని యీతఁడే అనుమాటలు నాచెవులసోఁకగనే స్వామీ కణ్వాశ్రమ మిదియేనా. అని ప్రశ్నించితి. పక్కున నవ్వి యమ్మహాపురుషుఁడు వత్సా! నీవనుకొనెడు కణ్వాశ్రమ మిదికాదు. వింధ్యపర్వతసమీపమున నున్నది. కలికాలము కనుక నం దుండరా దని యీయాశ్రమమున కాముని యరుదెంచెను.

ప్రశ్నము:—కలికాలమున మహామునుల కేమిబాధ కల్గును. వారి కీతపఃప్రభావములు లేవుకదా. తపశ్చర్యసంపన్నవారికిం గొఱంత లేల కల్గును?

ఉత్తరము:—కాలమునకు భేద మనునదియే లేదు. కాని ధర్మము ననుసరించి యుగములనుసంజ్ఞను గాలమునకు మహాత్ములేంద్రియజ్ఞానసంపన్నులు నిర్ణయించిరి. అందిది కలియుగము

ఇందుండుజనులు శ్రద్ధాళువులు గారు. ఈర్ష్యాళువులు. సర్వజ్ఞ
త్వాభిమానభూషితులు. వేదములు కల్పితము లందురు. ఉపని
షత్తులు యుక్తిబాహ్యము లందురు. పురాణములు పనికిరావం
దురు. ఆందలిగాథలు యుక్తియుక్తములు కావందురు. కల్పిత
ములే కానిజరిగినవి కావందురు. వర్ణభేదములు పనికిరావందురు.
ఉత్తమమధ్యమాధమాది భేదములు వ్యర్థములందురు. ఆచా
రమువ్యర్థమందురు. స్వేచ్ఛగాఁ బ్రవర్తింపవలయునే కాని
నియమములకు గట్టుపడి యుండరాదందురు. బ్రాహ్మణులు
కులాచారముల దూషింతురు. దురాచారముల నవలంబింతురు.
నిత్యకర్మానుష్ఠానముల మాని వేదాంతవాక్యముల నేర్చుకొని
వాని నడుగనివారినెల్ల బలవంతముగాఁ బిలిచి చెప్పుచుందురు.
దానిచే ద్రవ్యము నార్జింతురు. సురాపానము నిషిద్ధ మని సభలఁ
బల్కుదురుగాని దాని నాస్వాదించుచుందురు. పెద్దలం
గాంచినఁ బరిహసించుచుందురు. భగవత్కథల నెట్లు సమర్థిం
తురో చెప్పుమని సాధువును దూలనాడుదురు. ప్రాతయా
చారములని స్మృతిప్రతిపాదితములనెల్లఁ బరిహసించుచు
వానిమార్పవలయునందురు. గురుద్రోహులుగ శిష్యులుందురు.
శిష్యవంచకులై గురువు లుందురు. ధనమార్జించుటయే పరమ
పురుషార్థమని భావింతురు. దానికై వేదముల విక్రయింతురు.
స్నానముచేయుట నిరర్థక మందురు. మానసము పరిశుద్ధ
ముగనున్నంజాలును బాహ్యాచారము లేల యందురు. కాని
మానసశుద్ధి యెట్టులగునో వా రూహింపఁజాలరు. దేవతా
భక్తి వాగ్రూపముగఁ గనఁబఱతురు. సభాముఖముననే మంత్ర
ములం దెలుపుదురుగాని వానియందు విశ్వాసము సునుపఁ

జాలరు. చంచలాత్ములయ్యు నితరుల నాక్షేపింతురు. స్త్రీల
యొద్ద నుపదేశము నొందుదురు. వారుచెప్పినట్లే ప్రవర్తింతురు.
వేదశాస్త్రము లసత్యము లన్న నౌనౌ నందురు. దురన్నముల
భుజింతురు. ఇట్లెల్లవారును మతాచారముల వీడెడుకాలమున
మహాత్ము లందుండ వలనుపడకయుండు. వారిసంగతి తపస్సున
కంతరాయ మగును. కావున మహాత్ము లుండఁజాలక యీమహా
శైలము నాశ్రయించిరి.

ప్రశ్నము:—మహాత్మా! భగవద్గీతాశాస్త్రమున శ్రీకృష్ణ
పరబ్రహ్మమే,

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్."

అని యుపదేశించెఁ గదా. గుణములనుబట్టియుఁ జేయుకర్మ
ముల ననుసరించియుఁ జతుర్వర్ణముల నిర్ణయింపవలయుననికదా
దానిసారము. ఆయుపదేశము ననుసరించియే యేవర్ణమునవారైన
బ్రాహ్మణకర్మములనాచరించువారు బ్రాహ్మణులుగా నిట్లే యితర
వర్ణములను గూడ నిర్ణయించిన దోషమేమి?

ఉత్తరము:—వత్సా! హద్దుమీఱుచున్నాఁడవు. అట్లు
నిర్ణయింపసాధ్యమా. మాయావియగుమానవుఁ డొకఁడు ప్రాత
స్స్నానముచేసి విభూతి పూసికొనియైనను నామముఁ బెట్టు
కొనియైనను మాంసాహారమును మానితి ననును. సంధ్యావంద
నము చేయుదు ననును. వానిమనస్సు వంచనాన్వితమా కాదా
యనినిర్ణయింప సాధ్య మగునా. అట్టితఱి వానిమనస్సెట్టి దని
నిర్ణయింప యోగదృష్టి యుండవలదా. అదికలవార లుండినఁ

గదా నిర్ణయింపశక్యమగు. అంపటును మతముల నిర్ణయించు వారే దైన నావర్ణము లక్ష్లియుండును. ఆవిప్రు: డనిపించు కొన్న యాతఁడే మరల మాంసముం దినును. అపుడు విప్రేతరుఁ డనవలసియుండును. క్షణమున కొకవర్ణము గలవాఁడగును. ఇవన్నియు నాలోచించియే శ్రీహరి గుణకర్మముల ననుసరించి చతుర్వర్ణముల నేర్పఱిచితి ననియె. నాపలెనే మీరు నాయాకాలానుసారము నిర్ణయింపు: డని గీతాతాత్పర్యము కాదు. కావున జాతిని గుణకర్మముల ననుసరించి నిర్ణయింప నవకాశము సామాన్యులకుఁ గలుగదు.

ప్రశ్నము:— బ్రాహ్మణులలోఁ గొంపలు స్వేచ్ఛగా మాంసమును భుజించువారు కలరు. వారింగూడి భుజించువారు కలరు. వారెల్ల బ్రాహ్మణు లనియే వ్యవహరింపఁబడుచుంపారు. అట్టివి ప్రత్వమునకు గతియేది?

ఉత్తరము:—వత్సా! నీయోగ్యతకు దగని ప్రశ్నముల జేయుచున్నాఁడవు. జిజ్ఞాసువవు. కాన నించుక తెల్పెద. అట్టి దురాచారు లున్న నావంశము భ్రష్టవంశమగు. తత్సంతతి యట్టిది కాదేని మరలఁ బ్రాచీనగౌరవము గల్గియుండును.

శ్లో. "త్యజేద్దేశం కృతయుగే త్రేతాయాం గ్రామముత్సృజేత్,
ద్వాపరే కులమేకం తు కర్తారం తు కలౌ యుగే."

అని పరాశరస్మృతియందుఁ గల దని రొఱుంగవా. ఇట్టి యనాచారములు కలియుగమునఁగలుగుననియే మహామునులు యోగదృష్టి నంతయుం గాంచి ధర్మముల సంకుచితములుగాఁ జేసి కలియుగమున కింత చాలుననిరి. దానినిగూడ మీఱినచో

వారే చెప్పుదురు. కాఁబట్టి తానట్టియమార్గమునఁ బ్రవర్తింప కున్నఁ జాలు నని యూహించి మానవుఁడు సదాచారముల నాచరింపవలయు. అంతియ కాని యాజాతియే చెడె ననరాదు. గీతాశాస్త్రమునఁ గర్మమార్గము తెల్పుభాగమును బఠించి పెద్దల వలన వానియర్థము నెఱుంగుము.

అంత నేనేదో ప్రశ్నింపఁబూనితిని. అంతలో నాతఁడం పెఱింగియే కాఁబోలు ముందు సత్వరముగా నరుగవలయు. చూడం దగు ప్రదేశములు విశేషించి కలవు. ఈమహామునిం గాంచితివి. ఈమునితో సంభాషింప నిపు డదనుకాదు. మౌన ముద్రాధారి యై భగవద్ధ్యానతత్పరుఁ డై యున్న వాఁడు. అట్టి నియతి కంతరాయములఁ గల్పింపరాదు. అని పలికి ముందు నడువసాగఁగా నేను నరుగఁ బూనితిని. ఆయాసముగాని మనః ఖేదముగాని లేక నాపదములు భూమిపైఁ గాని పాషాణభాగ ములపైఁ గాని యునిచినజాడ లేక యంబరమున నరిగినచంద మున నుండెను. చనునప్పుడు పర్వతము నెక్కుచున్న జాడ మాత్రము తోఁచుచుండెను. కణ్వముని యాశ్రమము దాఁటి కొంతదూరమాపర్వతము నెక్కిపోవఁగా దానిపై నొకకొండ యున్న జాడ తోఁచెను. అది యాకాశమే యని భావించితి. కాని కొన్ని దృష్టాంతములంబట్టి చూడఁగాఁ దెల్లనికొండయే యని తోఁచెను. అది యీపర్వతమునకంటె నెన్నియో రెట్లెక్కుడుగాఁ గన్పట్టెను. ఇట్టి పర్వతము కూడఁ గలదా యనుశంక యుదయించెను. దానివైపునకు దృష్టిం బర్వఁజేయుటే కష్టముగానుండెను. తెల్లగా నొక్కవిధమున నుండెను. ఈపర్వతమునుండియే వరుసఁగా నాశైలమునకుం

బోవలయు. హిమాలయమింతవఱకు రెండువరుసలుగా నున్నదని నిశ్చయించుకొంటి. చూచినది చాల నల్ప మని చూచునది యత్యున్నత మని తట్టెను. కొంతదూరమట్లే పోయితిమి. ఇంచుక సమీపమునకుఁ బోవునప్పటికి

"అంబరచుంబిశిరస్సర ఝ్ఝరీపటలముహుర్ముహుఃస్ఖలితపభం గతరంగ......" అనుపద్యభాగము స్మృతికిం దగిలెను. ఆపర్వతమునుండి క్రిందికొకనది ప్రవహించుచుండెను. మందాకిని యని చెప్పినది యిదియేనా యని యడిగితి. అది యదే. ఇది యిదే. అని సమాధానము వచ్చెను. ఈకొండనుండియే యాపర్వతము నెక్కనారంభించితిమి. మంచుగడ్డలుగండోపలములవలె నుండెను. అత్యున్నతభాగమునుండి కొన్ని విరిగి పడుచుండెను. జల ప్రవాహమున నవి పడునప్పుడు గలిగినధ్వనియు నాసరినుండి పైకెగసిననీరు, దానఁగలిగినయుఱవడియు వర్ణింపశక్యమా. ఒక్కొక్కచోట మంచుకొండలు ద్రవించి క్రిందఁబడుచున్నపుడు పర్వతభాగము పడుచున్నదా యనితోఁచుచుండును. మహాత్మా! యిదేమని ప్రశ్నించితి. నాపలుకుల విన్నంతనే భయపడకుము. నాతోడ రమ్మనిపలికి పదియడుగులు దాటి నిలువంబడి యాసుందరమూర్తి వత్సా! ఈశైలమే హిమాలయ మనంబడు. మనముదాటినది ప్రత్యంతపర్వతము. ఈపర్వతరాజమును గాంచుము. దీనిని మించినది మఱొక్కటి కలదు. దీనినెక్కిన గాని యది దృగ్గోచరము గాఁజాలదు. కావుననే దీనిని బర్వతరాజమందురు. నలుప్రక్కలు కలయంజూడుము. ఈశాన్యభాగమునకు దృష్టి నిగుడఁ జేయుము. ఆతరుషండమును గనుము. అందలివిశేషముల నెఱిఁగింతు వినుము.

## ప్రవరాశ్రమము

అది ప్రవరాశ్రమ మనఁబడును. ప్రవరుఁ డను నియత భూసురుఁ డీపర్వతమునకుఁ బాదలేపన మనునౌషధప్రభావమున వచ్చి చాలస్థలములం దిరిగి యీచోట నది సమగ్రముగాఁ గరఁగి పోవఁగాఁ బోవఁజాలక పరితపించెను. ఆయాశ్రమమున కించుక తూర్పుగా నొకసాను వున్నది. చక్కఁగాఁ బరిశీలింపుము. హిమ ఘనోపలములచే నిండియున్నది. అందు దేవకాంత లుందురు. ఆసమయమున వరూధిని యను నచ్చరమిన్న యుండెను. ప్రవరుఁ డామెను గాంచఁబోయి మార్గ మడిగి యామె తన్నుంగోర నంగీకరింపక యీతరుషండమున నిలిచి యగ్ని దేవుని బ్రార్థించి తత్కారుణాచేఁ దననగరమునకరిగెను. అది మొద లిందలిమును లాయాశ్రమమునకుఁ బ్రవరాశ్రమ మని పేరిడిరి. అందు యోగులున్నవారు. శిష్యులగు బ్రహ్మచారులకు యోగవిద్య నుపదేశించుచు దాని నభ్యసింపఁజేయుచు నుందురు. కావున యోగాశ్రమ మనియుఁ జెప్పంబడును. ఇందున్నవారు స్వార్థపరులు గాక నియతమానసులై నిరీహులై లోకోపకారమునే కోరుచు ధర్మము నశింపకుండుఁగాత మని యాకాంక్షించుచు వేదములయందు విశ్వాసమునిచి నిరంతరము యోగము నభ్యసించుచుందురు. ఆపర్వతమునుండి వడిగాఁ బరుగిడునట్లున్నది గంగానదియే యని తలంపుము. ఈస్థలమున నీమహానదికి "అలకనంద" యని పేరు. మనము దాఁటివచ్చినయాశ్రమమునకు నుంత దక్షిణమున నున్న దేవప్రయాగక్షేత్రమం దీయలకనంద భాగీరథి యనుదీనితొలి శాఖతోఁ గలియు. దీనిజన్మస్థలము ముందుఁ గాంతువుగాక. ఈ యలకనంద తీవ్రవేగమునఁ బ్రవహించును. ఉత్తుంగకూటము

నుండి వచ్చుచున్నది చూడుము. తెల్లనినురుఁగులతోడను,
దుహినోపలములతోడను బ్రవహించునుగాన నెవ్వరును దీని
దాఁటంజాలరు. ఏనుంగులును దిగినచో మరల స్వరూపములఁ
గనఁబడుట యరుదు. పర్వతశిఖరము తుహినావృతముగాన
నాకాశమువలెఁ గనఁబడును. దీనియెత్తుఁ గనిపెట్టుటకుఁ గొంత
సేపు పట్టును. మేఘము లంబరమున నీయద్రివరమునకుఁ బైభాగ
ముగాఁ గనంబడునాకాశమున సర్వదా యావరించియే
యుండును. కావున హిమావృతమగు నీపర్వతకూటము, మేఘా
వృతమగునంబరము నొక్కవిధముగనే యుండును. కావున నిది
యెంతదనుక వ్యాపించియున్నదని కనుఁగొనుటకుఁ బట్టుపల
యెక్కువగనుండవలయును. తఱచుగా నీపర్వతభాగములన్నియు
మేఘసంక్రాంతము లని యెఱుంగుము. దానికిఁ దోడుగ మంచు
దట్టముగనుండును. కావున నాకాశము పర్వతము నిచ్చోట
సమానముగాఁ గానఁబడును. తుహినాచలనామము దీననే సార్థ
కము. ఈయాశ్రమము గావించితివి. దానికి దక్షిణభాగమున
నొక గండోపలము గలదు. పరీక్షించి చూడుము. దానిచెంత
నత్యున్నతవృక్షము గలదు. దాని దక్షిణశాఖలు మంచుచేఁ
గప్పఁబడుటఁ దెల్లగానుండి కనఁబడకయున్నవి. తక్కినభాగములఁ
మంచు కరఁగిపోయినది. ఆచెట్టునకు నించుక యుత్తరభాగముగా
సమీపమందు నాచట్రాయి కనంబడును. దానియధోభాగము
నందేకుల్య(చిన్ననది) ప్రవహించుచున్నది. ఆగండోపలము క్రింద
వేయిమంది మనుష్యులుండఁదగినంతస్థలము కలదు. ఛత్రాకార
ముగా నాశిల వెలసియున్నది. అందుండి యొకముని నిత్య

కర్మానుష్ఠానములం దీర్చి రానున్నవాఁడు. ఆతని కరుదెంచుతఱి నీవు పోయి నమస్కరింపుము. వారియుపదేశముల నాలకించి రమ్ము.

అని పలుక నే నాచోటికి కతిప్రయాసమునఁబోయి నిలుచుంటిని. పదిపంద్రెండుఘటికల కుండుండి తాళవృక్షమాత్ర దేహముగల యొకపురుషుఁడు వెడలివచ్చెను. ఒడలంతయుజడలచేఁ గప్పఁబడియుండెను. వెంట్రుకలు పొడవులుగా నంపంపఁ గనఁబడుచుండెను. కావున దేహచ్ఛాయ యిట్టిదని తెలియరాకయుండెను. మఱియు భూతిలేపనయిన సించుకంతయు నది తెలియఁ దగకయుండెను. ఏమో చదివినట్లు నాదము వినఁబడియెను. తద్దర్శనమున నాహృదయము భయముచేఁ గంపించెను. మోము వెలవెలపోయెను. చెమ్మటలు గ్రమ్మెను. వీరిదర్శనమింకంజాలు. రక్షకుఁడు వొకఁడు బ్రసకుడునేమో యని తోఁచెను. ఎట్టియూహయు నిలువక మాఱుచుండెను. మొత్తముమీఁద నామనస్సు భయసాగరమున మునిఁగి దరిచేరకను వోర్లుచుండె ననవచ్చును. వారు మఱియుఁ జెంతకు వచ్చుకొలఁదిని నాయవస్థ వర్ణింప నలవిగాక జాలిఁ జూపఁ దగియుండెను. ఆముని గొలఁదియడుగు లాగండోపలాచ్ఛాదితభూభాగమును మీఱివచ్చి కమండలువు పెలాఫలకముపైనునిచి తలయెత్తెను. వారిదృష్టి నాపయిఁ బ్రసరించెను. అత్తఱిణమున నామనస్థితియెట్లుండెననియు నేఁజెప్పఁ జాలననుట యటుండనీ. కాళిదాసకవిశ్రేష్ఠుఁడైన వర్ణింపఁజాలఁడని భగవంతునిచెంత నిలుచుండి చెప్పఁజాలుదు. మాట వెడలదు. పెదవు లదరుచుండెను. సకలావయవములు కంపమున

నిలువఁజాలక యుండెను. ఒక్కభాగము వేఱొక్కభాగము తోటి సంసర్గమును మాని తొలఁగిపోవుదమా యని తలంచుచుండెను కాని భగవన్నిర్మితస్నేహబంధము వాని వదలకుండఁ గాపాడెఁ గాని లేకయున్న నేభాగమున కాభాగమే విడివడక యుండఁజాలవు. అంతపని కాకయుండ సర్వేశ్వరుఁ డగునా శ్యామసుందరమూర్తి కాపాడెను.

ఆట్టియిక్కట్టునున్న నన్నుఁ జూచి యామహాపురుషుఁడు దివ్యజ్ఞానసంపన్నుఁ డగుట నార్తుఁడ నని యెఱింగి నిరపాయుల మగు మావంటి వనవాసులం గాంచి భయంపడనేల? ఎట్టిజంతువులకుంగాని కీడు రోయము. భయము మానుము. నీరాకకుంగతం బేమి యనిప్రశ్నించి నాబడలు రాకముందే జలంబుఁ ంపెగి యాచమించెను. ఆమునిపలుకు లమృతధారలవలె నాహృదయమున శ్రవణరంధ్రములమూలమున సోఁకగనే భీతి యెటకో పాఱిపోయెను. ధైర్యము పొడకొనియెను. క్రమముగా నామహాత్మునియందు భక్తియంకురించి వెలసెను. చేతులు జోడించి యాచమనకృత్యముపూర్తిచేయఁగనే మహాత్మా! అజ్ఞానుఁడను, భీతుఁడను, పూర్వజన్మసుకృతమున మీపాదముల దర్శింపఁగల్గితిని. కడుంగడు ధన్యుఁడ నైతిని. నాయందు శిష్యవాత్సల్య ముంచి రక్షింపవలయు నని వేడితిని. ప్రసన్నహృదయుఁడు కావున నీవడుగఁ దలఁచిన దేమని ప్రశ్నించెను. మునీంద్రా! తెలుగుభాషయందుఁ దమకుఁ బరిచయ మెట్లు కలిగినదో యని ప్రశ్నింప భయపడుచున్నాఁడను అన్నంతనే నవ్వి యీశ్వరానుగ్రహమున భాషలు వచ్చును అని యూరకుండెను. ఏమియడుగుదునా యని యాలోచించుకొని మహా

నుభావా! తమ రెవ్వరో తెలిసికొని ధన్యుఁడను గాఁగోరు చున్నాఁడను. కరుణింపుమా యంటిని. పేరుతో నీకేమి లాభము. అని పలుకకుండెను. అంతలో లోకోపకారముగా నేమో ప్రశ్నింపనెంచితి. నాప్రశ్నమునకు ముందే విప్ర కుమారా! కలియుగము భారతభూమి రాజ్యము చేయు చున్నదా యని ప్రశ్నింపఁ జిత్తము స్వామీ యంటిని. వర్ణా శ్రమధర్మము లేపాటిగనున్నవని మరల నడిగిరి. కాలానుసార ముగా నామమాత్రశిష్టములై యున్నవంటిని. ఆశ్రమధర్మ ములో యనఁగా నవి యాశ్రమములందే యడఁగినవి. ఆచార మున నవ్వి నాలుగుసమానపంక్తిఁ జేరియున్నవంటిని. మహాభారత మునుగూర్చి జను లేమనుకొందురు? అని ప్రశ్నింపఁగా భగవ ద్గీతలు తప్పఁ దక్కినభాగమంతయుఁ గాలానుసారము తోఁచిన ట్లెల్లఁ గల్పించి యందుఁ జేర్చఁబడిన దని సిద్ధాంతము చేయు చున్నవారని బదులిచ్చితిని. గీతలు ప్రక్షిప్తము లనువారు లేరా యని యడుగ నవి యుపన్యాసమున కుపకరించుచున్నందున నామాట యనలేదని విన్నవించితి. చింతించుచు క్షణము నిలువం బడి మహాభారతమునఁ బ్రమాణబుద్ధి నశించినదా? దుర్భ రము, దుర్భర మని మఱేమియుఁ బలుకక కమండలువునిండ జలములంగొని మరలి పోవసాగెను. శ్యామసుందరునాజ్ఞ యైనది కాఁబోలు నేను నామునీంద్రుని వెంబడించితిని. ఆచిన్ననది నెట్లు దాఁటితినో లోపలి కెట్లు పోఁజాలితినో నాకే తెలియదు. స్మృతి నాకుం గలుగునప్పటికి విశాలమగు భూభాగమున నుంటిని. అందు శీతవాతములు లేవు. సుఖస్పర్శము లగువాయువులు వీచుచుండెను. ఆముని కమండలువు క్రింద నునిచి నన్నుం

జూచి నీకేమి కావలయు ననిరి. తమదర్శనార్థ మరుదెంచితి నంటిని. మాయింటి పురసంస్థానము నాలకించి యందొక వృక్షావళి చాటున నున్నవా రేమో ప్రశ్నించినట్లు వినంబడెను. ఈ ముని యేమో బదులిడిరి. నా కాభాష యెఱుంగ సాధ్యము కానిదిగా నుండెను. క్షణకాల మిరువురును మాటలాడిరి. నన్నుం జూచి వత్సా! ఇటువచ్చి మహాముని దర్శింపుమనఁగా మేరలేని యానందమున నాలుగడుగులు పెట్టి యందుఁ గృష్ణాజినముపైఁ గూరుచున్న వృద్ధమునిం గాంచి గోత్రము నుచ్చరించి నా పేరు నించుక మెల్లఁగ స్మరించి నమస్కరించితి. మొదటి పేరేల మరచితివని యమ్ముని యడిగె. నాకచ్చెరు వయ్యెను. ఇఁక స్వప్తివారి కడ దాచిపెట్టరా దని యది వ్యవహారనామమున లేమందున నీనామమునే యుచ్చరించితినంటిని. శుభస్థలములయందు దీక్షానామము కదా చెప్పవలయును. గురువు చెప్పలేదా యనియె. వాడుకలేక యుచ్చరింప నైతిని. క్షమింపుఁడని దీక్షానామము నుచ్చరించి మరల సాష్టాంగనమస్కారము లాచరించితిని. ఆశీర్వదించి కూరుచుండ నియోగింపఁ గూరుచుండి వారినే చూచుచుంటిని. కొన్ని విఘటిక లూరకుండి యేమి వాంఛించి యీచోటి కరుదెంచితివని ప్రశ్నించెను. మహాత్ముల సేవించు కొఱకే యంటిని. మఱియును భవదీయనామమును నింతకు ముందు నాతో మాటలాడిన వారి పేరును దెలియఁగోరుచున్నాఁడ నంటిని. పక్కనన్ని మానామధేయములతో నేమిపని యనెను. పవిత్రనామములను స్మరించుటకన్న నాపంకిపామగున కేమిపనిగలదని చేతులొగ్గి ప్రార్థించితిని. మరల నవ్వుచు మన పేరులను దెల్పవయ్యా యని యమ్మునితోఁ జెప్పెను. ఆమునియు

నచటికే వచ్చెను. వారియనుష్ఠానస్థలమున కించుకదూరమున నొకకృష్ణాజినము శిలాఫలకముపైఁ బఱువఁబడియుండెను. దానిపైఁగూరుచుండి విప్రకుమారా! మాపేరుల వినఁగోరితివి. చిరకాలము భారతభూమి వసియించితిమి. కలియుగమాసన్నము కాఁగా నీపవిత్రపర్వతముఁ జేరితిమి. అందు నీయాశ్రమమునకు వచ్చి కొన్నివర్షములే యాయెను. అనునంతలో మహాత్మా! భారతభూమియందేభాగమున నివసించితిరి? అని ప్రశ్నించితిని. నాయాతురతం గాంచి యేమోయోజించుచుండఁగా ముదుసలి మౌని దాఁప నేల చెప్పుము. పాత్రుఁడుగాఁ గనంబడియెడు ననిపల్కఁగా నించుక యూరకుండి వత్సా! ఆ మునివర్యుఁడు నాకు మాతులుఁడు. కృపాచార్య నామధేయుఁడు అనఁగా నేపట్టరానియానందమున మహాత్మా! అప్రతిమానపరాక్రమమున నలరారి కృతజ్ఞతకు లక్ష్యభూతులరై శాపానుగ్రహసామర్థ్యమున విఖ్యాతినొంది చిరకాలజీవులలోఁ లునొాతనే లెక్కింపఁదగినమహానుభావులరు మీరే కదా. అశ్వత్థామయనఁబడువారు మీరేకదా యనుచు లేచి వారిపాదకమలములచెంత సాష్టాంగవిధిని బ్రణమిల్లితి. వత్సా! లెమ్ము. ఆస్తుతి యిప్పుడుతగదు. ఆకాలము వేఱు. ఆచర్యలు వేఱు. కాలము మాఱినది. యుగము మాఱినది. ధర్మములు తాఱుమాఱైనవి. అనపలికి కన్నీరు నించిరి. నేను ముదుసలిమునికి నమస్కరించి మహాత్మా! తమయమోఘశక్తి మహాభారతమువలన నెఱింగితిని. పూర్వపుణ్యవశమున నిట మిమ్ము దర్శింప నోచితిని. ధన్యుఁడనైతిని. నాపాపములు తొలఁగెను. కృతకృత్యత చేకూఱెను. అనిపలుకుచుండ నప్రయత్నముగాఁ గన్నులనుండి యానంద

బాష్పములు ప్రవహింప సాగెను. వారిరువురు నామోమునే చూచుచుఁ గుమారా! ఏలయింతసంతోషపడెదవు? మమ్ముఁ జూచి లాభమేమి పొందితివి? మాచరిత్రమును భారతమునఁ జదివితివంటివి కదా. కొన్నిమాటలఁ దెల్పుము. అనఁగానే నాకుఁ దెలిసినవిషయమంతయుఁ దెల్పితిని. అశ్వత్థామ యజ్ఞసేనుని మార్కొని మహాహవము సల్పినఘట్టము నేఁ జెప్పినప్పుడా యిరువురు మిగుల విచారముం జూపిరి. దుర్యోధనుఁ డూరువులు తెగి భూమిఁ బొరలాడునప్పుడు సాగినకథను దెల్పుతఱి వారును విచారమును జూపిరి. కొంతసేపిట్లు గడపితిని. కృపాచార్యులు నన్ను సాదరంబుగఁ గాంచి వత్సా! అనుష్ఠానమునకు వేళయైనది. భగవత్సాహాయ్యమున నీకీదుర్గమమార్గము సుగమముగనుండును. వలసినతావులన్నియుఁ జూడుము. మాచరిత్రము భారతము చదువునప్పుడెల్లం దెలియుచునే యుండును. మేమిందే చిరకాలము నివసింపఁదలంచుకొనలేదు. ఉత్తరమునఁ జాలయోజనములలో సిద్ధాశ్రమము గలదు. అందుఁ జేరి నిష్ఠసలుపవలయునని యెంచితిమి. మహాభారతమును బఠింపుము. అదియే సకలధర్మములం దెల్పును. దానిని బలువురు దూషింతురు. కలికాలమున నొకరిమాట వేఱొక్క రంగీకరింపరు. ఎవ్వరేమన్నను లెక్కపెట్టక నీవనవరతము దానిం బఠింపుము. ఇహపరసుఖములు రెండును గలుగును. భగవద్గీతను వానినిమించినయుత్తరగీతలు శ్రద్ధతోఁ బఠింపవలయును. ఇంకను విశేషించి యధర్మము వర్ధిల్లఁగలదు. వర్ణసాంకర్యము ప్రబలును. పురుషులు పట్టుపట్టి పురంధ్రీమణుల ననాచారనిరతలనుగా నొనరింతురు. వివాహవిధులు తాఱుమాఱగును. మంత్రబలము తగ్గినట్లుండును.

మాయావులు బోధకు లగుదురు. యోగదృష్టి కలదందురు. యోగవిద్య పొట్టకూటి కుపయోగింపఁబడును. యోగాభ్యాసము శశవిషాణ మగును. యోగులుమాత్రము మిక్కిలి యుందురు. వారిమోసపుఁ బలుకులను నమ్మి కొందఱు వారికి శిష్యులగుదురు. ద్రవ్యమునార్జించువాంఛఁ గొందఱు గురువు లగుదురు. గురువులను వంచింపఁబూని కొందఱు వారికి శిష్యు లగుదురు. దుష్ప్రవర్తకులెల్ల సత్ప్రవర్తకులపై నిందలుమోపి దోషములఁ గల్పించి తమగొప్పతనమును బొగడుకొనుచు నుందురు. వారితులువమాటలను నమ్మి సాధువుల దూషించు వారు నుందురు. వేదాంతశాస్త్ర స్త్రీబాలకులయందును, దుర్వృత్తులయందును దాండవమాడుచుండును. స్త్రీలు పురుషులఁ బరాభవింతురు. స్వేచ్ఛాప్రవర్తనము ప్రఖ్యాతింగాంచును. దైవభక్తి మాటలయందే యిల్లుకట్టుకొని యుండును. పలువు రొక్కని గొప్పగాఁ జేసి వానిని త్రిప్పుచు బ్రదుకుదురు. స్త్రీల కడ నుపదేశముసందువారే పెక్కండ్రుందురు. స్త్రీలమాటలే పథ్యములగు. కావున నిట్టివన్నియుఁ గలికాలమున నభివృద్ధి నొందఁగా సదాచారము లాక్షేపింపఁబడు యొకవింతకాదు. నీవు మాత్రము భారతమును బఠించుచుఁ బరదేవి నారాధించు చుండుము. లగ్గగును. మఱలనొక్కపుడీయాశ్రమమునకు రాఁగో రుదువేని భారతమును సాంతముగా మున్మాఱులు పఠించి మమ్ముఁ దలంచి మేము చెప్పినయీవిషయమును స్మరింతువేని నీకిచ్చోటు కనంబడును. నీకొఱకు శ్యామసుందరమూర్తి కనిపెట్టి యున్నవాఁడు. వెళ్లుము. ఈమంత్రము నీకుపదేశింపఁబడినదియే. వినను ఋషిచ్ఛందస్సుల నిట్లుచ్చరింపుమని యామంత్రరహ

స్యమును దెల్పిరి. ఇంక నేనేమో యడుగవలయుననియుండఁగా నిద్రవచ్చినచందమయ్యెను. కన్నులు తెఱచునప్పటికి శ్యామసుందరమూర్తి పార్శ్వముననుండెను. ఆయాశ్రమద్వారముననున్న గండోపలము కానరాదయ్యెను. ఏలయనియడుగునంతలో వేఱొకచోటనుంటిమి. ఆప్రశ్నమునకవకాశమీయక యాబాల రూపధారియగుభగవంతుఁడు సన్నుఁజూచి యిట్లు పలికెను.

విప్రకుమారా! ఈస్థలము పరమపవిత్రము. దీనిని మందాకినిపావనము జేయుచుం బ్రవహించుచుండును. అదియే మందాకిని. ఇంతకుముందు చూచితివికదా ఇచ్చటనుండియే ప్రవహించును. ఇందుఁ గేదారేశ్వరుఁ డుండును. నీవు చూచిన చోటులయందెల్ల నిది శీతబహుళమని యెఱుంగుము. నీకు శీతబాధ లేకుండుటకుంగల కారణము వేఱు. ఎల్లవారి కిట్టులే యుండు నని కొనకుము. ఈయీశ్వరునిం గొనియాడుచు వచ్చిన శ్లోకములఁ బఠించుట భగవత్సేవ కాదు. తత్పదారవిందములయందు మనస్సు నిలిపి వినీతుఁడవు కమ్ము. అదియే సేవ. దాన భగవానుఁ డానందించును. క్షణమూరకుండి ధ్యానించితివా? యని ప్రశ్నింప నౌనంటిని. ఇంక రమ్ము. అని కొలఁది క్రోశములు త్తరముగాఁ బోయి యించుక తూర్పుదెసకు మరలి యొకసానుప్రదేశమును గనఁబఱచి యిది మతంగమునియాశ్రమము. ఇందొకవిచిత్రము కనంబడు. ఆశ్రమముఖము గుహావలె నుండును. చూచినంతన దుష్ప్రవేశముగాఁ దోఁచును. కాని మునులకది విశాలద్వారముగాఁ గనంబడును. ఆగుహాముఖమునఁ గూరుచుండి వినిన నోంకారము వినంబడు. దాని విను

నప్పుడు కలుగుసుఖ మనంతము. మరలిరా నెవ్వఁడే నిష్టపడఁడు. ఇఁకఁ బ్రవేశించినఁ జెప్పవలసినదేమి? అనఁగా స్వామీ! దుష్ప్రవేశము సుప్రవేశ మగుటెట్లంటిని? పకపక నవ్వి పూర్వపుణ్యము దేవతానుగ్రహము కలిగిన నదియెంతపని! నీకు నిష్టమున్న దని తోఁచెను. నాయానతిమై నచ్చటికిం బొమ్మని చిటికెవేయునంతలో నే నందుంటిని. తద్ద్వారము సానుతటమున నున్నది. ఆగుహాయు మధ్యభాగముననున్నది. అచ్చటికిఁ బోవశక్యముకాదు. స్నిగ్ధమగు నొక గండోపలమే నిమ్నోన్నతములు లేక యంబరమును స్పృశించుచుండును. చీమయేని ప్రాఁకఁజాలదు. ఆగుహాయుండుతావున నొకవృక్షరాజము గలదు. దానికడ నల్వురు కూరుచుండునంతవిశాలభాగము కలదు. ఆవృక్షరాజమూలమునుండి క్రిందిభాగము చూచిన మానవుఁడు పడక నిల్వఁజాలఁడు. అధోభాగమునఁ బాతాళమును దెల్పునట్టి గర్తము కలదు. అందున్నతభాగమునుండి యేనుఁగంతధార లసంఖ్యలుగాఁ బడుచుండును. ఆజలమంతయు నతివేగముగాఁ బ్రవహించి యాగర్తమునఁ బడి యందుండి బయలువెడలి యెచ్చటికో పరుగిడును. కాని యాప్రవాహమునఁ దరంగములున్నయట్లు కనఁబడక హిమమయశిలలు పఱచినట్లుండును. కాని యవి స్థలాంతరమున కరుగు జాడ కనంబడుట నందు జలము ప్రవహించుచున్న దని యెన్ననగు. దానియురవడికి బృహచ్ఛిలలే పరుగిడుచుండును. ఆశిలలపైనున్న వానరములు మఱికొన్ని జంతువులు ప్రయాణముచేయుచున్న చందము స్పష్టమగును. వానికిఁ దెలియుఁ గాఁబోలు. చట్రాలపై గూరుచుండికదలక యుండును. వానింజూడఁగా నొకలపైఁ

కూరుచుండి సాగరమునఁ బ్రయాణము చేయుచున్నపని తలంప
వచ్చును. అవి యెంతదూరమరుగునో యేచోట నవి గట్టె
క్కునో యెఱుంగఁ దరంబుగాదు. ఇఁక నావృక్షరాజమూలము
నుండి యాకసమువైపు దృష్టిఁ బఱపితిమా నక్షత్రము లాసా
నూర్ధ్వభాగమును స్పృశించుచున్నట్లుండును. అంతయెత్తు, నంత
లోఁతు గలిగియున్న రెండుభాగములను జూడకయుండిననే
మనుష్యమాత్రుఁడు బ్రదుకనోపును. అట్టివిషమభాగమున
నుంటిని. శ్యామసుందరమూర్తియాజ్ఞ మెయి ధైర్యముకలుగ
ద్వారముకడకుంబోయి కూరుచుంటిని. ఆచోటు మదికింపుగా
నుండక భీభత్సరసమున కుదాహరణముగా నుండెను. అందొక
శిలాఫలకము కనఁబడ నందుఁగూరుచుండి కర్ణవివరముల నందుప్ప
తిల్లునాదమును విన నియోగించితిని. కొన్ని నిమేషములకు
నామనస్సు దిటవుఁగనె నిక్కము వచించెద ఒక్కనాదము వినం
బడసాగెను. ఓంకారమందు వినంబడు శబ్దము

క. "వీనులవిందై యమృతపు
సోనలపొందై యమందసుమచలదళినీ
గానముక్రిందై యాస్వన
మానందోబ్రహ్మామైన నధిపతి పలికెన్."

అనువసుచరిత్రపద్యము స్మృతికిం దగిలెను. ఈపద్యము దాని
మహిమమును దెల్పఁజాలదేమో యని తోఁచెను. ఆస్వన
మొక్కరినోటినుండి యుప్పతిల్లినది కాక పెక్కుముఖములనుండి
కలిగినజాడఁ దెల్పెను. వచింపఁజాలనుగాని యవ్యక్తమధురమై
భవసాగరదుఃఖోర్ముల నడంపఁజాలినది యనిమాత్రము చెప్పఁ
గలను. మఱికొంతసేపటికి శోకధ్వని వినఁబడియెను. గుండెలు

వికావిక లయ్యెను. భగవంతుఁడే మోసముచేసెనే యనుకొను
చుంటిని. ద్వారము కనంబడియెను. శిష్యుఁడొకఁడు వచ్చి నన్ను
రమ్మని పిలిచెను. లోనఁ బ్రవేశించితి. ద్వారమున కభ్యంతరమున
సమీపమందే కదళీవనము కనఁబడియెను. దానినడుమ నొక
నిర్మలజలముగలకుల్య గనఁబడియెను. దానియధోభాగము శిలా
ఫలకమని స్పష్టముగాఁ దెలియుచుండెను. స్ఫటికలుగా వెలుతు
రుండెను. దానిందాటగనే మహర్షులు తపమొనరించుస్థానములు
వృక్షమూలములఁ గనఁబడసాగెను. ఆతావులఁ గృష్ణ మృగ
చర్మములు పఱువఁబడియుండెను. అప్పుడందు మునులు లేరు.
నేను నాచోటి కించుకచెంతకుంబోవఁగనే యొక్కరొక్కరుగా
నందుఁ గూరుచుండసాగిరి. ఎవ్వరిని దొలుత సంపర్శింతునా యను
శంక బాధింపసాగెను. శిష్యు నడిగితిని. అవటువు గీర్వాణ
భాషతో మాటలాడసాగెను. వచ్చిరానిమాటలతో బదులు
చెప్పితిని. నాల్గవయాసనమునఁ గూరుచున్న మునికడకుం బిలుచు
కొనిపోయి మతంగమునివర్యునకు నమస్కరింపుమనియెను.
విధియుతముగ నే నమస్కారాదికర్మముల నడపితిని. కనుసంజ్ఞచేఁ
గూరుచుండ నియోగించెను. శిలాఫలకమునఁ గూరుచుంటిని.
నియతక్రియలు సాగఁగా నన్నుఁ గాంచి యేలవచ్చితివనియె.
భాష దేవభాషయే. దర్శనార్థమంటిని. ఈచోటి కెట్లురాఁజాలితి
వని కన్నులుమూసికొని యించుక ధ్యానించి నీకిఁక నరుగరాని
తావు లుండవు. ఈయాశ్రమమున మాతో మాటలాడఁబంచెను
గదా శ్యామసుందరుఁడు. వినుము. ఇందీశ్వరుఁడు దక్షిణా
మూర్త్యవతారమున నిర్మలుఁడై తపమొనరించెను. తదాదిగా
నిది దక్షిణామూర్త్యాశ్రమమని విఖ్యాతినొందెను. పెక్కండ్రు

మహర్షులు తపంబిందొనరించి కృతకృత్యులైరి. ఈశ్వరానుగ్రహమున మేమందఱమిందుఁజేరితిమి. ఇపుడు దీనిని నాపేరఁ బిలుచుచున్నవారు. ఇందుఁ గూరుచున్న మునులెల్ల నన్ను గురువునుగా భావించుచున్నారు. వీరిసాయమున నిందున్నవాఁడ. అనియె.

నేనించుక విన్నవింపఁబూని మహామునీంద్రా! ఇచ్చోటికి రాకమును పెందుండి తపమొనరించితిరి? తెలుపవలనుపడునేని సెలవిండు. అనఁగా నామౌని చిఱునవ్వుపొలయఁగాఁ బ్రాఁత వార్తలఁ దెలుపుమందువా. శేషాచలమను గిరీంద్రము కలదు. దానియుత్తరభాగమున శ్రీశైలమను శివక్షేత్రము. దక్షిణ భాగమున శ్రీవేంకటాచలక్షేత్రము కలదు. పరమపావనమా పర్వతమనుట సత్యము. ఆపర్వతమధ్యభాగమున నోంకారమను రహస్థలము కలదు. అందుఁ గొంతకాలముంటిమి. కాలము విపరీతముగా మాఱుట వదలుకొని వచ్చితిమి. మేమీయా శ్రమమును బ్రవేశించి రెండువేల సంవత్సరము లయ్యెను. అనగా నే పరమానందమున మునీంద్రా! నేను నాపర్వత ప్రాగ్భాగమున నివసించువాఁడను. తమదర్శనమున నాకష్టములు గట్టెక్కినవనినమ్మెదను. కాలము విపరీతమైన నరణ్యమున నందున బర్వతగుహాలలో నివసించు తమకేల కష్టములు కలుగునో వినఁగోరెద నంటిని! దానికించుక మౌనమూని వత్సా! నీకా విషయమంతయుఁ దెలుపునంతటియవకాశము మాకిపుడు లేదు. సంగ్రహముగాఁ జెప్పెదము. ధర్మములు విపరీతములగ నట్లు తోఁచెను. ఇపు డన్నే మార్పునొందినవి కదా. అధర్మ వాయువులు దేశమెల్ల వ్యాపరించినపుడు తద్బాధ మౌనులకు

దెలియును. కావున నందుండ మానితిమి. విశేషించి మాటలాడు
నవకాశము మాకు లేదు. ధర్మబుద్ధి నీకుంగలుగుంగాక. పరమేశ్వ
రానుగ్రహపాత్రుండ వగుదువుగాక. అనియాశీర్వదించెను. ముని
కులతిలకమా. ఒక్కవిన్నపము కలదు. తమకని కాలము వృథా
చేయునట్టిది కాఁజాలదు. జిజ్ఞాసువులకుఁ దెలుపుట మీవంటి
మహాత్ములకు నియమము కదా. అన నడుగుమనియె. హిమాలయ
మున నున్నమహర్షులు భారతవర్షమునకు మేలుచేయఁగోరి
శిష్యులను బంపుటయో తమయంశము యితరులయం దావేశింపఁ
జేయుటయో నిరంతరము వారికష్టములను స్మరించుచు వారికధి
కారము గలుగవలయుననియో, తమతపస్సును ధారపోయువారు
కలరా యనిప్రశ్నించితిని. చెవులు మూసికొని మహర్షు లెప్పుడు
గాని ధర్మము నశింపకుండుఁగాక యనికోరుదురు. వేదశాస్త్రముల
యందు విశ్వాసము లోకమున నశింపకయుండుఁ గాక యనివాం
ఛింతురు. భగవద్భక్తి తగ్గక మానవులయందు నెలకొనియుండుఁ
గాక యని యభిలషింతురు. తక్కుంగలకార్యములను స్మరించు
వారుండరని నమ్ముము. ఒక్కదేశమనికాదు. ప్రపంచసుఖమును
గోరుదురు. ఇట్లు కల్పించువారున్నవారు కాఁబోలు. ఆమాటలు
నమ్మఁదగవు. ఈపర్వతరాజముననే బ్రహ్మర్షి రాజర్షినికరము నివ
సించును. వేఱొండు తావులమాశిష్యులు కొందఱు గలరు.
వారింకను బరిపక్వాంతఃకరణులు కాలేదు. ఆయోగ్యత లభిం
పగనే యిచ్చట కరుదెంతురు. వారుగూడ నీప్రశ్నమునకు సం
బంధించినవిషయములం బ్రవేశింపరు. నిత్యకర్మానుష్ఠానమున కిదె
సమయమగుచున్నది. నీవింకను భగవత్సాహాయ్యమునఁ జూడఁ

దగుతావులం జూడుము. మునీంద్రులు మాటలాడుదురు. సకల సంశయములు తీఱును. అని చిటికవేసెను. అంతలో నాకేమో మబ్బు గ్రమ్మినట్టులయ్యెను. తెలివివచ్చునంతలో శ్యామసుందర మూర్తి చెంతనున్నట్లు తోఁచెను. చక్కఁగాఁ జూడఁగా ఆమూర్తియే పురోభాగమున నుండెను. నలువలంకులు కలయంగాంచితి. ఆసానువు కనఁబడుచుండెను గాని నేఁజూచినప్పటి గుహాచిహ్నములు కానరాపయ్యెను. ఇదేమి చిత్రమో యని చింతించుచు నిలువంబడితిని.

అట్లు తోఁపక యేమో యాలోచించుచున్నంజూచి యాపురుషోత్తముఁడు వత్సా! మతంగముని దర్శించితివికదా. తరణోపాయ మేమని ప్రశ్నించితివా లేదా యని యడిగెను. మహాపురుషా! అన్నింటికి నిన్నే చూపెనని బదులుడితిని. ఆసమయమున నాచిత్తము చంచలరహితమై తదీయపాదారవిందములయందుఁ దగిలియుండెను. ముందేమి చేయవలయుననియుఁ దోఁపదయ్యెను. మ్రాన్పడియుంటిని. కానియాపురుషోత్తముని నే తలంచుపనిమాత్రము మానలేదు అంత నామహాపురుషుఁడు బాలకా! విచారమింకఁజాలు. వేఱొకచోటు చూడఁదగియుండును. వెంటరమ్మని కొన్ని యడుగులమేర పోయెనో లేదో యొకవిచిత్రస్థలము దృగ్గోచరంబయ్యెను. పూర్వస్థలమునవిడిచెంతనేయున్నట్లూహించి నాలుగుప్రక్కలుచూచితిఁగాని యందలి గుఱుతులలో నొక్కఁడైనను గానరాదయ్యెను. చిత్రంపడియింకను జూచుచుండఁ బూర్వస్థలముదాఁటి చాలదూరము వచ్చితిమి. ఆచింతమాని యీవిచిత్ర పావనస్థలముఁ జూడుము. దీనిం దర్శింప భారతీయులు పెక్కండ్రరుదెంతురు. ఇందు స్నానము

చేసిన ముక్తులమగుదుమన్న నమ్మక మింకను గొందఱకుం గలదు. చక్కఁగఁబరికించి సర్వదామతినిలుపుకొనఁదగిన దీస్థలవర్యము. భగవన్నామమువలె స్మరింపఁదగినది. అనియొకభాగమును నిర్దేశించి యారీతిఁ బల్కెను. ఆవిషయమును దెలుపునప్పుడా మహాత్మునిమోమున నానందము తాండవమాడుజాడ నాకుం దోఁచెను.

## గంగాప్రాదుర్భావము

వత్సా! నాహస్తము నిర్దేశించుస్థలముం జూడుము. ఆచోటునుండియే గంగానది భూలోకమున కవతరించెను. ఆయున్నతభాగము హిమాలయపంక్తులలో నొకభాగము. ఆభాగము తెల్లగానున్నది. చూచితివి కదా. అందున్న గండోపలములుతుహినసంవరణమునఁ దెల్లఁగానున్నవి. ఆమంచు నిరంతర మావరించియే యుండును. రవికరసంస్పర్శము కల్గుటయే కష్టము. ఒకప్పుడు కలిగినను పైభాగముననున్న మంచునందు శతాంశమైనను గరఁగదు. త్రేతాయుగమునుండియిట్లే యున్నది గాని మార్పులేదు. గంగోత్తరయనిపేరు దీనికేగలదు. నదీమూలమెఱుంగఁ దరంబుగాదు కదా యనునూహ మంచిదికాదు. ఆజలపాతముఁ గన్నులారం గాంచుము. విశాలభాగమును దనధారలచే నావరించినది. ఆజలధారలు కొన్ని వలయాకారములుగాఁ బడుచున్నవి. కొన్నిధారలు శ్వేతాంబరము పఱచినట్లు పాషాణముల నాశ్రయించి పడుచున్నవి. కావుననే జలధారలుగాఁ గానరాకున్నవి. పైభాగమునకుం బోయిచూచిన నెందుండి వచ్చునో తెలియరాదాయని యూహించుచున్నవాఁడవా? మంచుశిలలు తప్పఁ బైభాగమున నేమియుఁగానరాదు.

ఆమంచు కరఁగి యిట్లు పడగూడదా యని కదా యిప్పటి నీయూహ. అదిపొరపాటుగాని వేఱుగాదు. హిమ మెల్లతావుల దట్టముగ వ్యాపించియున్నది. సానుతలములనెల్ల నిట్టిజలధారలు పడుట చూచితివా. ఆయూహ దురూహయే. దానిపై భాగమున దట్టముగవ్యాపించి మహోన్నతములగు భూరుహములు గలవు. చూడుము. అందుఁగల పక్షులు కనఁబడుట లేదా. పెద్దనదిపై నుండి క్రిందికి దిగుచున్నవని యూహింప నవకాశము కలదా? నాస్తికులవాదమునకు శ్రుతిరంధ్రములఁ జోటీయకుము. వారి కిదిముక్తినొసఁగదు. పుష్పరసము కప్పకు రుచింపనట్లు నాస్తికులకు ముక్తివాక్కులు రుచింపవు.

ఈచోటనే భగీరథుఁడను మహారాజు చిరకాలము తపంబొనరించెను. గంగాదేవిని మదినిలిపి ధ్యానించెను. ఆమె ప్రత్యక్షముగఁ దోఁచె. నదీరూపమున రమ్మని ప్రార్థించెను. భక్త పరాధీనయగు నాగంగాదేవి యంగీకరించెను. ఒకానొకశాప మామెకుం గల్గెను. ఆకోపమునవచ్చుచుండభగీరథప్రార్థితుఁడై మహాదేవుఁడు తనజటాజూటమున దానినంతయు నిల్పెను. ఆ మహానదీజలమంతయు భగవచ్ఛక్తిచే నొకబిందువయ్యెను. ఎంత కాలము భగీరథుఁడు వేచినను నది వెడలి రాదయ్యెను. మరల శంకరుని బ్రార్థించెను. భక్తపరాధీనుఁడుగావున భగీరథునిపైఁ గరుణించి యాయున్నతశైల భావమునుండి జటాజూటమున నున్న గంగానదిని వదలెను. తనవేగమింతయల్పమా యన్నకోప మునఁబరుగిడునట్టు లాగంగాదేవి యాభాగమునుండి భూమి కవ తరించెను. ఆయున్నతభాగమునఁ బ్రవహించునదికి గంగ యనియే

పేరు, భూమిపైఁ బడినది మొదలు భాగీరథియనునామము వచ్చెను. ఆపతనస్థల మెంతమనోహరముగ నున్నదో పరికింపుము. గంగా యాత్రాస్థలములయందెల్ల నిది ముఖ్యతమమైనది. ఇందే వ్యాస పూర్ణిమలయందు మహర్షులు స్నానము చేయుదురు. లోకమున సదాచారములు నిలుపవలయుననియే యితరులకు మార్గదర్శకు లగుచు మహర్షులు వచ్చుచుందురు. ఈస్థలమునందే అద్వైత మతమును శ్రుతిప్రమాణనిబద్ధముగా సిద్ధాంతముచేసి లోకుల కెల్ల బోధించినశంకరాచార్యులు తనపనిపూర్తికాఁగా నద్వైత మునెల్లరకు బోధింప శిష్యుల నియోగించి వారికిఁ జెప్పఁదగిన మాటలం జెప్పి సాగనంపి యీజలధారలనుండి కైలాసమునకు నిర్గమించెను. ఆవిషయము చాల విచిత్ర మని నీవు తలంతువు కాఁబోలు. మానవులకు సిద్ధులనే వో తెలియవు కావున నన్నియుఁ జిత్రములుగనే తోఁచుచుండును. శంకరుఁడు మానవరూపమున భూమినంతటను దిరిగి దుర్మతముల ఖండించి సనాతనములగు షణ్మతములను దోషరహితములుగా సిద్ధాంత మొనర్చి శిష్యులకుఁ జక్కఁగబోధించి తాఁజేయఁదగుపని యైనందున నీగంగోత్తరయందవగాహన మొనర్చి స్వరూపావలోకనమున మానవదేహమునకు దేవత్వమును గల్పించియుఁ బరిశుద్ధమగు మానవతనువును గంగాజలములం గలియు నట్లొనరించి తేజోరూపమునఁ గైలాసమున కరిగెను. ఇది పరమపావనమని దేవత లెఱింగినట్లు మానవు లెఱుంగరు కదా! మహర్షులును జక్కఁగ నెఱుంగుదురు. మఱొకవిశేషము నెఱింగించెద వినుము.

వైకుంఠమునుండి గంగాదేవి శాపమునసుభవింప భూలోకమునకు వచ్చి శంకరుని ప్రార్థనమునుండిఁ వగతొలఁగునట్లు లామహాదేవుఁడు నెత్తి పైఁబెట్టుకొనఁగా నూఱటఁజెంది యివ్వాస్థమున వెడలినది. సూక్ష్మదృష్టి నావలనఁ బొంచి పరికింపుము. సహస్రముఖముల నింపఁ బడుచున్నది. ఒక్కొక్కధారదిగ్గజాకృతిని బరిమాణమున మించినది. కొన్నిధారలు వలయాకారములుగా నగపడుచు భూతలమునకు దిగుచున్నవి. కనుఁగొనుము. ఫేనములనెల్లెడలఁ బడునట్లుఁ జిమ్ముచుఁ గొన్నిధారలనంతవేగమున వచ్చుచున్నవి. మఱికొన్ని ధారలు శాంతవేగముగా వచ్చుచున్నవి. ఈమూఁడుభేదములు త్రిగుణములనంబడు. సత్వరజస్తమస్సులను దెలుపుచున్నవి. గంగ లోకులదుర్గుణములఁ దొలఁగించును. తమోగుణప్రధానులు వలయాకారములుగఁ బడుచున్నధారల యందుఁ దొలుతస్నానము చేయవలయు. దీనఁ దమోగుణము తొలఁగెనని నమ్మవలయును. మరల ఫేనములనెగఁజిమ్ముచు వచ్చుధారలస్నానము చేయవలయు. దాన రజోగుణము తొలఁగినట్లు నమ్మవలయును. మూఁడవతడవ శాంతవేగముగ నిలఁబడుధారల నిమజ్జన మాచరింపవలయు. దాన సత్త్వగుణము స్థిరమగునని యూహింపవలయును. ఇట్లు మూఁడుపర్యాయములు భక్తిభావమూని యీసుక్షేత్రమునకు యాత్రకై రావలయు. ప్రథమయాత్రయందుఁ దమోగుణము నడంచుకొనవలయును. అదియడంగదేని మరలనందే స్నానముచేసి భవానిం బ్రార్థించి తల్లీ! నాతమోగుణము నడంపుమా యని వరమడుగవలయు. మరల యాత్రకరుదెంచినపుడా సందేహము తొలఁగదేని, అనగా స్వానుభవమునఁ దెలియఁ

బడదేని మరల నందే మునుంగందగు. ఇట్లు పునఃపునరావృత్తా కరణమున ధూతపాపుఁడు కావలయు. ఇదియే యెఱుంగఁదగు విషయము. వత్సా! సాష్టాంగనమస్కారము నొనరింపుము. గంగా భవానిం బ్రార్థింపుము. మనశ్శుద్ధి నొసంగునది గంగాభవాని కదా. అని హెచ్చరింప నామహాపురుషునాజ్ఞ శిరసావహించి యట్లే చేసితి. గంగాజననిం బ్రార్థించితి. ప్రాగ్జన్మదుష్కృత ములఁ దొలఁగించి కృతకృత్యునిగ నొనర్పుమా యని వర మడిగితిని.

## గౌతమమునియాశ్రమము

అంత నాబాలరూపధరుఁడగు పరమపురుషుఁడు నన్నుం బిల్చి గంగావతరణభాగమున కించుకసమీపమును బరికిం పుము. అందుండి యొకజలధార వెలువడుచున్నది. అది ప్రాచీన గంగ యనం బ్రఖ్యాతిని గాంచెను. గంగరాకముం దాజల ధారయే ప్రాచీనగంగానామమునఁ బ్రవహించుచుండెను. అది యిప్పుడు భాగీరథిని గలియుచున్నది. గౌతమముని తపస్సొనరించు తావు దానికించుక తూర్పుదెసఁ గలదు. ఆభూరుహములనడుమ నున్నది. అందొక్కయద్భుతము గాననగు. రమ్ము అనిపిలుచు కొని పోయి వత్సా! చూడుము. బెబ్బులిదాపున గోవు నిలిచి యున్నది. నెమరునేయుచున్నది. అది బెబ్బులి కాదని గదా నీభా వము. హిమప్రధాన మీభాగమను మాట మఱవకుము. ఇందు వర్ణము మార్పునొందును. తక్కిన భూధరములందును గానన ములందుసుండు వానికంటె నివియున్నతము లైనవి. పొడవుగ నుండును. బలిష్ఠములునగు. వానిచెంతనిర్భయముగా గోవులు నిలుచున్నవికదా. మహాముని శాంతము వర్ణనార్హముకాదా.

వాని ప్రక్కనఁ జిఱుతపులి యావుదూడను నాఁకుచున్నది. పరి
కించితివి కదా. పెద్దపులిమీఁద మేఁకపిల్ల యెగిరి కూరుచుండఁ
బ్రయత్నించుచున్నది. అదిగో కూరుచున్నది. సావధానముగా
నరయుము. వత్సా! ఇదొకగారడి యనుకొనుచున్నట్లుగలవు.
ఇది మహారణ్యము. మనుష్యప్రచారమిందు లేదు. అట్టి తావుల
నుండుసత్త్వములు భయంకరములుగ నుండును. అట్లులుం
డియు మహాత్ముల తేజోబలమునఁ దమక్రౌర్యమును విడిచి
సహజవాత్సల్యము నెఱపుచున్నవి. ఒక్కమాట చెప్పెద. సర్వదా
మది దాని నిలుపుకొనుము. మహాత్ములనఁగా సర్వభూత
దయాళువులు.

శ్లో. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

అనుగీతావాక్యముచొప్పున సమదర్శనులనంబడుదురు.
అట్టివా రుండుతావుల సర్వభూతములు క్రౌర్యముమాని
యుండును. మహాత్ములనఁగా నెవరిదర్శనమున వ్యాఘ్రాదులు తమ
సహజక్రౌర్యమును వీడి సర్వభూతములను దమ్ముగా భావిం
చునో యట్టివారు మహాత్ములు. మహాత్ములని పేరుపెట్టినవారెల్లఁ
గారు. తమకుఁ దెలియని ధర్మముల నితరులవలన నేర్చుకొని
వానిని దమ రాచరించినట్లు ప్రేలు కపటాత్ములు దుష్టతములని
భావింపుము. అట్టివారు ప్రపంచమునఁ బెక్కురు కలరుకదా.
తమవాదమునకుఁ బ్రతివాదము వినఁబడఁగనే మితిమీఱిన
కోపము గలవారు మహాత్ములగుదురనుట కేవలభ్రాంతి. అట్టివారిని
పామరులు గౌరవింతురు. వారికీర్తి శాశ్వతముగా నిలువఁజా
లదు. తఱచుగా వారినుండి లాభమును గోరువారే వా

వెంటఁ దిరుగుచుందురు. కావున మహాత్ములశక్తి ఘోరపరీక్షలకు నిలువవలయును.

గౌతమముని తపశ్శక్తి యిట్టిదని వచింప నలవికాదు. భార్యయగు నహల్యకు శాపవిముక్తి కాఁగాఁ దన యోగదృష్టి నెఱింగి యచ్చటికింబోయి యామె నోదార్చి యాశ్రమమునకుఁ దోడితెచ్చెను. ఇం దయ్యెరువురు తపోనిష్ఠనున్నారు. నియమములకు లోనై యుపవాసములను గృహించియున్నయట్లు వారగ పడుదురు. కాని మనోబలమున నవీనవయస్సు గలిగియున్నవారు. వారెంతకాలమైనను జీవింపఁగలరు. ఓషధుల నాహారముగాఁ గొనువారు చిరకాలము జీవింతురు. లంబికాది యోగముల నభ్యసించువారు నుందురు. వారి యస్థిపంజరము క్రొత్తగనే యుండును. అందంతర్వర్తిగానున్న తుజ్జయనుపదార్థము దిన దినమభివృద్ధి నొందుచుండునని యెఱుంగుము. ఇప్పటి మానవుల కీమాటలు నమ్మరానివిగా నుండును. ఏలయన వారికి యోగ మననేమో తెలియదు. పుస్తకపఠనము యోగశాస్త్రమునఁ జాలదు. చిరకాలాభ్యాసమున నది సమగ్రఫలప్రద మగును. గౌతమమునియే లోకోపకారముగోరి గౌతమీనదిని దెచ్చిన మహానుభావుఁడు. ఇఁక వానిదర్శించి రమ్ము. ఆయాశ్రమమున కరిగి వానిని దర్శించి రమ్ము. అని పలికెను. నేనామహాత్మునానతి విని యీయున్నతపర్వతము నెక్కి వ్యాఘ్రాదు లట నుండ వానింగాంచి భీతిల్లక వాని కాహారము గాకపోయి రాఁగలనా యని ప్రశ్నించితి. పక్కునననవ్వి యిదే గౌతమాశ్రమమను నంతలో నాయాశ్రమమున నుంటిని.

ఆయాశ్రమమున నిరంతరము పూచెడు లతలు గలవు. నిత్యఫలవంతములగు వనస్పతులు గలవు. లతానికుంజములు గలవు. లతామండపాభ్యంతరములఁ గూరుచుండి యెందఱో మునులు తపస్సు చేయుచుండిరి. వేదపాఠము కొందఱు చేయు చుండిరి. వారిం గాంచినంతనే నాయొడలు హర్షాతిశయమునఁ బులకరించెను. హిమవాతము లందునున్న జాడ నాకుఁ దోఁపలేదు. గ్రీష్మాతపబాధయు నందుండువారికి లేదని నాకుం దోఁచెను. సర్వర్తుకుసుమములు ఫలములును దదాశ్రమమునఁ గలవు. ఒకవంక గున్నమామిడిచెట్టు కనంబడెను. దాని క్రిందఁ గూరు చుండిన ఫలములు చేతికి దొరకును. దానికి నించుక యుత్తర భాగమున లతాగృహములు కనఁబడియె. వానియం దొక్కచోట మాత్రమే మునివరుఁడు నాతనికించుకదూరమున సాధ్వీ మణియుఁ గూరుచుండి యుండిరి. వారికి దక్షిణభాగమున మూఁడు దర్భాసనములు కృష్ణాజినములపైఁ బఱచియుండినవి. అవి చక్కఁగాఁ గనఁబడినవి; కాని యం దెవ్వరును గూరుచున్న జాడ కానరాదయ్యెను. ఏల యూరకయున్నవని యూహించితిని. సందేహించుచు నించుక సమీపమునకుఁ బోయి యమ్మునివర్యుని జక్కఁగాఁ జూచితిని. ఆమహాపురుషుని ముఖమున బ్రహ్మతేజస్సు వెలయుచుండెను. అంకద్వయమున నేవో పక్షులు శయనించి యుండెను. వానిచెంత హరిణశిశువులు రెండు నెమరు వేయుచుఁ బరుండియుండెను. వానిం జూడఁగనే

శ్లో. ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంక మంకేశయాః.

అను భర్తృహరిశ్లోకము,

క్రియానిమిత్తేష్వపి వత్సలత్వాదభగ్నకామా మునిభిః కుశేషు,
తదంకశయ్యాచ్యుతనాభినాళా కచ్చిన్మృగీణామనఘా ప్రసూతిః.

అను రఘువంశస్థకాళిదాసమహాకవిశ్లోకము నీ రెండును స్మృతిగోచరము లయ్యెను. నన్నుం జూడక యమ్ముని నియతిమై నుండెను. దక్షిణశ్రవణమూలమున జపమాల వ్రేలాడుచుండెను. ఆమూఁడు దర్భాసనములపై నెవ్వరు లేకున్నవారే ఏల? యను సందేహము నన్ను బాధింపసాగెను. ముహూర్తమాత్రము నిలుచుండఁగా మెల్లన నమ్ముని దేహము కదలినజాడ కనిపించెను. సమాధినుండి యిప్పుడే విరమించుచున్నాఁడని తలంచితిని. క్షణకాలమునకు నేత్రముల విప్పి జలములచే వానిం దుడిచి యాచమించి పక్షుల నేమనక నన్నుం జూచెను. ఏమనునోయన్న భయము నాకుం గల్గెను. మోమున వింతదైన్యము దోఁచెను. వత్సా! రమ్మని దేవభాషం బిల్చెను. సమీపించి సాష్టాంగ నమస్కారము లొనరించి నిలువంబడ నమ్ముని కూర్చుండ సంజ్ఞచే నియమించి నీరాక నెఱుంగుదు. ఇందలి విశేషములం జూడఁ గోరితివి కదా చూడుము. జ్యోతిర్లత లవియే! అవి తామసీ రాత్రులందు మండుచుండును. ఆలతలు పచ్చగానుండక తెల్లవిగ నున్నవి. చూచితివికదా! అవి కందమూలఫలాదు లనంబడు వానిలోఁ జేరినవి. వాని యాకులు చిదిమిన వెంటనే "పుటకే పుటకే మధు" అన్నన్యాయానుసారము పుష్పరసము స్రవించెను. దానిం ద్రావిన నొకమాస మాహారవాంఛ యుండదు. ఆలతల కవ్వల నల్లుకొన్నతీఁగలం జూడుము. వానిమూలభాగమున వట్రువగానున్న దుంప యుండును. అదియే కందమనం బడును.

వానినొకప్పుడు వచ్చి నాతప్తముగా నొనరించి భక్షించిన నితరాహారవాంఛ చాలకాలముండదు. ఇందు యథారుచిగా భక్షించుట మాయందలి యాచారము. ఇతరస్థగమనాపేక్ష యాహార విషయమున మాకు లేదు. వృద్ధగంగయందు స్నానము చేయుదుము. విశేషము లివ్వియే. ఇంక నేమి కోరుదువు? అని ప్రశ్నించెను. మహాత్మా! భవదీయపాదరజస్స్పర్శమున ధన్యుఁడనైతిని. రెండుమూఁడు సంశయములు గలవు. సెలవే నడిగెద.

ముని—అడుగుము. సంశయమేల? వచింపఁదగినదేని సమాధానమిత్తుము.

ప్రశ్నము—ఆయాసనము లూరకున్నవే. అందలివారెందున్నవారు?

ఉత్త—వారు గంగాప్రాదుర్భావస్థలమునకు స్నానార్థ మరిగిరి. అందే జపము చేసికొనుచుందురు. వచ్చినను వత్తురు.

ప్రశ్న—తమయొక్కయు నామాతృశ్రీయొక్కయు నామధేయమును వినఁగోరెద. ఆముప్పురనామములును వినఁగోరెద.

ఉత్త—మాయిర్వుర పేరులు చెప్పఁబడియె. వాని నెఱింగించియే నీవిటకుఁ బంపఁబడితివి. మరలఁ జెప్పనక్కఱలేదు. వారే మేమని నమ్ముము. ఆముప్పురు గర్గ శౌనక వైశంపాయను లని పిల్వఁబడుదురు.

ప్రశ్నము—వారేల యిచ్చట నున్నారు?

ఉత్త—కలికాలమున భారతభూమి నుండఁదగినది కాదని వచ్చిరి. కలిని గొంతకాలమందే గడపిరి. పిదప వచ్చిరి.

ప్రశ్న—కలికాలమునట్టివారుండి ధర్మమును గాపాడవలదా ?
స్వలాభము చూచుకొనుచుండ నేల ?

ఉత్త—మహాత్ములు నిష్కపటులు. వారిమాట లీకలికాలమునఁ
బనికిరావు. డాంబికులపల్కులు వేదతుల్యములు. కావునఁ
గొంతకాలము చూచి చివరన బోధింతురు.

ప్రశ్న—కలికాలమున నల్పపుణ్యకార్యము చేసినను మోక్షము
కరతలామలక మని చెప్పుదురు కదా! అట్టివా రుండరా?

ఉత్త—అల్పపుణ్యకార్యము చేయుటకుంగూడ వారికి భక్తి
యుండదు. శ్రద్ధయు శూన్యమే. కొందఱు చేసినను
బ్రతిష్ఠార్థ మొనరింతురు. దాన యశస్సు లభించుటయే
ఫలము. అదియుఁగొలఁదికాలముననే నశించును. శ్రద్ధా
భక్తులు నిర్మలస్వాంతము లేక చేసినపుణ్యకార్యమునకు
ఫలమైహికసుఖమే. అదియునల్పమే. కాఁబట్టియే కలికాల
మున నెంతపుణ్యకార్యము శ్రద్ధాభక్తులు గలిగి చేసినను
ననంతఫలమని పెద్దలు చెప్పిరి.

అని పల్కియు నింకను నే నేమొ ప్రశ్నింపఁబూను
కొఱంగి వత్సా! ముందు నీప్రశ్నములకు నుత్తరము లిచ్చు
వారు గలరు. వారినడుగుము వేళ యైనది. అనుష్ఠానమునకుఁ
బూనుదము. అనఁగాఁ జేతు లొగ్గి మహామునీ! కృతార్థుఁడ
నైతిని. పూర్వపుణ్యవశంబున మిమ్ముదర్శింప నోఁచితిని. ఒక్క
మనవి గలదు. వేళ యైనను సెలవీయ వేఁడెదను. అనఁగా నవ్వి
యడుగు మనియె. భగవద్గీతాశాస్త్రము ప్రమాణమని యొప్పు
కొనుచునందుఁ గొన్ని శ్లోకము లితరులు చేర్చి రనియు భారత
మున ననేకభాగములు ప్రక్షిప్తములనియుఁ జెప్పుచుందురు.

సత్య మందేది? అనునంతలో నేను శ్యామసుందరమూర్తి సన్నిధి నుంటిని.

ఆచిత్రచర్య నా కత్యంతాశ్చర్యముగఁ దోఁచెను. పెన్నిధినిగోలుపోయినపేదవలె నాయాశ్రమము ప్రక్కఁ జూచుచుండఁగాఁ బకపకనవ్వుచు నాచెంతనున్న బాలసుందరమూర్తి చిటిక వ్రేసెను. అంతలో వేఱొకతావుననుంటిమి. ఆపర్వతము మిగుల నున్నతము. దానియొక్కభాగము చూడ విచిత్రముగా నుండెను. దానికిఁ బ్రక్కన నింతకంటెనెత్తుగాఁ గనంబడు పర్వత ముండెను. ఈరెండును గనంబడున ట్లొక్క పవిత్రస్థలము కనంబడియెను. ఆతావున నిలుచుండి వీక్షించిన మహోన్నతాశ్చర్యకరభూరుహాశృంగద్వయము కనఁబడుచుఁ బరమేశ్వర సృష్టివైచిత్ర్యమును జాటుచుండును. ఏభూతముగాని యాచోట నున్నచో శాంతగుణప్రధానముగ మాఱునని నాకుం దోఁచెను. సర్వభూతశరణ్యుఁడీచోటఁ బ్రియముననుండునా యనియు స్ఫురించెను. అత్తఱి నామదిఁగలయుత్తలపా టెఱిఁగి నాయానందమునుగుఱించి సర్వజ్ఞుఁడుగావున నిట్లు పలికెను. ఆతరుణమున నామహాపురుషుని మోమున సంతోషము మూర్తీభవించినజాడ గనఁబడుచుండెను. నాకే యచ్చెరువుగా నింతలో నిట్లు మార్పునొందనేల? యనియుఁ దోఁచెను.

### బదరీనారాయణక్షేత్రము

వత్సా! ఇది బదరీక్షేత్రమనియు, బదరీనారాయణక్షేత్రమనియు, బదరికాశ్రమమనియుఁ జెప్పఁబడును. పరమపావనము. జగద్విఖ్యాతము. నరనారాయణులను నాదిమమునులు కృష్ణార్జునులుగ నవతరించిరనివింటివికదా. ఆనరనారాయణు

స్థలమున నిలిచి చిరకాలము శంకరుఁగూర్చి తపం బొనరించిరి. కావున నిది తపస్సిద్ధిప్రదము. పరమపవిత్రము. ఇందున్న పవిత్ర శిలమీఁదఁ బితరుల నుద్దేశించి పిండదానము చేసినచో నక్షయ పుణ్యలోకములు వారికిం గల్గును. పుణ్యపూరుషులు సకలకష్ట ములపాలై యిచ్చటి కరుదెంచి భగవంతుని సందర్శించి పితృ దేవతాసంతృప్తి నొనరించి పోవుదురు. నరనారాయణాశ్రమ మగునిందు మహర్షు లెందఱో తపస్సుచేసి పరమేశ్వరకరుణా పాత్రులయిరి. ఈస్థలమున నాలు నెలలు మునులే భగవంతుని బూజింతురు. హిమశిల లీస్థలమున నప్పు డావరించియుండును. కావున మనుష్యుల కిచ్చోటు దుర్గమము. హిమశిలలు కరఁగు చుండఁగ మనుజు లరుదెంచి భగవంతు నారాధింతురు. చక్కఁగా నీపరమపావనస్థలమును వీక్షించి నమస్కరింపుము. అంతియకాక యీస్థలము ధ్యానింపఁదగినది. కాఁబట్టి మది నిలుపుకొనుము. అని యాదేశించిన భక్తినమ్రకంధరుఁడనై నరనారాయణక్షేత్ర మును ధ్యానించి భగవత్స్థానమగు వైకుంఠమనియే భావిం చితిని.

అంతలో నెచ్చటికో పోవుచున్న చందము తోఁచెను. రెండుకన్నులు విప్పిచూడఁగా నొకపర్వతశృంగము గోచరిం చెను. నలుప్రక్కలఁ బర్వతపంక్తు లున్నయట్లెనాకుం దోఁచెను. శ్యామసుందరమూర్తి బాలకా! యని నన్నుం బిలిచి యీశైల శృంగమును జూడు మనియె. మహాత్మా! ఇది యేపర్వతమని యడిగితి. హిమాలయమనియే నమ్ముము. ఈయాత్ర హిమా లయయాత్రయనియే విశ్వసింపుము. ఈశిఖర మత్యున్నతము. నందదేవీశిఖరమని దీనిని వాడుదురు. ఆకసమును దాఁకుచు

న్నయట్లగపడును. మేఘములు దీనియంతర్భాగమున ప్రేలాడు చుండును. మేఘమండలము నున్నతిచే మించినదని తలంపుము. ఇది సార్ధద్విక్రోశపరిమితోన్నతిగలది. (4 మైళ్లు 6 ఫ. 206 గజములు) దీనిం జూచినంతనే సామాన్యజనులు భీతిల్లుదురు. దీని నెక్కఁజాలరు. ఇందు విశేషించి క్రూరజంతువు లున్నవని విఖ్యాతిగలదు! కాని యది కల్ల. యశోద సంతానము. వడయం గోరి యీశిఖరమున భర్తయగునందుని గూడి తపం బొనరించెను. కావుననే నందదేవిశిఖరమను పేరు జగద్విఖ్యాతంబయ్యెను. దీని నెక్కవలయునను కుతూహలము గలిగినదెకదా. ఇదె రప్పమునంతలో దానిశిఖరమున నుంటిమి.

## నందదేవీశిఖరము

నందదేవీశిఖరాగ్రమునుండి చూచితిని. క్రిందనున్న శిఖరము లతిస్వల్పములుగాఁ గనంబడియెను. గజములు చిన్నపిట్టల కంటె నల్పములుగాఁ బరికించిచూడఁ దోఁచెను. క్రిందిభాగము జూడఁదగదనియుఁ దోఁచెను. అత్తఱి నామహాత్ముఁడోయీ! ఈనదిని దిలకింపుమనియె. ఒక్కభాగమును దిలకించితిని. గండోపలములఁ దనజలవేగమునఁ దొరలించుకొని పోవు చుండెను. అగాధజల మందుఁగలదని తోఁచెను. నాకన్నులు తిరుగసాగెను. నిలువఁజాలనని తోఁచెను. స్వామీ! దిక్కుతోఁపకయున్నదని విన్నవించితిని. భయంపడకుమా యన్నంత ధైర్యముగలిగె. కన్నులు తిరుగుటమానెను. దిటవుగలిగినందునఁ జక్కఁగాఁ జూడఁగల్గితి. ఆనదిలో మునింగి యొకవృద్ధుఁడు కమండలువునిండ జలంబులం దీసికొని వచ్చుచున్నజాడ కనఁబడియెను. ఎవ్వఁడామునిచంద్రుఁ డని ప్రశ్నించితిని. ముందు నీకే

తెలియఁగలదు. అనునంతలో నామునివర్యుఁడు కొంతదూరము శిఖరాగ్రమున కెక్కివచ్చి యించుకతూర్పునకుం దిరిగి కొంచెము దూర మేగియొకగుహాఁ జేరనుండెను. వత్సా! ఆగుహ మనకు సమీపముననే యున్నది. ద్వారసీమం గలపూవులఁగోయు చున్న యమ్మునిచెంత కరుగుము. ఆమునితో నాశ్రమమునకుం బొమ్ము. ఎవఁడవని ప్రశ్నింపక నీతో మాటలాడును. అన్ని సందియములు తొలఁగును. అని పంపఁగానే నచటికిం జేరునంతలో మరలఁ గమండలువు చేతనందుకొని పుష్పములుంచిన యాకుం దీసికొని గుహాలోనికిం బోవుచుండెను. వెంటఁబడితిని. ద్వార భాగము చాలచిన్నదిగానుండెను. ఎట్లు చొరనగునా యని చింతించితి. రెండడుగు లామునివెంట నరిగితిని. ద్వారము దాఁటు నంతదనుకఁ గష్టముగా వంగిపోవలసిన ట్లుండెను. ద్వారమును దాఁటఁగనే పాషాణనిర్మితసోపానము లుండెను. వాని నెక్కునపు డలవాటులేనినే నించుక యాయాసపడితిని. కాని యెట్లో యమ్మునిదూరముపోకయుండ ననుసరించి పోవఁగల్గితిని. శ్యామ సుందరమూర్తి కరుణకలదగాన నెట్లో చొరఁబడితిని. సోపానము లెక్కి దిగఁగానే విశాలభాగము కనఁబడియె. పర్వతభాగమే యని తోఁచెనుగాని యం దంతర్భాగ మని తోఁపదయ్యెను. శిఖరాగ్ర మున్నదా యని పరికించితిని. కాన రాదయ్యెను. గుహాంత రాళమనియు వెలుతురుండుటకుఁ గారణము తెలియఁ జాలననియు నూహించుచుండ నాపదములచప్పుడు విని తిరిగి చూచి నవ్వెను. భయము నామదినుండి తొలఁగెను. సంతో షము సగము సత్తువ యన వినియున్నాఁడను. పలుకరింపక నడువ సాగెను. నేనేమియుఁ బ్రశ్నింపక శ్యామసుందరమూర్తియా

నలినమ్మి నడువసాగితిని. నడుచునపుడు కంటకములుగాని కఠిన పాషాణములుగాని కానరాక మార్గము మెత్తగనుండెను. లతా మండపములు తఱచుగాఁ గనఁబడియెను. అవివలయునని పెంచు చున్నయట్లు తోఁచెను. ఫలవృక్షములు విశేషించి కనఁబడలేదు గాని దట్టముగా నాకాశమువఱకుఁ బెరిగినట్లున్న భూరుహ ములుమాత్రము కనఁబడియెను. వానిపై హాయిగాఁ గూరు చుండినపక్షులకలనాదములు నన్నానందమునఁ దేల్చెను. నేనం తకుముం దెన్నఁడు నట్టిపక్షులను జూడలేదు. పంచవర్ణశుక ములు వేలకు వేలుండెను. కొంగవలెనుండి యీఁకలు దట్టముగ నుండుట పక్షములు లావుగానుండఁగాఁ జూచుట కంతసుంద రముగాఁ గనంబడకున్నను నది వృక్షశాఖాగ్రమునఁ గూరు చుండి వ్రేళ్లు దానిం దగులునట్లుచేసి యాకొమ్మను జుట్టివచ్చు నట్లు తిరుగుచుండుటమాత్ర మచ్చెరువును గల్గించును. నడుమ నడుమ నదియొక కలరవ మొనరించును. అది కోయిలకూఁత వలె నింపుగా నుండదన్న ననవచ్చునుగాని కొందఱ కింపుగా నుండును. నాచెవుల కెంతో ముచ్చటగా నుండెను. కొన్ని తావుల నాపక్షులే తనకుటుంబముతో నున్నయపు డావృక్షశాఖ యంతయు వెండివలెనే కనంబడును. తమలోఁదా రవియన్నియు నేమోమాటలాడుచుండఁగా నౌరా! భగవన్మహిమము! అనియుఁ బ్రతిప్రాణియు జీవితాశంగనిసుఖము చెందఁగోరి యెంతో ప్రయ త్నముచేయునట్లు కల్పించినకర్మ మెంతబలవత్తరము! అనియు మదికిందోఁచును. వేఱొకజాతిపక్షు లంతకుముందు నే నెన్నఁ డును జూడనివి విననివి కనంబడియెను. ఆపక్షిజాతివర్ణము పారావతములరంగుఁబోలియుండెను. కాని పావురములు

మాత్రము కావు. అవి గరుడపక్షియంత యాకారముకలిగియుం
డెను. ముక్కుమాత్రము దానివలెగాక యించుకపొడవుగను
సూక్ష్మముగనుండి కొంగముక్కును బోలియుండె ననవచ్చును.
అది జలములలోఁ జరియించుమత్స్యములను పైనుండి తటా
లున దుముకి పొడిచి తీసికొని పోవుటకుఁగా నిర్మింపఁబడిన
దేమో యని తోఁచెను. కాని దానితత్త్వ మిద మిత్థమని నిర్ణ
యింపఁజాలకయుంటిని. మఱొకతావున నుడుతలు పలురం
గులఁ గనఁబడెను. అదొకవింతగాదు కాని యందొక్కజాతియుడు
తలు పొడవుగను లావుగలవిగనుండి పక్షములుగలిగి చివా
లున నొకశాఖనుండి వేఱొకశాఖకును, ఒకచెట్టునుండి వేఱొక
చెట్టునకు నెగురుచుండఁగంటిని. తొలుదొలుతఁ జిన్నివానర
ములా యని విభ్రాంతినొందితిని. కాని వానివాలములను వీఁపు
పైనున్న తెల్లనిరేఖలనుజూచినపుడు వానరములుకావు. ఉడు
తలే యని నిశ్చయించుకొంటిని. వానరములా యనుకొన్న
ప్పుడు వానిపక్షములను గుఱుతింపక యట్లు భావించితి. స్పష్ట
ముగా నవి క్రిందినుండి పైకెగురునపుడుడుతలే యనుకొంటిని.
ఆయుడుతలు గుంపులుగా నుండునపుడు చూచినచో నెవ్వని
కైన మెప్పు తోఁచును. అవి శ్రీరామకార్యమును యథాశక్తి
సాయపడి సాగింప నెగురుచున్న ట్లూహ కల్గును. వానిధ్వని
యించుక వానరములకంఠధ్వనిని బోలియుండెను. కాయలు
పండ్లు వాని కాహారమైనట్లు లవి సచరించుచోటఁ బడియున్న
విత్తనములే తెల్పుచుండెను. పక్షములులేనియుడుతలతో నవి
కలసియుండక తమజాతియుడుతలతోఁ గలసియుంటయు,
వేఱొక్కచో నవి కనఁబడినపుడు వానితోఁ గలహించుట

యుంగంటిని. ఉడుతలకుంగూడ జాతియం దభిమానము కలదుగదా యని గ్రహించితి. ఈయభిమానము సనాతనము కాని నవీనముగాని యజ్ఞానకల్పిత మనికాని చెప్పవలను పడదనియు సంభావించితి. ఏల స్వల్పజంతువులనుండి యీ జాత్యభిమానము కల్పితమయ్యెనో భగవంతునియిచ్ఛ యెట్టిదో యెఱుంగఁజాలకయున్నాఁడను. నావంటియల్పమతి కిది శక్యము కాదేమో యనియు నూహించితిని. కొన్ని తావుల నుడుతలం బోలినజంతువులు కన్పట్టెనుగాని యవయవసంస్థితియందు వ్యత్యయము కనఁబడియె. వానిపే రెఱుంగఁజాలనైతిని.

ఆబయలునందు బహువిధవృక్షములు కన్పట్టెను. వానియం దివ్వియని నే నెఱుఁగజాలినవి బహుస్వల్పతమములనుట కంటె వాఙ్మయము నాకుం దోఁపలేదు. వానియందుఁ గన్పడు పుష్పములు పలువన్నెలుగలవి. పరిమళమును వర్ణింపఁజాలను గాని వానిసౌందర్య మప్రతిమానమని చెప్పఁగలను. క్షణమున కొకతడవ ముకుళించుకొనుచు మరలవికసించుపుష్పముల నంతకుముం దెన్నఁడును జూడలేదు. ఆసృష్టివైచిత్ర్యము మహాత్ముల కేని వర్ణనాతీతము. భగవంతుఁడే యెఱుంగుననుట నావంటి వానికిం దగినది. ఎత్తుగానుండక తీఁగలవలె నల్లుకొనుశాఖలు గలవి పెక్కు లందుఁ గనఁబడెను. ఆకొమ్మలనిండఁ గుసుమములే. పూలపాన్పుపఱచినట్లే కనంబడియెను. అది చూడఁదగినదేకాని చెప్పఁగా విన్నంతన యంతసంతృప్తియుండదు. కొన్ని వృక్షములనిండ ఫలములే కన్పడియెను. పూవులఁ జూడ నెంచినను గనంబడకుండెను. అదియు నొకవిచిత్రమేకదా. ఇట్లు తెలుపఁ బోగిన నందలి విచిత్రపదార్థముల కిట స్థలము చాలదు.

కొంతదూరము మునివెంటఁ జనఁగాఁ జిన్నినది యొకండు కనంబడియె. అది స్నానమునకుంగాక తిర్యగ్జంతువులనిమిత్తము స్వల్పజలపూరముతోఁ బ్రవహించుచున్నదని యెంచితి. నా యూహ నిజమే యైనను గాకున్నను మునివరుఁడుమాత్రము గుహకు వెలుపలనున్న సెలయేటికి స్నానమునకు వచ్చినది మాత్రము సత్యము. దానింబట్టియు నాచిన్నయేటియందు జలమల్పముగ నుండుటయు నాయీయూహకుఁ గారణములయ్యెను. దానిందాఁటఁగనే యాశ్రమస్థలములుగా నున్నవృక్షమూలములు కనఁబడియెను. వేదికలుగా వృక్షమూలములయందమర్పఁబడియుండెను. వ్యాఘ్రచర్మములందుఁ గప్పట్టుచుండెను. వానింజూడఁగనే యించుక మనస్సు చంచలించెను. మునియు నందొకచో నాసీనుఁడయ్యెను. తక్కుంగలయాసనములలోఁ గొన్ని రిత్తవిగ నుండెను. దూరముగఁ గొందఱు కూరుచుండియుండిరి. నేను మ్రోల నిలువఁబడఁగనే ముని యాచమించి కూరుచుండుమనియె. కూరుచుండి చేతులు జోడించితిని. నామది నీతఁడే మడుగునో బదులేమి చెప్పవలయునో యని యాలోచించుచుంటిని. ఇంతలో బ్రాహ్మణకుమారా! యని సంబోధించి నీశంకలకు నుత్తర మీవలయునని భగవదాజ్ఞ కదా. నీవాంఛఁ బ్రశ్నింపుమనియె. మునీంద్రా! ధర్మములు మాఱుచుండునని పెద్దలందురు. కలియుగమున నట్లు మార్పు నొందరాదనియుఁ గొందఱందురు. మార్పునొందుట శాస్త్రవిహితమేయైనచో వర్ణాశ్రమధర్మములు తోఁచినట్లెల్ల మార్పవచ్చునా! దీనికి శిష్యవాత్సల్యమున సమాధాన మిందు. మఱియుఁ దోఁచినవాని విన్నవింతు నని యూరకుంటిని.

వత్సా! ధర్మవర్తనము ననుసరించియే యుగము లను విభాగము చేయఁబడినది. కలియుగమున ధర్మ మొకభాగముగ, నధర్మము మూఁడుభాగములుగ నుండుటంబట్టి జఘన్యయుగ మని పేరు పెట్టఁబడియె. కృత త్రేతా ద్వాపరములయందు మునులసంచారము గలిగి యుండెను. తపస్సు వ్యయించి లోకమున కుపకారముచేయుచు వారుండిరి. శాపభయమున వారిం గాంచిన నెల్లరు భీతిల్లుచుండిరి. వారు పరమశాంత ధనులై ధర్మస్వరూపమును బోధించుచు నుండిరి. కలికాలమున మనుజులకు వారిపైఁ బ్రీతి తగ్గెను. అంతియగాక వేదదూష కులు పెక్కండ్రు ప్రబలిరి. లోకులు కొందఱు వారి ననుసరింప సాగిరి. అజ్ఞానులు జ్ఞానధనుల నిందింపసాగిరి. వీరు వారి నేమనఁజాలక పరిభవింపఁబడుచుండిరి. వేదములందువిశ్వాసము తగ్గుటయేకాక యవి పురుషప్రణీతములే యనువారు పెక్కు మందిగ నుండిరి. ఇఁక శాస్త్రములమాట చెప్పనేల? ఉపనిషత్తు లుపన్యాసవేదికలందుఁ దోలుబొమ్మలపగిది నాడింపఁబడసాగెను. ఎవ్వరైనను వాని వినఁజదువ నిస్పృహులే యగుచుండిరి. భగవద్గీ తలమాట యిఁక నేటికి? మంచినీళ్లవలె నవి యుండెను. వానిం బఠింపను యోగ్యుఁ డెవ్వఁడనువిచారము శూన్యమయ్యెను. వేదాంతగోష్ఠి కధికారు లందఱు నయిరి. దుర్వ్యాఖ్యము లాస రించుచు నుపన్యసించునపు డుపనిషత్తుల నుపహాసించుచుండిన లాభ మేమియుండును? ఆయుపన్యాసము ధనార్జనమునకే యగు చుండు ననక తప్పదుకదా. అట్టివేదాంతోపన్యాసకులే గౌరవ పాత్రులగుచుండిరి. వారిశిష్యులసంఖ్య దినదినాభివృద్ధినొందసా గెను. వైరాగ్యసంపద శూన్యమయ్యెను. శిష్యవిత్తాపహారకులే

సద్గుణుప్రసారిరి. స్త్రీలు భర్తలయానతి లెక్కింపక తిరుగువారైరి. దేవతాప్రార్థనములు గౌరవార్థమయ్యెను. స్మృతులు ప్రతి క్షణము మాన్పనొంపింపవలయు నను దురవస్థకుం బాల్పడెను. ఇఁక మను లాభూభాగమున నుండ నవకాశ మెట్లు కల్గును? కావుననే మను లాభాగమును వదలి హిమాలయమునకుఁ జేరిరి. ఇంక భారతభూమి వర్ణాశ్రమధర్మములు నిరంతరము తాఱుమాఱగుచుండును. మను లందుండ వెఱతురు. మా శిష్యులు కొంత ఱేంకను బుణ్యభూధరముల నున్నవారు. వారు నింతకు వత్తురు. అనిపలికి యింక నేను బ్రశ్నింతునేమో యని యూహించికాఁబోలు మాకిఁక నాహ్నికమునకు వేళ యైనదని పలుకుచుండఁగనే శ్యామసుందరునిదాపున నుంటిని.

## శ్వేతశిఖరి (ధవళగిరి)

ఆమహాపురుషుఁడు నన్నుంజూచియుఁ జూడన ట్లుండి క్షణ కాలమున వేఱొకతావున నుండఁజేసెను. నేను బయనము చేయుచున్న ట్లుండెనుగాని మార్గ మిదనికాని యిట్లు నడుచు చున్నాఁడ ననికాని యెఱుంగఁజాలనైతిని. పరవశముగనే పోవు చున్నాఁడనని నాకే తోఁచుచుండెను. ఆవ్యక్తి నిలువఁగా నానడక నిలిచెను. నిలువంబడి యేల యిచ్చోటుచేరితిమి? ఇందేమేని విచిత్రముగలదా? అని యిట్లు మనసునఁ దర్కించు కొనుచుంటిని. నాలుగుప్రక్కలుకలయంగాంచితింగాని యించు కయు నేయూహకు నవకాశముగలుగకయుండెను. తూర్పుపడ మర లివి యని తక్కినభాగము లివి యనియుఁ దోఁపకుండెను. మనస్సు కలవిలపాటొందుటయేగాక విచారసాగరమునందు మునుంగుచుఁ దేలుచునుండెను. స్వామీ! యని పిలువను

గూడ నోరాడకుండెను. నాయిక్కట్టుల నాలోచించికాఁబోలు ముందున్న మహాపురుషుఁడు వత్సా! ఈపర్వతమును జూడుమని హస్తమునెత్తి కడు నచ్చెరువుగాఁ జూపెను. తూర్పో పడమరయో తెలియదుగాని - యాకసమే యిది యను నూహను బుట్టించు నత్యున్నతశిఖరి కనఁబడియెను. ఆభూధర మంబరమే యనవలయునుగాని పర్వతమన నవకాశమే లేదు. సమీపమున నున్నందున నించుక పర్వతమే యనునూహ కల్గునుగాని దూరము నుండి వీక్షించినఁ గొండ యిది యని తోఁపదు. మంచు సాంద్రముగా వ్యాపించుటయు నత్యున్నతముగానుండుటయు వృక్షాదులు చక్షుర్గోచరములుగాకుండుటయు, జలధారలు కనఁబడుచున్న నవి మంచుతెరలనడుమఁ బ్రవహించుట నదులుగాఁ గనఁబడకుండుటయుఁ గారణములుగా నాపర్వతము వ్యోమమే యని తోఁచును. ఈ పర్వతమునుజూడుమని శ్యామసుందర మూర్తి తెలుపుట నించుక పరిశీలింపఁగల్గించుచుండెను. కొంత సేపటి కది పర్వతమని తోఁచెను. నడుమ నించుక సన్నము మాటినజాడ కనఁబడఁగా నందు వృక్షములుగలవనియు మదికిఁ దట్టెను. జలజలమని పాఱుజలధారలు తుహినశైల మను నూహను గల్గించెను. వెఱ్ఱివానివలెఁ గాంచుచుంటిని. నావిభ్రాంతి నెఱింగికాఁబోలు శ్యామసుందరచక్రవర్తి వత్సా! యని సంబోధించి-యిట్లు పలికెను.

విభ్రాంతి నొందకుము. ఇదియు హిమాలయభాగమే. ఇదొకశిఖరము. ఈభాగమును మానవులు శ్వేతగిరి యందురు. పెద్ద లీనామము నొసఁగిరి. దానినే మానవులు వాడుచుందురు. ధవళగిరి యనియుఁ గొందఱందురు. కాని

యివొకశిఖరము. ఉన్నతము విశాలమునగుటఁబర్వతమందురు. దీనివాస్తవనామము కొందఱు మహర్షులకుఁ దెలియును. పుణ్య శిఖరమని యెఱుంగుము. ఈశిఖరమున నపుడపుడు శంకరుఁ డుమాదేవింగూడి ప్రమథులు సేవింప నుండును. ఆసమయ మున మహర్షు లాపరమేశ్వరుం దర్శింప నరుగుదెంచి కృత కృత్యులై యనేకవిషయముల నాశంకరుఁడు తెలుపవినుచుందురు. ఇంవొకచోట నొకవటవృక్షము గలదు. దానిమూలముననే మహాదేవుఁడు కూరుచుండును. కావున నందలిపాషాణములు శంకరపాదపంకజచిహ్నితము లగుటఁ బరమపావనము లని భావించి సర్వకాలము తద్దర్శనముచేసిపోవుట మునుల కలవాటు. ఈపర్వత శిఖరమున నింకొకవిచిత్రము కనుపట్టును. ఒక్కసారి కనంబడిన పావనస్థల మింకొకపర్యాయ మగపడదు. ఋషుల కిది నివాస స్థలము. ఇందుండు వా రాధివ్యాధిబాధితులు కారు. ద్వంద్వ ములు బాధింపఁజాలవు. మనుష్యుల కగమ్యములగుస్థలములు పెక్కులు గలవు. ఇందలిసత్వములు విచిత్ర వృత్తిగలవి. వాని నన్నింటిని దెలుప వలనుపడదు. ఈశిఖరంపుటున్నతి సార్ధక్రోశ ద్వయాధికమని యెఱుంగుము. ఒక్కయాశ్రమమును గనుఁ గొందువు. దానింగాంచినపుడు భయమందఁ గలవు. కాని నామాటను నమ్మి నిశ్చయముగాఁ బ్రవేశింపుము. నీకుం గనఁ బడకయుండ నేనును వెంబడింతును. అందుండుజంతువు లెవ్వరికి నపకారము చేయవు. సామాన్యులకుఁ గ్రూరమృగములుగాఁ గనఁబడునుగాని జంతువులుమాత్రము కావు. మును లట్టియా కారములఁ గనఁబడుదురు. సామాన్యులు చెంతఁ జేరకుండు టయే యావేషములకు ఫలము. కావున నీ వా యాశ్రమ

మును బ్రవేశించునపుడు భీతినొందక వేవేగ యఱుగుము. నా యానతినిన్నే క్రూరమృగమైనను జెంతకు రావెఱచును. విశ్వాసము నామాటయందుఁగలదా? అన్నంతన చేతులొగ్గి స్వామీ! క్రూర మృగము లన్నంతన గుండె చెదరుచున్నది. నాదృష్టికి శునకము కూడఁ గ్రూరమృగమే. దానిచూపునకే నామది కంపించుచుండును. కావున నట్టియిక్కట్టునకు నన్ను గుఱిచేయక కాపాడుఁడు. మీ పాదముల నాశ్రయించితిని. వేఱొకరిజోలి నాకేల? శాంతధను లగుమునులఁ జూడఁగోరెదను. అని ప్రార్థించుచు దీనత్వము మోమునం దోఁప నున్న నన్నుంగాంచి చిఱునవ్వు మాటల యందుఁ గలసియుండ నాబాలరూపుఁ డిట్లు పల్కెను.

బాలకా! మాఱుమాటలాడకుము. నాయానతి శిరసావ హింపుము. నేను నీ చెంత గనఁబడుచుందును నావెంటవచ్చు చుండుము. ఇతరులు నన్నుం గాంచఁజాలరు. కాని నీపార్శ్వ మున నున్న యట్లు నీవు కనుఁగొందువు ఇఁకనైన భయంపడవు కదా? అనఁగనే నామోము కలకలలాడెను. అట్లైన సింహవ్యాఘ్ర సమూహాంతకమునఁ బోఁగలనని యంటిని. అంతలో నాశిఖరము నెక్కుచున్నయట్లు మదికిఁ దట్టెను. వడివడిగ నరుగుచుంటిమి. ఆమంచు పాషాణమువలెఁ గఠినమైయుండెను. కాని దానిపై నెట్లు పాదము లుంచి శీతబాధనొందక యుండ నుంటిమో నేను జెప్పఁజాలను. ముహూర్తమాత్రమున నత్యున్నతశిఖరోపాంత భాగమును జేరఁగల్గితిమి. ఆచోట వానరములు పలువిధములగు రంగులఁ గనఁబడియెను. కొన్నింటికి మోము లెఱ్ఱగనుండెను. కొన్నింటి వెనుకభాగము లెఱ్ఱ రంగుగలిగియుండెను. మఱి

కొన్నింటిముఖములు నల్ల రంగుగలిగియుండెను. దంతములు జీల
కఱ్ఱపోఁచలవలె సన్నగనుండి తెల్లగనుండెను. బూడిదరంగు
గల కోఁతులు కొన్ని కనఁబడియెను. వానిం జూచినంతన
యొడలు కంపించుననుట నిక్కము. కాని యవి శాంతమూని
యొండొంటితో నాడుకొనుచుఁ గిలకిలారావములు చేయు
చుండెను. నావైపు కన్నెత్తియైనఁ జూడకుండెను.

మఱొకవంక మునిపక్షు లనఁబడు గబ్బిలములు కనఁబడి
యెను. వృక్షశాఖలనుండి తుహినజలబిందువులు స్రవించు
చుండిన నవ్వాని వదలక తలక్రిందుగా వ్రేలాడుచు నిశ్శబ్దముగ
నుండెను. వానింజూడఁగనేతలక్రిందుగా వ్రేలాడుచుఁ దపస్సొన
రించిన శీఘ్రకాలమున ఫలించుననియు, శీతవాతాదులు బాధింపఁ
జాలవనియు నాకుఁ దోఁచెను. అది నిజమౌనో కాదోయెవ్వ
రెఱుంగుదురు. దివానిశము లవి యట్లే యుండునో క్షుత్తు
తోఁచినప్పుడు సంచారముచేయునో యందలియాచారమెట్టిదో
యెఱుంగఁజాలను. ఆగబ్బిలములు నేనంతకుముందుఁజూచినట్టివి
కాక పెద్దకొంగలంతవిగ నుండెను. వర్ణము నీలము. నీలరక్త
ముగ నుండెను. తలయెత్తి వానిం గనుంగొనఁగా నవియున్నత
భూరుహశాఖల నాశ్రయించి వ్రేలాడుచుండుట చిన్నవిగాఁ
గనఁబడి యచ్చెరువు గల్గించెనుగాని సమీపమందున్న నింక
నెంతపెద్దవిగాఁ గనఁబడునో యెఱుంగఁజాలను. మఱొక
ప్రక్కన మార్జాలములు పెక్కుతెఱంగులఁ జూపట్టెను. వాని
వర్ణములు విచిత్రములు. నేనెన్నఁడును జూడక వినక యుండు
నట్టివర్ణములు కలవి. సాధారణముగా వేటకుక్కలంతవి.
పొడువుగాఁ గొన్నియుఁ, బొట్టివిగాఁ గొన్నియు నుండెను.

అందుఁ గొన్ని వృక్షముల పెనుఁగొమ్మలపైఁ గూరుచుండియుం
డెను. కొన్ని పాషాణములపై నుండెను. కొమ్మలపైఁ బిల్లలతోఁ
బిల్లులుండుట యప్పుడే నేఁ గాంచితిని. ఆకొమ్మలయందే యవి
నివసించునట్లు నాయూహ. ఎఱ్ఱపిల్లులు చాలఁ బెద్దవి. వాని
చూపులు భయముగొలుపును. నల్లపిల్లులు చూడఁజూడ వేడు
కగా నుండెను. వానిం జూడఁగనే,

శ్లో. అరణిం కృష్ణమార్జారం చందనం సుమణిం ఘృతమ్,
తిలాన్ కృష్ణాజినం ఛాగం గృహే చైతాని రక్షయేత్.

అను పరాశరస్మృతిశ్లోకము స్మృతిగోచరమయ్యెను. ఒక్క-
దానిం గొనిపోయి పెంచిన బాగుగానుండుననియుఁ దోఁచెను.
దానిబొచ్చు పొడవుగనుండెను. మంచుగురియుతావుల నట్లుండ
వలయునని భగవదిచ్ఛయేమో! చలిబాధ నాపుకొనుట కది
వానికి సాయపడవలయుఁగదా. మచ్చలపిల్లులు మిగులఁ జిన్నవి.
కాని దృఢతమములు. గున్నయేనుఁగునుం బోలియుండెను.
పొడవు విశేషించి లేక లావుగలిగి క్రొవ్వినట్లుండెను. వానింగని
నపుడు నాయొడలు కంపించెను. ఇట్టి వనేకవిధములు గలవు.
వానినన్నింటిని బేర్కొనఁజాలను.

కొలఁదిగ నున్నతివిశేషముగలుగు తావున నొకబిలము
గనంబడియెను. శ్యామసుందరుఁడు పార్శ్వమునందుంటంబట్టి
యేశంకలు లేక యందుఁ బ్రవేశింప సాహసించితి. ఇతరుల
కగపడునో లేదో యెఱుంగఁగాని నా ప్రక్కన నడచుచు నన్ను
భీతిల్లవలదని హెచ్చరించుచు నడువుమని త్వరపెట్టుచుండెను.
నిమ్నోన్నతములుగఁ దోఁచినయాభాగమున నంధకారముగ

నుండుచోట వడివడిం జనంజాలక భీతిల్లుచునే యడుగులిడు
చుంటినిగాని ధైర్యమూనఁజాలనైతిని. మహాపురుషుఁడు చెంత
నుండఁగనే యిట్టులైతిని! ఇఁక నొంటరిగాఁ బోవఁగలనా. ఎట్లో
నడచుచుంటిని. అంతలో నాకాలి క్రింద నొక బృహద్దారుశాఖ
యుండినట్లయ్యె. రెండవకాలు తగ్గున నుండెను. శ్యామసుందర
మూర్తి పక్కుననవ్వెను. నాయొడలు జల్లుమనియెను. వడఁకు
తోఁచెను. నోటమాటవెడలదయ్యెను. ఏమో చెప్పఁబోయితిని.
నీటిలో మునిఁగినవాఁడు పిలిచినశబ్దము దరినున్నవారికి వినఁబడ
నట్టులయ్యెను. ప్రయత్నించి మహాపురుషా! యనఁబూనితిని.
కాని యొక్కయక్షర మేనియు వినఁబడఁజేయఁజాలకపోయితిని.
మహాపాయస్థితి నున్నవాఁడనని చెప్పనూహ నాకుఁదోఁచెను.
ఏమిలాభము? ఒడలంతయుఁ జెమ్మటచేఁ దడిసిపోయెను. మృత్యు
వాసన్నమగుతఱిఁ గలుగుచిహ్నములు తోఁచెను. తుదకు
మాటాడఁజాలక కన్నీరు వదలితి. పకపకనవ్వుచు నాయార్త
త్రాణపరాయణుఁడు వీఁపునఁ జేయిపెట్టి తట్టుచు వత్సా! భయ
పడితివా. మొదలనే చెప్పితినే. ఏల యిట్టిదురవస్థకుఁ బాలైతివి?
ఇదె చూడుమని నిన్ను మ్రింగ నోరు తెఱచుకొని శిరస్సు
నెత్తి నాప్రక్కకు వంచు నాఁకొండచిలువ తలపైఁ దనపాదము
నిడి త్రొక్కెను. అదియొకనిట్టూర్పువదలెను. ఆధ్వని పదియోజ
నముల దనుక వ్యాపించి యుండకుండునా? యని యే నాయూహ.
అంతలో నామహానుభావుఁడు హుంకరించి రెండవప్రక్క
నుండి యెత్తినతోఁకను గాలం ద్రొక్కెను. అప్పటియాపరమ
పురుషునిపాదములయంతరము రమారమి యిరువదిబాహువు
లంత యుండు ననుట యతిశయోక్తికాదు. ముందడుగిడుము.

భీతివదలుము. అన నవ్వాల నెట్లో యడుగిడఁబోయి బోరగిలఁ బడితిని. ఒకబాహువంత యెత్తునుండి యడుగుపెట్టఁబూనుట యవివేకము కాదా? అంతలో నాబాలమూర్తి లేవనెత్తి యెత్తుకొనిపోయెనేమో కాని నా కాభీతి యించుక తొలఁగు నంతలో వెలుతురు కనఁబడియెను.

స్వామీ! ఏజంతువు బాధింపదంటివికదా. క్షణ మూరకుండిన మ్రింగియుండదా యని కన్నీరు వదలుచుఁ బలికితిని. మ్రింగునా యని నవ్వెను. పిల్లికిఁ జెలలాటము నెలుకకుఁ బ్రాణసంకట మన్న ట్లున్నదంటిని. ఇంచుకయుఁ గోప మూనక యాకరుణానిధి వత్సా! నీమది నిలుకడఁ గాంచ నెంచి యూరకుంటిని. లేకున్న దానిం గానరాకుండఁ జేసియుండనా యనియె. ఏమియుఁ బలుకలేక నమస్కరించితిని. దరహాసభాసురముఖసరసిజుండై యాపుండరీకాక్షుఁడు ముందైన భయంపడకుమని హెచ్చరించెను. స్వామీ! భయంపడకయుండఁజేయుభారము నీయదియే యంటిని.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అన్న ప్రతిజ్ఞనే నమ్మితినంటిని. సత్యము సత్యము అను మాట లెందుండియో వినవచ్చెను. నాల్గుదిక్కులు కలయం జూచితిని. ఎవ్వరును గానరారైరి. బాలమూర్తి మాటలాడినట్టులుగాక దూరమునుండి వినవచ్చుజాడ కనఁబడెను. విచిత్రవృత్తాంత మిది భగవన్మాయయే యని తలంచితిని.

అంత నాశ్యామసుందరమూర్తి వత్సా! ముం దాశ్రమము గలదు. నే నితరాదృశ్యుఁడనై యుందునని ముందే తెల్పి

గదా. కొలఁదిదూరమునఁ గ్రూరమృగములు కనంబడు. వానిం గాంచి బెగడకుము. నేను వానిని దాఁటిపోవుదనుక నీచెంతనే యుందును. అవి మృగములు కావు. మహర్షులు ఆరూపముల నితరులకుం గనంబడుదురు. ఇంచుకంతయు సంశయింపక పోవుచునే యుండుము. అని పలుక స్వామీ! అవి కనఁబడఁగనే నాచిత్తము భయరహితముగ నుండునో లేదో చెప్పఁజాలను. అవి కనఁబడకుండఁజేయుము. కనఁబడక తప్పనిచో భయము లేకుండఁజేయుము. నాశక్తిని బరిశీలింపకుము. నే నుత్తరకుమారునకంటె ధీరుఁడను. నన్నుఁ బరీక్షింపవలయునా? నాశక్తి తమ రెఱుంగనిదియా? యని చేతులొగ్గి ప్రార్థింప నాపరంధాముఁడు నవ్వెను. బదులిడక నడుచుచుండు మనెను. అంతట నూరక యుండక యింతకుముందాశ్రమమునకు నడువకయుండఁగనే చేర్చుచుంటిరికదా. ఇపు డేమి గ్రహచారము నాకుఁ జాలదని నడిపించి భయపెట్టుచున్నవారో యెఱుంగనంటిని. ఆమాటకుమాత్రము బదు లీయఁబూని కాంబోలు వత్సా! యని పిలిచి ఋూమునుల దర్శించినఁగాని లాభము లేదు. వారెల్లఁ దమ భయంకరాకృతుల మాని నిన్నుఁ గరుణం జూతురు. కావుననే నడిపించుచున్నాఁడనని పలుకుచు నడచుచుండెను. తద్దర్శనము చేయుచునే యరుగుచుంటిని.

కొన్ని యడుగులు పెట్టితిమి. కుడిప్రక్క నొక లతామండప మగపడియె. ఊరకుండక దానిని దాఁకితిని. లోపలనుండి రివ్వున బాణవేగమున నొక వ్యాఘ్రము వచ్చెను. అబ్బా! దాని వేగము, నాదము చెప్పనలవిగాదు. దంష్ట్రాకరాళవక్త్రము తెఱచుకొని నాపైకి రాసాగెను. నిక్కము చెప్పఁజాలనుగాని

మీఁది ప్రాణములు మీఁదనే పోయినవి. ప్రపంచము నాకు గోచరింపలేదు. ఆశ్రమముగాని తుదకు శ్యామసుందర మూర్తిగాని కనఁబడలేదు. మూర్ఛపడియుండఁగా నెవరో వీఁపు నిమిరినట్లు తోఁచెను. మఱొకక్షణమునకు నేనుండ నీకేమి భయ మనుమాట చెవిలోఁ జెప్పినట్లుండెను. ఎంతకాల మట్లుం టినో చెప్పఁజాలను. కన్నులు తెఱచితిని. శ్యామసుందరమూర్తి నాకు స్పష్టముగా మందహాసము ముఖారవిందము నలంకరింపఁ గనఁబడియె. ఇట్టి గతికిఁ బాల్పఱచితివి స్వామీ! యని విల పించితిని. కుమారా! మున్నే చెప్పితినిగదా. మునిసత్తముఁడు కాని వ్యాఘ్రము కాదు. ఇంచుక పరిశీలింపుము. అనునంతలో మంత్రించినట్లు మునివరుఁడుగఁ దోఁచెను. ఆజానుబాహువు. శ్రవణమూలలంబమానజపమాలికాజాలుఁడు. కృపాతరంగితాంతః కరణుఁడు. ఆమహర్షి నన్నుం గాంచి నవ్వి యేల యిట కరుదెంచితివని ప్రశ్నించెను. మహాత్ముల దర్శింప నరుదెంచితిని. నాపూర్వపుణ్యవిశేషమున మిముం గంటి నంటిని. మనుష్యుల కగమ్య మీచోటు. ఎట్లు కనుఁగొంటివనఁ బరమేశ్వరానుగ్రహ మున నని బదులిచ్చితి. నవ్వుచు నింక ముందు ఘోరరూపులుగా నుండు మునులు గనఁబడుదురు. నీవు భయంపడక మానవు. ఈమూలికం గొని చనుము. సౌమ్యరూపములఁ గనఁబడుదు రని యొకమూలిక నిచ్చెను. దానిని భక్తిమెయిఁ బరిగ్ర హించి నమస్కరించి పావనమూర్తీ! తమనామధేయము వినఁ గుతూహల ముదయించెడిని. ఈకోరికం దీర్పుమా యని వేఁడితి. అట్టికోరికకలదా. నన్ను వ్యాఘ్రపాదుఁ డందురు. అనఁగా నీయాశ్రమ మెవ్వరిదని ప్రశ్నించితిని. ఇది విశ్వామిత్రు నాశ్ర

మము. పూర్వ మీచోట దక్షిణామూ_ర్తి యనుపేరు దాల్చి శంకరుఁడు తపమొనరించెను. ఇపుడు మే మెల్ల నిందున్నవా రము. విశ్వామిత్రుఁ డిందు నియతిమైనున్నవాఁడు. ముందరుగు మని కనఁబడకపోయెను. అత్తఱి శ్యామసుందరమూ_ర్తి పొడ కట్టెను. కంటివికదా మహాత్ముని! ఇంక సంశయ ముడిగి భీతి వాసి పొమ్ము. వలసినతఱి నన్ను స్మరింపుము. మ్రోలనుండెవనని యదృశ్యుఁడయ్యెను. ముందు నడువసాగితి. నాసంశయము లెక్కింప నాయాదిశేషుఁడును సమర్థుఁడుకాఁడు. అట్లే పోవఁగా నొక్కచో వివిధమృగములు కనఁబడియెను. క్షణమాత్రమున నారూపములు కూడ మునిరూపములుగఁ దోఁచెను. కాని వారు నాతో మాటలాడక నియతిమైనుండిరి. వారున్నతావు మీఱి కొన్ని బాహువులదూర మరిగితిని.

## విశ్వామిత్రు నాశ్రమము

అందొక రమ్యపర్ణశాల కనంబడియె. పర్ణముల నాచ్ఛా దింపఁ బడినదియేకాని దానినిండ లతావిశేషము లల్లిబిల్లిగ నల్లుకొనియుండెను. కావున నది లతాగృహమే యనందగి యుండెను. దానియందము వర్ణింపఁదగినదియే. లతలనిండఁ బుష్పములు పఱచినట్లుండెను. భృంగము లందందుఁ దిరుగు చుండెను. నానావర్ణప్రసూనము లందుఁ గనంబడియెను. ఫల ములు మాత్రము వానియందుఁ గానరాలేదు. ద్రాక్షాఫలము లుండినఁ దిని చూతమనియే నాయూహ కాని కానరాకుండుట వానిలోపమేగాని నాయపరాధముగాదు. వానింజూచుచు నిలుచుంటిని. ఒకవటువు తాటియాకులపు_స్తకమును జేఁదాల్చి వచ్చి రమ్మురమ్మని పిలుచుకొనిపోయెను. ఆబాలకుమోమున

శాంతరసము నటించుచున్నట్లుండెను. బ్రహ్మతేజస్సు వెలుఁగు
చుండెను. కడుంగడుం జిన్నవాఁడు. పదియేం డ్లుండు నని
నాయూహ. ఎవ్వరిందుండువారని ప్రశ్నించితిని. ఇంతకుముందే
తెలిసికొంటివికదా. మరల నేల ప్రశ్నింతువు? వా రసత్యము
పలుకువా రనుకొంటివా ? యని నవ్వెను. ఆసంగతి నీబాలుఁ
డెట్లెఱింగియుండు ననుసంశయము తోఁచెను. మది నిలువ
నందున మునివర్యా! నీ కెట్లు తెలిసినది? దయయుంచి తెలుపుమా
యని బతిమాలితిని. యోగమహిమమున అనియె. మీరేమి
చదువుచున్నవారను నాప్రశ్నమునకు వేదములనని బదులు
వచ్చెను. యోగశాస్త్రపాఠమైనదా యనియుఁ బ్రశ్నించితిని.
యోగశాస్త్రపాఠమా! క్రొత్తమాటవింటినని యతఁడు నవ్వెను.
యోగశాస్త్రపాఠ మన నచ్చెరు వేలయని యడిగితిని. యోగా
భ్యాస మనవలయు ననియె. మాదేశమున యోగోపన్యాసము
లిచ్చుచుందురు. కావున నడిగితి నంటిని. ఆర్యా! యోగము
నభ్యసించువా రుపన్యసింపఁజాలరు. దానివిధ మెఱుంగుట సుల
భము. దాని నభ్యసించుటకే చిరకాలముపట్టును. ఉపన్యాసము
లిచ్చువారు యోగులని మీ రెఱుంగుదురా యనఁగా వారి
యుపన్యాసములనుమాత్రము వింటిని. చక్కఁగా మాటలాడు
దురు. లోకులను మెప్పింతురు. అను నామాటలకు వారికి
యోగసిద్ధియైనదని మీకుఁ దెలియు టెట్లని వటుమహాశయుఁడు
ప్రశించెను. వారికి సిద్ధియైనదో లేదో మీ కెట్లు తెలియ శక్య
మగును? అంటిని. ఖేచరులుగా వారరుగుదురా యనియె. నా
కపు డాశ్చర్య మొదవ, మీరన్నదాని కర్థమే మంటిని. వియ
ద్వీథింబోవు శక్తిగలదా యని దానియర్థమనియె. ధూమశకట

మునసే వారు పోవుదురు. మే మెఱింగినంతదనుక నట్టివారు దయచేయఁగా గమనాగమనములకు వ్యయమునకై ద్రవ్య మిచ్చుటయుఁ గలదంటిని. పక్కన నవ్వి, యట్టివారికి యోగ సూత్రములమాటలు మాత్రమే తెలియునుగాని తదనుభవ ముండదు. వారితత్త్వమెఱుంగక యందఱు మోసపోవుదురు. వా రెవ్వరికైన యోగము నభ్యసించునట్టిపద్ధతుల నేర్పినారా యన నాపాపమునకు వారొడిగట్టలేదని పల్కితిని.

ఆపటువంతట మఱేమియు మాటలాడక నన్నాయాశ్రమములోనికిం దీసికొనిపోయి యొక్కచో వ్యాఘ్రాసనమున నాసీనుఁడై జపించు మునివరుం జూపి సమాధి చాలించు సమయము వఱకు నిందే యుండుమని తన వలయు తావున కరిగెను. నేను గూరుచుండక నిలిచియే యుంటిని. అత్తఱి శ్యామసుందరుని యాకృతి నాకగపడకుండెను. కాని కన్నులఁ గట్టిన ట్లున్నతదాకారమును గనుచున్నట్లే యుండెను. నాతో మాటలాడుచున్నట్లే యుండెను. ముహూర్తమాత్ర మట్లు నిలిచియుండఁగా నాముని మెల్లన శ్వాసము విడిచెను. సమాధిఁ జాలించు సమయ మిదే కాఁబోలు నని తలంచుచు నేమిమాటలాడవలయునో యని సంశయించుచు వేచియుంటిని. మఱొకక్షణకాలమునకు నేత్రముల నించుక విప్పినజాడ కనఁబడియెను. దేహమును సవరించుకొని నమస్కరింప సిద్ధపడితిని. నిట్టూర్పు వదలి కన్నులఁ దెఱచెను. జపమాల చెవియందే వ్రేలాడుచుండెను. జపమాలిక చేతఁబూనక యేమిచేయుచున్నారో యనుశంక కలిగెను. ఇంతలో నాముని యాచమించెను. నావైపు దృష్టిని వ్యాపింపఁజేసెను. గోత్రమును నామము నుచ్చరించి నమస్క

రించితి. దీక్షానామమునే యుచ్చరించితిని. లేవగనే సంజ్ఞచేఁ గూరుచుండ నియోగించెను. పాదతలములను వస్త్రమున నాచ్ఛాదించియే కూరుచుంటిని. దోసిలొగ్గియే యుంటిని. ఏల వచ్చితివని వారు ప్రశ్నించిరి. యుష్మత్పాదదర్శనార్థమని బదులిడితి. ముసిముసి నవ్వులతో నీరాక నెఱుంగుదును. అశక్యకార్యమునకుం బూనితివి. భగవత్కారుణకుం బాత్ర మీకాలము కాదు. కొంత కాలము జరిగిన నది వచ్చుననియె. మహాత్మా! నాకర్థము కాలేదు. మూఢుఁడ నగునాకు వివరించి చెప్పుమా యని వేడితిని. హాసము పలుకులం గలిసియుండ నిట్లనియె.

భగవత్సాహాయ్యము గలకాలములు కృతత్రేతాద్వాపరము లనఁబడును. ధర్మమునకు హాని వాటిల్లుకాలము కలియుగ మనంబడును. ఇది కలికాలము కావున భగవత్కారుణకుఁ బాత్రమగుకాల మిదికాదు. భగవంతుని యనుగ్రహము చాల స్వల్పముగ నుండును. ధర్మము నామమాత్రముగ నుండును. వర్ణాశ్రమముల యాచారములు వాఙ్మాత్రములుగ నుండును. ఆచరణమునకంటె విరుద్ధముగ వాక్కులుండును. ఇది కలికాల స్వభావము అనుటయు మరలఁ బ్రశ్నింప నేమియుఁ దోఁప నందునఁ జేతులు జోడించి స్వామీ! తమనామధేయ మెఱుంగఁ గోరుచున్నాఁడ నంటిని. వారు మౌన మూనియుండిరి కాని ముఖమునఁ గ్రోధచిహ్నము లేవియుఁ గనఁబడకయుండెను. ఇంతలో నొకముని యరుదెంచి వత్సా! శ్రీరామావతారమునకు నాధారభూతుఁడై మూఁడులోకములఁ దనతపశ్శక్తి వణఁకునట్లు జేసి బ్రహ్మర్షిత్వమందిన విశ్వామిత్రమహర్షి యని యెఱుంగుమనియె. ఆమాటలు విన్నయంతనే నాయానందమునకుఁ బరి

మితిలేకుండెను. పులకాంచితసర్వాంగుఁడ నైతిని. మరల నమస్కరించి నేఁటికి నాజన్మము పవిత్రమయ్యెను. ధన్యతముఁడ నైతిని. నామనోరథములు ఫలించెను. ఆశ్రితకల్పవృక్షము లనందగుమిమ్ము దర్శింపనోచితిని. రామాయణమును సమగ్రముగాఁ బఠించితి. చాలశ్రమించి తెనిఁగించితిని. చాలపురాణములఁ బఠించితి. భవన్మహిమ మపారము. త్రిశంకుచరిత్రమున మీయఖండతపోమహిమము నుతింప శక్యమగునా. ఇతరుల కట్టిమహత్త్వముకలదా. వసిష్ఠునిచేతనే బ్రహ్మర్షివైతి వని యని పించినమహానుభావుఁడవు. నిరుపమానతపోరాశివి. ధన్యులనుగా నాశ్రితుల నొనరించుకరుణాళుండవు. భవన్మహిమము నెఱుంగ నాతరంబె. అని ప్రార్థించితిని.

మౌనముూని కొన్నినిమేషములుండి వత్సా! సీతాకల్యాణానంతరమే నాపని నిర్వర్తించితినని భారతభూమినివదలి యిట కరుదెంచితిని. తపస్సుచేయుచున్నవాఁడ. నీ విందున్న మమ్మెఱుంగుట భగవత్కరుణచేతనే. ద్వాపరయుగంబున నొక్కపర్యాయ ముద్ధవునిజూడ నరుదెంచితిమి. ద్వారకానగర సమీపమున రైవతాద్రియందు వేంచేసియున్నగోపాలబాలుని దర్శించి యుద్ధవునిం గలిసికొని కొన్నిదినములుండి మరలి వచ్చితిమి. కలియుగాంతమున మరల రాఁగల్గుదుము. వినఁగోరు విషయ మున్నఁ దెల్పుము. అనుటయు స్వామీ! యోగవిద్య భారతభూమి నెలకొనియుండెనని పెద్దలందురు. ఇపు డాయోగవిద్య యుపన్యాసములయం దూఁగులాడుచున్నది. అది నశింపకయుండుమార్గ మెయ్యది; దానివివరింపవే యని యభ్యర్థించితిని. ఈనాప్రశ్నమున కామునిచంద్రుఁడు కాంచినయానంద

మహారము. ధ్యాన మూనియుండి యిట్లు పలికెను. భారత
భూమి యోగవిద్య నశింపదు. కాశ్యుత్తరప్రదేశముల నది
పాదుకొనియుండు. దాని నభ్యసించువా రుందురు. వారి
ప్రఖ్యాతి యంతట నల్లుకొనదు కాని వారు శిష్యుల కుపదే
శించి బీజనాశము గాకుండఁజేయుదురు. ఇది మన నిల్వను.
యోగవిద్య నభ్యసించువారు లోకులకుం దమప్రయత్న
మును జాటరు. కీర్తింగోరువా రభ్యసింతురు. వారి కది తెలియ
దని యెఱుంగుము. అభ్యాసమున లేనియోగవిద్య నుపదేశము
నీయఁజాలదు. కలికాలము గావునఁ గుటుంబభరులై కొందఱును,
విఖ్యాతిం గోరి కొందఱును పాతంజలయోగసూత్రాలఁ బఠించి
దాని నెల్లరకుం దెల్పుచుఁ బండితులమని విఱ్ఱవీఁగుచుందురు.
శిష్యులకు నేర్పఁజాలరు. సూత్రముల కర్థము చెప్పుట కిందఱు
సమర్థులే యగుదురు. దాని నభ్యసించి యభ్యసింపఁజేసి దాని
వెలయించువా రరుదు. అట్టివారుండినను వారి నెవ్వరు గౌర
వింపరు. అదియే మంచిదని వారు భావింతురు. కొన్ని విషయ
ములఁ దెల్పెదము. ఆలకింపుము.

యోగమనునది మనశ్శక్తిని దృఢపఱచును. మనస్సతి
చంచలము. దానికన్న విద్యుల్లత స్థిరమని నమ్మవచ్చును. ఏప్రయ
త్నమున నది నిలుకడం గాంచదు. యోగసాధనమువలనే యది
నిలుకడం గాంచవలయును. అదియు బహుజన్మముల నభ్య
సించినఁగాని కలుగదు. సర్వభూతదయాపరుఁ డగువానికే
దానియం దభిరుచికల్గును. వానిదృష్టి స్వార్థపరత నొందరాదు.
తనమనశ్శక్తి యెల్లర కుపయోగించునదిగా నుండవలయునని
యాతఁడు సంకల్పించును. తనకనికాని మఱికొందఱకనికాని

వానిభావ ముండదు. సర్వభూతక్షేమమును గోరుచు నాతఁ
డద్దాని నభ్యసించును. అప్పుడే యది వానికి ఫలించును. కామ
క్రోధాదులు తమంతన తొలఁగిపోవును. భగవత్సాన్నిధ్యమున
నవి యుండఁజాలవుకదా. జనసంగము మాని యతఁడు తన
పట్టువల మానక యోగము నభ్యసించును. దానిదృష్టికిఁ
త్రిలోకములు స్పష్టములుగాఁ దోఁచును. అంతటి యభ్యాసము
కలిగినఁగాని మనస్సు నివాతదీపమువలెఁ గనఁబడదు. కొందఱు
యోగసిద్ధులంబొందుదురు. వారున్నతసోపానము నెక్కఁ
జాలరు. యోగసిద్ధులుగల్గుట ప్రథమసోపానము నెక్కినవానికే.
అప్పుడు ఫలాపేక్ష లేదేని యతఁడు యోగి యనంబడును.
ఎన్నియో యంతరాయములు పొసఁగును. ఎందఱో విఘ్న
ములఁ గల్పింతురు. అన్నింటిని గడచినఁగాని కృతకృత్యుఁడు
కాఁజాలఁడు. కావున నీ కిష్టముకలదేని దానికిం బ్రయత్నిం
పుము. అనిపలికి కన్నులుమూసికొని క్షణమాత్రముండి కన్నులు
తెఱచి వత్సా! ఈజన్మమున నీ కది ఫలింపదు. ప్రయత్నము
చేయుచున్నాఁడవుకాని యింకొకజన్మము దానికి వలయును.
ఇపు డుపాసించుదేవత నీయందు దయగలిగియున్నది. తదను
గ్రహముననే నీకు నుపాసించుపద్ధతులు సులభములుగ నున్నవి
తోఁచినవి. మంత్రము పలుసారులు జపించుట చాలదని నీవు
సిద్ధాంతము చేసికొని తొమ్మిదివత్సరము లైనదికదా. జపకాల
మునఁ జిత్త మిష్టదేవతాపాదారవిందములయందే నిలుకడఁ
గాంచవలయునను నీనిశ్చితమే న్యాయ్యము. అది యితరులు
నీకుం దెల్పలేదు. నీయంతన దాని నెఱింగితివి. అదియే యిష్ట
దేవతాకరుణాఫలమని నమ్ముము. ఇంక నియమములు పాటింప

వలదు. అది ప్రథమసోపానమువంటిది. తొలుదొలుత నియమ
ములఁ బాటింపవలయు. మనస్సు నిలుకడగాంచ నది యొక
యుపాయమగును. ఉపాసకుఁడు క్రమముగాఁ దొలుత నను
ష్ఠింపఁదగునియమముల వదలుచు వానియం దే సారమో
దానినే యభ్యసింపవలయును. అట్లుగాక మొదటినియమ
ములనే సర్వదా పూని యాచరించునేని వాఁడు ప్రథమసోపాన
మందే యుండును. వత్సా! చంచలాత్ములకొఱకుఁ బ్రధాన
ముగా యోగవిద్య చెప్పఁబడినది. తొలుదొలుతనే నిశ్చల
మనస్కులుగాఁ గొందఱుందురు. వారు పూర్వజన్మమున
యోగాభ్యాసముచేసినవారే యని నిశ్చయింపవలయును.
కొందఱు యోగము బూటకమందురు. వారి నిక్కముగా
నటకులు, మందబుద్ధులు, వంచకులు నగుదురు. వారి నమ్మి
మోసపోవరాదు. యోగము నభ్యసించినఁగాని స్థిరత్వమును
మనస్సు గాంచదు. అది కుదిరినఁగాని భగవత్కారుణ్యమునకు బాత్రుఁ
డెవ్వఁడును గాఁడు. ఆమీఁదఁగాని తరణోపాయము లేదు.
కావున జపమాలికను ద్రిప్పుచు నితరవిషయముల మనస్సును
వ్యాపింపఁజేసిన నించుకంతయు లాభము లేదు. నీ వట్లు చేయక
మానితివని యెఱుంగుదు. ఐన నదియే చాలదు. ఇంకను
బ్రయత్నింపుము. ఇష్టదేవతయే మంచిమార్గము తోఁచునట్లు
చేయును. ఇపు డీవిషయమున నీకుం దెలుపఁదగిన దింతయే.
యోగశాస్త్రపుస్తకములఁ జక్కఁగాఁ బరిశీలించుట బాధకారి
కాదు. అంతకంటెఁ దా నెఱింగినదాని నభ్యసించిన లాభమని
తలంపుము. ఇంక నేమి వినఁగోరెదవు?

అనునపుడు నాయొడలు నాయధీనమందు లేదు. పరవశ ముగ నుండెను. ఎట్లో ప్రయత్నించి యిట్లు ప్రశ్నించితిని. మహాత్మా! మీరాచరింపనినియమములు, మీరు పడనికష్టములు, మీరు పొందనిలాభములు లేవని నే నెఱుంగుదును. మీయుపదేశము సకలవేదవేదాంత శాస్త్రసారము. ఈయుపదేశైకభాగలవము గ్రహించి దాని ననుసరించిన ముక్తికరతలామలకము. మిమ్ము దర్శించితిని. ఒక్కసంశయము బాధించెడిని. పంచమజాతి మాంసాహారమును మానినంతన బ్రాహ్మణుఁ డగునని యిపుడు కొంద అనుచున్నవారు. సాధ్యమా? ఈప్రశ్నము నితరుల నడిగిన లాభములేదు. క్షత్రియజాతిజన్మించి బ్రహ్మర్షిపట్టమందిన మహానుభావులరు. కానమిమ్మే ప్రశ్నించెద. నాయీశంకం దీర్పుఁడీ యని వేడితి. నా వేఁడికోలు నంగీకరించి విశ్వామిత్రుఁ డి ట్లుప దేశించెను. బాలకా! లోక మిపుడు కలిమహత్త్వమున వ్యాకులమైనది. వర్ణాశ్రమధర్మములు మాఱును. నామమాత్ర ములుగ నుండును. స్మృతులను గల్పింతురు. ప్రాచీనస్మృతులు వ్యర్థములందురు. మన్మదాహరణముగఁ గైకొందురు. మే మక్లేల యుత్తమజాతికి రాఁగూడదందురు. ఈవిషయ మెఱిం గియే వ్యాసమహర్షి కలిధర్మములను గలికాలప్రవృత్తులను బురాణములయందు వివరించెను. దివ్యదృష్టి నెఱింగియే పురా ణములయందుఁ దెల్పిరి. వానినెల్ల నమ్మువారరుదుగ నుందురు. *అందుఁ గొన్నింటినిం దెల్పెద. ఆరీతి నిపుడున్నదో ప్రవృత్తి

---

కలివిచిత్రములు

కూర్మపురాణము. ౨౭. అధ్యాయము

శ్లో. అధార్మికా అనాచారా మహాకోపాల్పతేజసః, అనృతం బ్రువతే

వేఱువిధముగ నున్నదో నీవే యూహించుకొనుము. ఈపేర్కొ-
నంబడు పురాణేతిహాసములయం దతీంద్రియజ్ఞులు తెల్పినమహా
విషయములు గలవు. అవియెల్లఁ గలియుగమున సాగకమానవు.
క్రమక్రమముగా నివన్నియు ననుభవమునకు వచ్చును. ఇఁక
విచారించినలాభము లేదు. జఘన్యయుగమున జఘన్యాచారములు
సాగకుండమానునా. కావున వేదశాస్త్రములనమ్మువారు పరుషఁగ
నుండుకాల మిది యని యెఱుంగుము. ఇఁక నీచజాతిమానవుఁ
డుత్తమజాతికేల రాఁగూడదో యన్నప్రశ్నమునకు నుత్తరమును
వినుము. విప్రక్షత్రియజాతులకు రెండింటికి సమీపస్థితి కలదు.
అనఁగా యజ్ఞాదులయందేమి స్మార్తాచారములయందేమి మిక్కిలి

---

లుబ్ధాస్తిష్యే తామసజాః ప్రజాః. ౩. దురిష్టైర్దురధీతైశ్చ దురాచారైర్దు
రాగమైః, విప్రాణాం కర్మదోషైశ్చ ప్రజానాం జాయతే భయం. ౪. నాధీ
యంతే కలౌ వేదాన్న యజంతి ద్విజాతయః, యజన్త్యన్యాయతో దేవా
న్వృతం త్యేవాల్పబుద్ధయః. ౫. శూద్రాణామత్ర యోనౌ తు సంబంధో బ్రాహ్మ
ణైస్సహ, భవిష్యతి కలౌ తస్మిం శ్ఛయనాసనభోజనైః. ౬. నప్రామాణ్యం శ్రు
తేరస్తి నృణాం చాధర్మసేవనాత్, స్నానం దానం జపో హోమో దేవ
తానాం తథార్చనం. ౭. అన్యాని చైవ కర్మాణి న కుర్వంతి ద్విజాతయః,
వినిందంతి మహాదేవం బ్రహ్మాణం పురుషోత్తమమ్. ౯. స్వధర్మే హి రుచిర్నైవ
బ్రాహ్మణానాం కలౌ యుగే, కుశీలదర్పపాషండైర్వృథారూపైస్సమావృతః.
౧౧. బహుయాజనకో లోకో భవిష్యతి పరస్పరం, అట్టశూలా జనపదా శ్శివ
శూలాశ్చతుష్పథాః. ౧౨. ప్రమదాః కేశశూలిన్యో భవిష్యంతి కలౌ
యుగే, శుక్లదంతా జితాక్షాశ్చ ముండాః కాషాయవాసినః. ౧౩. శూద్ర
ధర్మం చరిష్యంతి యుగాంతే సముపస్థితే, సత్త్వబాధాః కరిష్యంతి బకవైడా
లవృత్తినః. ౧౪.

సాహచర్యము కలదు. తపస్సే రెండుజాతులకు సామాన్యధర్మము. ఉపనయనాదికాలము లించుక భేదముగా సమానముగనుండును. కావునఁ దపోబలమున క్షత్రియుఁడు విప్రుఁడు కానోపు. అట్లే క్షత్రియవైశ్యులకు సాహచర్యము కలదు. వైశ్యుఁడు తపోబలమున రాజర్షి కానోపు. శూద్రజాతికి వేదపఠనాదులు ఉక్తములు గావు. ఏలన వారియందు మునులకు దేవతలకుఁ గృప లేక కాదు. వారు చేయఁదగినపని వేఱు. ఆపనియందే వారికిఁ బుణ్యము నార్జించుపద్ధతులు చెప్పఁబడినవి. పౌండరీకాదిమహాక్రతువులు చేయు బ్రాహ్మణున కేఫలమో ఖలయజ్ఞము (కళ్లమున ధాన్యదానము యాచకులకుఁ జేయుట) నొనర్చిన శూద్రజాతి కాఫలము గల్గును. వేదపఠన మక్కఱలేకయే సర్వకర్మములు చేయునధికారము దానివలన సంపూర్ణఫలము వారికిం గల్గుననియు విధింపఁబడినది. కావున నొక్కజాతి

---

బ్రహ్మపురాణము. ౧౨౩ అధ్యాయము

అక్షత్రియాశ్చ రాజానో విప్రాశ్శూద్రోపజీవినః, శూద్రాశ్చ బ్రాహ్మణాచారా భవిష్యంతి యుగక్షయే. ౫. శ్రోత్రియాః కాండపృష్ఠాశ్చ నిష్కర్మాణి హ్యాపీంషి చ, ఏకపంక్త్యామశిష్యంతి యుగాంతే మునిసత్తమాః. ౬. అశిష్టవంతోఽర్థపరా నరా మద్యామిషప్రియాః, మిత్రభార్యాం భజిష్యంతి యుగాంతే పురుషాధమాః. ౭. రాజవృత్తిస్థితాశ్చోరా రాజానశ్చోరశీలినః, భృత్యాహ్యానిర్దిష్టభుజో భవిష్యంతి యుగక్షయే. ౮. ధనాని శ్లాఘనీయాని సతాం వృత్తమపూజితం. అకుత్సనాచ పతితే భవిష్యతి యుగక్షయే. ౯. అట్టశూలాజనపదాశ్శివశూలాశ్చతుష్పథాః, ప్రమదాః కేశశూలాశ్చ భవిష్యంతి యుగక్షయే. ౧౦. సర్వే బ్రహ్మవదిష్యంతి ద్విజా వాజసనేయికాః, శూద్రాభావాదినశ్చైవ బ్రాహ్మణాశ్చాన్త్యవాసినః ౧౨. శుక్ల

యింకొకజాతిగా మార్పునొందుట యశాస్త్రము. మే ముత్తమ జాతివార మేల కాఁగూడదని వాదించు టుత్తమపద్ధతి కాదు. జాతికిమాత్రమే మర్యాద లేదు. మనుష్యుని ప్రవ_ర్తనము ననుసరించి మర్యాద కలదు. కావున నితరజాతిని గోరుట తనజాతి న్యూనమని భావించియే కదా. అదిన్యాయము కాదు. తనజాతియందుండియే భగవత్కారుణకుఁ బాత్రుఁడు కావచ్చును. తనజాతియందు భగవంతునకు ద్వేషమని తలంచుట యుచితము

---

దంతా జితాక్షాశ్చ ముండాః కాషాయవాససః, శూద్రా ధర్మం వదిష్యంతి శాక్యబుద్ధ్యోపజీవినః. ౧౩. శ్వాపదప్రచురత్వం చ గవాం చైవ పరిక్షయః, సాధూనాం పరివృత్తిశ్చ విద్యాదంతగతే యుగే. ౧౪. అంత్యా మధ్యే నివ త్స్యంతి మధ్యాశ్చాంతనివాసినః, నిర్హ్రీకాశ్చ ప్రజాస్సర్వా నష్టాస్తత్ర యుగక్షయే. ౧౫. తపోయజ్ఞఫలానాంచ విక్రేతారో ద్విజోత్తమాః, ఋతవో విపరీతాశ్చ భవిష్యంతి యుగక్షయే. ౧౬. తథా ద్విహాయనా దమ్యాః కలాలాంగలధారిణః, చిత్రవర్షీ చ పర్జన్యో యుగే క్షీణే భవిష్యతి, ౧౭. సౌకుమార్యే తథా రూపే రత్నే చోపక్షయం గతే, భవిష్యంతి యుగస్యాంతే నార్యః కేశైరలంకృతాః. ౨౨. కుశీలా నార్యభూయిష్ఠా వృథారూపసమన్వితాః, పురుషాల్పం బహుస్త్రీకం తద్యుగాంతస్య లక్షణమ్. ౨౪. అఫలాని చ సస్యాని తరుణా వృద్ధశీలినః, అశీలాస్సుఖినో లోకే భవిష్యంతి యుగక్షయే. ౨౬. వర్షాసు పరుషా వాతా నీచాశ్శర్కరవర్షిణః. సందిగ్ధః పరలోకశ్చ భవిష్యంతి యుగక్షయే. ౨౭. అశాస్త్రవిహితో యజ్ఞ ఏవమేవ భవిష్యతి, అప్రమాణం కరిష్యంతి నరాః పండితమానినః ౩౧. శాస్త్రోక్తస్యాప్రవక్తారో భవిష్యంతి న సంశయః, సర్వస్సర్వం విజానాతి వృద్ధాననుపసేవ్య వై. ౩౨. నకశ్చిదకవిర్నామ యుగాంతే సముపస్థితే, నక్షత్రాణి వియోగాని వికర్మస్థాద్విజాతయః. ౩౩. భిక్షాం బలిమదత్వా చ

కాదు. భగవంతునకు సర్వజాతులయందు సమానప్రేమము కలదు. దానిని ద్రోసిపుచ్చుటొకయపరాధము. ప్రతిజాతికి భగవత్కారుణ్యను పడయగోరునధికారము కలదు. మనస్సు పరిశుద్ధముగా నుంచుకొనునధికార మెల్లజాతులకుం గలదు. అదియుత్తమజాతులకు మాత్రమేకలదని యేపురాణములు తెల్పవు. జాతి

---

భోక్ష్యంతి పురుషాస్స్వయం, వంచయిత్వా పతీన్ సుప్తాన్ గమిష్యంతి స్త్రియోఽన్యతః. ౪౦.

మహాభారతారణ్యపర్వము. ౧౮౮. అధ్యాయము

బ్రాహ్మణాశ్శూద్రకర్మాణస్తథా శూద్రా ధనార్జకాః. ౩౧. క్షత్రధర్మేణ చాప్యత్ర వర్తయంతి గతే యుగే, నివృత్తయజ్ఞస్వాధ్యాయా పిండోదకవివర్జితాః. ౩౨. బ్రాహ్మణాస్సర్వభక్షాశ్చ భవిష్యంతి కలౌయుగే, అజపా బ్రాహ్మణాస్తాత శూద్రా జపపరాయణాః. ౩౩. విపరీతే తదా లోకే పూర్వరూపం క్షయస్య తత్, బహవో మ్లేచ్ఛరాజానః పృథివ్యాం మనుజాధిప. ౩౪. మృషానుశాసినః పాపా మృషావాదపరాయణాః, ఆంధ్రాశ్శకాః పుళిందాశ్చ యవనాశ్చ నరాధిపాః. ౩౫. కాంభోజా బాహ్లికాశ్శూరాస్తథాభీరా నరోత్తమ, న తదా బ్రాహ్మణః కశ్చిత్స్వధర్మముపజీవతి. ౩౬. క్షత్రియాశ్చాపి వైశ్యాశ్చ వికర్మస్థా నరాధిప, అల్పాయుషస్స్వల్పబలాస్స్వల్పవీర్యపరాక్రమాః. ౩౭. అల్పదేహా అల్పసారాస్తథా సత్యాః ప్రభాషిణః, బహుశూన్యా జనపదా మృగవ్యాళావృతా దిశః. ౩౮. యుగాంతే సమనుప్రాప్తే వృథా చ బ్రహ్మవాదినః, భోవాదినస్తథా శూద్రా బ్రాహ్మణాశ్చార్యవాదినః. ౩౯. మునిచ్ఛద్మాకృతిచ్ఛన్నా వాణిజ్యముపజీవినః, మిథ్యాచ నఖరోమాణి ధారయంతి తథా ద్విజాః. ౪౭. అర్థలోభాన్నరవ్యాఘ్ర తథాచ బ్రహ్మచారిణః, ఆశ్రమేషు వృథాచారాః పానపా గురుతల్పగాః. ౪౮. ఐహలౌకికమీహంతే మాంసశోణితవర్ధనం, బహుపాపం

యందుత్తమమధ్యమాధమతారతమ్యము లేదు. వానికింజేరిన వారి ప్రవర్తనమునను సరించి యది యుండును. ఒక్కొక్క జాతి కొక్కొక్క ధర్మము ప్రధానమని భగవంతుడు లోకప్రవృత్తి నిమిత్తము శాసించెను. దానిని వదలుట భగవదాజ్ఞను శిరసా వహింపక త్రోసివేసినట్లగును. అది మహాపాపకార్యము. ప్రతిక్షణ మున జాతులను మార్చునధికారము సామాన్యమానవులకు లేదు. భగవంతునకే కలదు. ఆలోచించియే పరమేశ్వరుడేర్పాన రించెను. వానిని మార్చిన సంకరమగుటయే కాని తత్ఫలము

---

డసంకీర్ణాః పరాన్నగుణవాదినః. ౯౫. ధర్మస్య బలహానిస్స్యాదధర్మశ్చ బలీతథా, అల్పాయుషో దరిద్రాశ్చ ధర్మిష్ఠా మానవాస్తథా. ౯౬. అధర్మిష్ఠై రుపాయైశ్చ ప్రజా వ్యవహరంత్యుత, సంచయేన తథాల్పేన భవంత్యాఢ్యా మదాన్వితాః. ౯౭. ధనం విశ్వాసతోన్యస్తం మిథో భూయిష్ఠశో నరాః, హర్తుం వ్యవసితా రాజన్ పాపాచారసమన్వితాః. ౯౮. నైతదస్తీతి మనుజా వర్తంతే నిరపత్రపాః, పురుషాదాని సత్వాని పక్షిణోథ మృగా స్తథా. ౯౯. నగరాణాం విహారేషు చైత్యేష్వపిచ శేరతే, సప్తవర్షాష్ట వర్షాశ్చస్త్రియో గర్భధరా నృప. ౧౦౦. దశద్వాదశవర్షాణాం పుంసాంపుత్రః ప్రజాయతే, భవంతి షోడశే వర్షే నరాః పలితిన స్తథా. ౧౦౧. ఆయుఃక్షయో మనుష్యాణాం క్షిప్రమేవ ప్రపద్యతే, క్షీణాయుషో మహారాజ తరుణా వృద్ధశీలినః. ౧౦౨. తరుణానాం చ యచ్ఛీలం తద్వృద్ధేషు ప్రజాయతే, విప రీతాస్తదా నార్యో వంచయిత్వార్హతః పతీన్. ౧౦౩. వ్యుచ్చరంత్యపి దుశ్శీలా దాసైః పశుభిరేవచ, వీరపత్న్యస్తథా నార్యస్సంశ్రయాంతి నరాన్ నృప. ౧౦౪. భర్తారమపి జీవంత మన్యాన్ వ్యభిచరంత్యుత, తస్మిన్ యుగ సహస్రాంతే సంప్రాప్తే చాయుషఃక్షయే. ౧౦౫. అనావృష్టిర్మహారాజజాయతే బహువార్షికీ, తతస్త్వాన్యల్పసారాణి సత్వాని క్షుభితాని వై. ౧౦౬.

నొందఁజాలరు. ఈవిషయము సామాన్యులకుఁ దెలియశక్యము గాకయుండును. మాకుం దెలియకేల పోవునని పట్టుపట్టిన నిహ పరములకు వారు చెడుదురు.

కలియుగమున నట్టిడాంబికులే పెక్కండ్రుందురు. వారు భగవత్ప్రసాదపాత్రుల మనియే చెప్పుకొందురు. అవతార పురుషులమనియు నందురు. వేదశాస్త్రములు రానికారణమున వానితో లాభములేదందురు. అవి కల్పితము లందురు. ఆ మాటలు తుచ్ఛములే యైనను గొందఱు పండితమ్మన్యులు వానికి సంతసింతురు. శిష్యులగుదురు. వారేమో తరణోపాయమును జూపుదురని నమ్ముదురు. అట్లునమ్ముట యంధుని నంధుఁడు నమ్మి నట్లే. లోకమునఁ బ్రఖ్యాతి కల్గుటయే మోక్షమనుకొనువారే యట్లు ప్రవర్తించువారని యెఱుంగుము. ఇంక నాబ్రహ్మర్షిత్వ మునకుఁ గారణములనేకముల గలవు. నాచరిత్రము రామాయ ణమునఁ జదివితివనంటివికదా. దానివలన నెఱింగియే యుందువు. అట్టికారణము ఇట్టి ప్రయత్నముగల్గిన బ్రహ్మర్షిత్వము లభిం చును. నావిషయ మటుండ నిమ్ము. నీప్రశ్నమునకుఁ జెప్పఁదగి నంత వచించితిని. ఇంకేమి వినఁగోరుదువని యాదృతిం బల్కెను. ఆయాదృతికిఁ బరమానందమంది చేతులు జోడించి మహాను భావా! బ్రాహ్మణులయాచారములు తాఱుమాఱగుచున్నవి. ఇట్లే మాఱుచు మాఱుచు శ్రౌతస్మార్తాచారములు నశించునా. నిలుచునా దయమెయి నానతీయవలయునని వేఁడితి. నాప్రశ్న మునకు నవ్వి వత్సా! సనాతనమతము కలియుగమునందుఁ గూడఁ దుదముట్ట నశింపదని నమ్ముము. బహుముఖముల నుండఁ జాలదుగాని శిష్టులకడ నిలువఁజాలును. శిష్టులుగూడ నల్ప

సంఖ్యాకులే యుందురు. వారును బరులు తమ్ముఁగాంచి పరిహా
సింపఁ గృపణులై యుందురు. తక్కుంగలబ్రాహ్మణులు నామధా
రకులై సంధ్యావందనాదులుకూడ మాని శూద్రులుపదేశిం
పఁగా వారికి శిష్యులై యుండఁగలరు. మాంసభక్షణము
సాధారణంబగు. సురాపానము పాపహేతువుగా నెన్నఁబడదు.
పాపముల నొనరించి యితరులను బాపాత్ములని యాక్షేపించుట
యాచారంబగును. విశ్వాసము శబ్దనిష్ఠమేయగు. ధనార్జనము
నకై మంత్రముల నుపదేశించుచు వేదాంతమును బోధించుచు
సకలదుష్కార్యముల నొనరించుచు లజ్జలేక తిరుగువారే గౌర
వముగలవార లయి యుందురు. ఇతరులు వారిజోలికిం బోవక
యూరకుందురు. కొందఱు యోగులవలెఁ దిరుగుచు నేదో
యొకధర్మకార్యము చేయుదుమని ధనము నార్జించి కుటుంబ
పోషణము చేయుచుందురు. వారు పరమభక్తులని పామరులు
నమ్మి వారిని సేవించుచుందురు. ప్రతిమానవుఁడును మతస్థాపనము
చేయఁ బ్రయత్నించి భంగపడుచుండును. స్త్రీలు స్వేచ్ఛగాఁ దిరు
గుదురు. పురుషులు వారినేమనఁజాలక వారియుపదేశము విను
చుందురు. సదాచారములు నశించు. పితృక్రియలు వ్యర్థము
లని పలుకువారింగాంచి యితరులు వానిని జేయ మానుదురు.
ఈరీతిగా విప్రులు తిరుగుచు జాతిగౌరవమును బోఁగొట్టుకొని
యకార్యముల నెన్నియోఁ జేయ వెనుదీయక యుందురు. ద్రవ్య
ము తక్కువ కాఁగా దానికై తినరానికూడు గుడిచి కలవలపా
టొందుదురు. వేదశాస్త్రపాఠము నామమాత్రమగు. ఎవ్వరేఁ
జదివినను వారు పరిహాసింపఁబడుచుందురు. ఇట్లు చెప్పసాగిన
నెన్నియో గలవు. వీని నుపలక్షణములుగా భావించుకొని

యూహించుకొనుము. పురాణములంబఠింపుము. సర్వము విది తంబగు. ఏకాలమునఁ గాని దాంభికులచెంతకుం బోవకుము. అని పలికి యూరకుండెను.

ఆమాటల విని యేమియుందోఁపక మహాత్మా! ఎప్పటి కైన నీయనాచారములు మార్పునొందునా యని ప్రశ్నించితిని. కలియుగాంతమున నివి నశించును. సత్యయుగము రాఁగా యథాపూర్వముగా సదాచారములు వెలయుననియె. నేనంతట మునికులతిలకా! ఐదువేలయేండ్లకొక్కసారి కృతయుగలక్షణ ములు పొడసూపునని కొందఱందురు. అది నిశ్చయమా యని ప్రశ్నించితిని. వత్సా! అది కపటాత్ములమాటలు. సర్వవిధ ముల నట్లుకాఁజాలవు. కలియుగమునఁ గ్రమముగా నశింపవలసి నవే కాని యభివృద్ధి గాంచఁదగినవి సదాచారములలో లేవు. తెలియనివారియుపదేశములకు మోసపోవకుము. ఒకొక్కక్క రును శిష్యులంగూర్చుకొనఁ బ్రయత్నింతురు. పామరులు వారినే యవతారపురుషులనుగా భావింతురు; సేవింతురు. ఫలము ధన వ్యయమేకాని వేఱుకాదు. అని బోధించి యిఁక నీతో మాట లాడ నవకాశము లేదు. నీసందేహము లింకనుండిన ముందు నీవుపోయి చూడఁదగిన యాశ్రమములయందు మహాత్ములు కలరు. వా రుపదేశింతురు. ఆమాటలనుగూడ శ్రద్ధమై విని శంకావిరహితుఁడ వై మరలి పొమ్మని యొక్కచిటికవేయఁగా నే నాశిఖరాగ్రమున శ్యామసుందరునిపార్శ్వమున నుంటిని. నాయప్పటియాశ్చర్యము వర్ణనాతీతము.

అంత నాశ్యామసుందరమూర్తి నన్నుంగని నవ్వుచు నాశ్రమముం గంటివికదా. అపాయము లేవియు లేవు

కదా అనియె. మహానుభావా! తమప్రాపున నున్న నా కేయుపాయ
ములు గలుగును? అని విన్నవించితి. ఇక వేఱొక్కస్థలము
కనఁబడు ననఁగానే పరమేశ్వరా! ఈశిఖరాగ్రమును జూచు
కోర్కి కలదంటిని. రమ్మని ముందు నడువసాగెను. ఇంచుకసేప
టిలో నందుంటిమి. శ్వేతశిఖరమనునామము సార్థకముగ
నుండెను. విశాలసమభాగమందుఁగన్పట్టెను. మేఘమండలముచేతి
కిందికెక్కినట్లే యుండెను. అందుండి క్రిందిభాగము చూడఁగా
విచిత్రముగాఁ గనఁబడెను. పర్వతశిఖరములు కూడ నత్యల్ప
ములుగాఁ గనుపట్టెను. అందలివృక్షము లత్యున్నతములు.
వానిపై భాగ మదృశ్యము. హిమ మంతటఁ గప్పియుండుటం
బట్టి వృక్షములకొనలు దృష్టికిం దోఁపకయుండెను. ఆవృక్షము
లపై నామంచులోఁ గలరవములు చేయుపక్షు లగపడెను.
ఇదేమి విచిత్రము మహాత్మా యంటిని. అది స్వభావమే కాని
విచిత్ర మిందేదియు లేదని పలికెను. ముహూర్తమాత్ర మట
నుంటిమి. చూచితివా యనుప్రశ్నము వినఁబడియె. దీనిమహి
మము నెఱుంగ నాకుఁ దరమా యంటిని. తనివి వాయలేదని
తోఁచెడిని రమ్మని కొంతదూరము పోయినవెనుక నొకగండ
శిలను జూపి కుమారా! నమస్కరింపుము. అనునంతలో సాష్టాంగ
నమస్కార మొనరించితిని. లేచి చేతులుజోడించి నిలిచితి.
వత్సా! ఈపాషాణము పరమపావనము. ఇందుఁ బార్వతీపర
మేశ్వరులు కొన్నివేళల నుందురు. వారి పాదపద్మాంకిత మీ
పాషాణము. ఈశ్వేతశిఖరము పార్వతికి మెచ్చువచ్చునది. ప్రమ
థులంగూడి పరమేశ్వరుఁడు సర్వమంగళాంబయు నిందు నివ
సింతురు. ఇందు వేంచేసియున్న భవానిని భగవంతుని మునులు

దేవతలు దర్శించి కృతకృత్యు లగుదురు. దీనిపై కెక్కఁగోర కుము. శిరస్సు సోఁక నమస్కరింపుము. ఇది కడువిశాలము. నింపు వేడుక దేవతలందఱు నా యాదిమదంపతుల సేవించు స్థలమిది. ఇదియే యీశిఖరాగ్రమున సేవింపఁ దగినది. మఱి కొన్ని స్థలములు కలవుగాని యవి మనుష్యుల కగమ్యములు. కావున నింక వేఱొకచోటికిం బోవుద మనునంతలో నాశిఖరము గాని యాగండశిలగాని గోచరింపక క్రొత్తభాగము గోచరించెను.

ఆభాగము చూచుట కింపుగాక భయంకరముగా నుండెను. పర్వతసానుభాగమా యన్నఁ గాదు. శిఖరమా యని పరికించినఁ గాదు. సమభాగమా యన్న నదియుఁ గాదు. ఎంతయో విమర్శించితిని. ఇంచుకంతయు గోచరింపక యుండెను. ఎందుండియో చెప్పఁజాలను గాని ఘోరమృగరావములు మాత్రము వినఁబడుచుండెను. మనస్సు భయసాగరమున మునిఁగి దిక్కుతోఁపక యుండెను. ఏక్షణమున నేజంతువు మీఁదఁ బడునో యనుతత్తఱపాటు మాత్రమునన్ను వదలకయుండెను. ప్రక్కన శ్యామసుందరమూర్తి యున్నను గూడ నిట్టిభయము కలుగుచున్నదే. ఇఁక నంతట భగవంతుఁ డున్నవాఁడని నమ్మిక యేమూల నుండెనో. ఇంతటిచంచలస్వభావుఁడనుగదా యని నన్ను నేనే నిందించుకొనుచు

"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్నమాటయందు విశ్వాసము కుదురలేదే. ఏటికో యని చింతించుచుంటిని. ఒకప్పు డులికిపడుచుంటిని. మఱొ క్కప్పుడు నాలుగుప్రక్కలు కలయంజూచుచుంటిని. కాని భగ వంతుఁ డున్నవాఁడు. అందును జెంతనే యున్నవాఁడు. ఇఁక

నాకేమిభయము? మిన్ను విఱిగి నెత్తినఁ బడినను భయము లేదను నమ్మకము తోఁపకయుండెను. అత్యున్నతభాగమునుండి మదగజతుల్యధారలు మహావేగమునఁ బడుచుండెను. మహాగర్త ముదయించి పాతాళముదనుకఁ బోవలసియు నావేగము నోర్చి యాపతనస్థల మెట్లు నిలువఁ గల్గెనో చెప్పఁజాలను. అంతటి ధారల నోర్చినశిల లెంతసారముగలవియో యూహింపను కూడసమర్థుఁడనుగాను. ఇన్ని భయంకరకారణములు కనంబడఁగా వినంబడఁగా నాశ్యామసుందరునిసాన్నిధ్యమే లేకయుండిననేమగుదునో. అంతలోనాజగన్మోహనాకారుఁడు నామనోదైర్యమును దెలిసికొనెను గాఁబోలు. వత్సా! ఏల చింతనభినయించెదవు? భయంపడెదవే ఏల? అని నవ్వుచుఁ బ్రశ్నించెను. స్వామీ! యొకప్రాణము పోఁజాలక నన్నంటి యున్నదంటిని. చక్కఁగా నన్నుఁజూచి పక్కున నవ్వి యేమి యంతదురవస్థకుఁగారణమని యడిగెను. ఇన్నిస్థలములుచూచితిఁగాని యిట్టిచోటీమహాపర్వతమున నీవఱకుఁ జూడలేదు. మనస్సు నిలుకడఁ గాంచునట్లు లేదు. నలుఁగడల భీతికృన్మృగధ్వనులు చెలరేఁగుచున్నవి. మిన్నువిఱిగినెత్తిపైఁ బడునట్లున్నది. ఐరావతమంతధార లనేకములు గలుగున ట్లొకమహానది యెందుండియో క్రిందఁబడుచున్నది. దాని యురవడికి భూమి క్రుంగి పాతాళము నేల యంటకున్నదో యని యూహించుచున్నాను. మన మెందున్నవారము? ఇందుఁజూడఁదగినచోటు లెవ్వియో యెఱుంగనేరకున్నాఁడను. వేఱొండుచోటు కనఁబఱచి నాకుందు మాన్పుమీ యని వేఁడితి. నామొఱ యాశ్యామసుందరుం డెఱింగెను. చెంతకేతెంచి వీఁపు తట్టుచు నింతియేనా నీకు నాపైఁగలవిశ్వా

సము ? మృగధ్వనుల కులికిపడిరెుచవా. మృగములు పైఁబడి
నను నీకపాయము లేదంటినే. ఆమాట మఱచితివా ? ఈ
తావున కేల తోడి తెచ్చితినో తెలిపెద వినుము.

“ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే.”
(పనిలేక వెఱ్ఱివాఁడును దిరుగఁడు.)

అన్నమాట యెఱుంగుదువు కదా. చూచినతావులం
గలవిశేషములకంటె నిందెక్కుడు మాహాత్మ్యములు గలవు.
వానిం దెల్పుటకే పిలుచుకొని వచ్చితిని. భయంపడకుము.
ధైర్యము మదిఁబోడసూపినదా అని ప్రశ్నించె. దిటవు తెచ్చుకొని
ఆషాడచూపినచె. అనుచుండఁగనే యేనుఁగును మించినంతయెత్తు
గలబెబ్బులి వడివడిఁ బైనుండి దిగుచుండెను. దానికంటె ముందు
వ్యాఘ్రము వచ్చుచున్నదని తెల్పుటకుంగాఁబోలు గండ
శిలలు దొర్లుచు వచ్చుచుండెను. వానివెనుక నోరు తెఱచుకొని
యావులించుచు జాడఁ గనంబడఁజేయుచు నేనున్న తావునకే
సూటిగా వచ్చుచుండెను. నేను బాలరూపధరునిఁ జూచు
చుండితిఁగాన దూరముననుండి వచ్చునపుడే చూడనైతిని. అది దిగి
వచ్చునపుడు నభోమార్గమునుండి వచ్చుచున్నట్లు తోఁచెను.
కాని దానిని వెనుకనిడుకొనివచ్చుగండశిలలు పర్వతశ్రేణి[illegible]
మని తెలియఁజేసెను. ఇంచుక చూచితిని. ఇంకేమిగతి[illegible]
తోఁచెను. స్వామీ ! పులి యదె యని చెప్పఁబోయి మా[illegible]
ఆమీ యని నోరు తెఱచితిని. మాటరాదు సరి[illegible] దేహ
మంతయు నల్లలనాడఁ జొచ్చెను. ఒడలంత[illegible] చెమ్మటచేఁ
దడిసిపోయెను. ఆ తరుణమునాకడకే రాసాగె[illegible]గా నన్నుఁ
గాపాడుమా యని వేఁడుదమన్న మా[illegible]. పోసి! దగ్గ

ఱకుఁబోయి యాపురుషోత్తముని బిగ్గ గౌఁగిలించుకొందము. తరువాతిగతి చూచుకొంద మనుకొనినను గాళ్లు రావు. నేనేమి చేయవలయునో నాకే తెలియ లేదు. ఏమో చెప్పఁబోవు నట్లు పెదవులాడించుటయే గాని యొక్కయక్షరమైనను జాఱి పడకపోయెను. వ్యాఘ్రము పదిబారలంతదూరమున కేతెంచెను. నాగతి మఱింత దుఃఖజనక మయ్యెను. ఆపద్బాంధవుఁడగు కదా పరమేశ్వరుఁడు ఇఁక వీఁడు జీవింపఁడని తోఁచినదేమో. కొండయంతయు మాఱుమ్రోఁగున ట్లొకహుంకార మొనరించెను. వచ్చుచున్నపులి యట్లే నిలిచిపోయెను. ఉన్నట్లుండి పడిపోయెను. తోఁక నాలుగైదుసారు లాడించెను. నోరు తెఱచెను. నాలుక సాఁచెను. మఱి కదలలేదు. క్షణకాలమునను నించుకపోరలినట్లుండెను. మహాస్తమాత్రమట్లే యుండెను. శ్యామసుందరమూర్తి కరతలస్పర్శమున నెక్కడలేని ధైర్యము కలిగెను. ఇఁక దానింబొమ్మతునా యంటిని. ఏమో కాని పలుకఁ డయ్యెను. దృష్టి దానిపైననే యుంచెను. నాధైర్యముగాని సాహసముగాని పరికింపఁ డయ్యెను. మహాశయుఁడా! నిక్కము వచించెద. నామాటల విశ్వసింపుఁడు. ఒక్కవెలుఁగు నేనొక్కఁ వెలుంగనిది యావ్యాఘ్రమునోటనుండి వెడలి బాలుని చెన్నెరుకుఁ బరుగిడెను. నాకన్ను లద్దానిఁ జూడ జాలక మూతపడియె. ఆవల నేమిజరగెనో నేనెఱుంగను. నాకుఁ జక్కఁగా స్మృతి వచ్చునప్పటికి శ్యామసుందరమూర్తి నన్నుఁ జూచుచుండెను. నేను మహాపురుషా! ఇదేమి విచిత్రము? అంటిని. సుస్మితము సలింపఁగ నాకు నీకిది విచిత్రముగాఁ దోఁచినది కాఁబోలును. వినుము.

తొలిజన్మమున నీతఁడు విప్రకుమారుఁడు. మారీచవంశజుఁడు. సునీథుఁ డనువాఁడు. సదాచారసంపదగలిగి వేదము పఠించుచుండెను. సహపాఠులంగూడి వేడుకమెయి సంచరించుచుండెను. గురుశుశ్రూషచేయుచుండెను. బుద్ధిమంతుఁడని పెద్దలయందు భక్తికలవాఁడని పేరుపొందెను. గురుపత్నియు నీతనిఁ బుత్రప్రీతితో నాదరించుచుండెను. కొంతకాల మీరీతిగాఁ గాలము చెల్లెను. వ్యాఘ్రపాదుఁ డనునొకవిప్రకుమారుఁ డితనితోఁ జదువుచుండెడివాఁడు. ఆతఁడు క్రూరస్వభావము కలవాఁడు. కాని సూక్ష్మబుద్ధికలవాఁడు. ఈయిరువురకు నత్యధిక మైత్రి కుదిరెను. ఒక్కనాఁడు గురువుపనుపున నడవికిం జని ఫలపుష్పకుశాదుల సంగ్రహించుచు నందుఁ దిరుగు హరిణ శిశువును గాంచిరి. అది యొక ముని రక్షించునది. ఆశ్రమము దాఁటి యివ్వల బాల్యచేష్టలఁ దిరుగుచుండెను. వ్యాఘ్రపాదుఁ డద్దానింజూచి యాశ్రమమృగశిశువని యెఱింగియు సునీథా ఇది యడవి నుండునది. ఒక్కరి స్వత్వము కాదు. దీనిం జంపి వండి తిందమా యని హెచ్చరించెను. ఈతఁ డామాటలు వినక యిది చాలఁ జిన్నది, కావున దీనిం జంపరాదనియె. కాని వ్యాఘ్రపాదుఁ డటవీ మృగము లొకని స్వత్త్వ మనునియమము లేదనియు, నందఱకు వానియందు స్వత్త్వము కలదనియుఁ గానములు పర్వతములు నదులు భగవన్నిర్మితములుగా నెల్ల రనుభవింపఁదగినవనియు నెన్నియోయుక్తు లుదాహరణములు నీతులు తెల్పి మనస్సును మరల్చెను. సునీథుఁడు నామాటలకు లొంగిపోయెను. ఇరువురు నొక్కమాటకువచ్చి దానిం బట్టుకొనిరి.

అంతలో దానితల్లి యరుదెంచి దూరమునుండియే తనసంతతిని బట్టుకొనుటయుఁ జంపనుంకించుటయుఁ గన్నులారఁ గాంచి బ్రహ్మాండము నంటునటు లుపమానములగు విశాలసుందరనయనములలోఁ దనయార్తిని దెలుపుచుఁ జేయునదిలేక రోదనము గావించుచు నూరకుండెను. ఈయిరువురును దానిం బట్టుకొని పడవైచి గొంతునలిపి పొలియించిరి. ఆతరుణమున నామృగము పరుగిడి యాశ్రమాంతరమున సమాధి నూనఁబోవు మునిమ్రోల నిలువఁబడి కన్నీరు వదలుచుండెను. ఆముని మృగమువంతఁ దిలకించి హేతువేమని దానిచెంతకు రాఁగా నది తనసంతతియున్న యెడకు మోరసారించి నడువసాగెను. ఏమిది యచ్చెరువుగా నున్నదని మునియు దానివెంబడించెను. మృగశిశువును వధించి పక్వము చేయ నుంకించు తావునకు వచ్చి నిలిచెను. మునియు దానిం గన్నులారఁ గాంచి సంతప్తహృదయుఁడై వటువులారా! ఈమృగశాబకము మిమ్ము బాధింపదు. మీజోలికి రాదు. సాధుమృగములసంతతి. అందునుఁ గడుంజిన్నది. మీరు బ్రహ్మచారులు. వేదవేదాంగములఁ బఠించువారు. మీగురువు లుత్తములు. బ్రహ్మజ్ఞానవరిష్ఠులని విఖ్యాతినొందినవారు. అట్టివారికి శిష్యులరయ్యు నిట్టి పరమఘాతుక కృత్యమును జేయఁబూనుట న్యాయమా? ఇది యాశ్రమమృగపోతమని తెలియఁదగు గుఱుతులు కలవు గదా. అవిషయమును జర్చించియు నెఱింగియు మాంసలుబ్ధులై యీఘోరకార్యమును జేసితిరి. కావున మిమ్మూరక వదలఁగాదు. మీయిద్దఱిలో సునీథుఁ డనుపేరఁ బరఁగు నీ వల్పపాపశాలివు. కాన వ్యాఘ్రజన్మ మెత్తుము. వ్యాఘ్రపాదుఁ డనునితఁడు కొండచిలువ నై యుండుఁ గాక.

అని శపించి దానిం గని కరుణారసభరితాంతరంగుఁడు కావున బోరున విలపించెను. ఆమునితోడ నామృగజననియు బిట్టు రోద నము గావించెను. అత్తఱిఁ దమయపరాధము నెఱింగి యా యిరువు రామునిపతిపాదములపై వ్రాలి మాయపరాధమును క్షమింపుమా యని ప్రార్థించిరి. శాపముక్తి ననుగ్రహింపవే యని దీనవదనులై చేతులొగ్గిరి. మానిచంద్రుఁడు కరుణానీ రధి. కావున వారినిజూచి నావచన మమోఘము. సునీధుఁడు కొలఁదికాలమే వ్యాఘ్రరూపముననుండి యొకమహాపురుషుని దర్శనమున శాపముక్తి నొందఁగలఁడు.వ్యాఘ్రపాదుఁడు లక్ష్య లక్షణపురస్సరముగా నీవధము దోషముకాదని బోధించి రెండవవాని నొప్పుకొనఁజేసెను. కావున నజగరమై చిరకాలముండి శంకరుపాదస్పర్శమున శాపవిముక్తిం గాంచఁగలఁడు. ఇదియ శాపవిముక్తిపద్ధతి. అని పలికి మీాకీశాపఫలము రేపుదయమునఁ గనంబడును. గురుకార్యముందీర్చి యడవికిం బొండు. అని యానతి యిడి క్రిందఁబడియున్న హరిణశాబకమును దిలకించి డగ్గుత్తికతో హవ్యవాహనా! నీవు త్రిమూర్తిమయుఁడవు. జగదాధారుఁడు—కరుణాస్వరూపుఁడవు. ఇట్టినిన్నే కొలుచు నాకీ యుపకార మొనరింపుము. ఈహరిణశాబకము సజీవమై జననికి నాకు నుల్లాసమును గల్గించుఁ గాక. నేను సత్యమునే యుపాసింతునేని, భగవంతుఁడు సత్యస్వరూపుఁ డగునేని సత్యమే సర్వదా విజయముగాంచుననుమాట వేదవిహితమేని నాయీవాంఛను త్రిమూర్తిమయుండగు హవ్యవాహనుఁడు ఫలింపఁజేయుఁగాక యని చేతులొగ్గి నిమీలితనేత్రుఁడై తేజస్స్వ రూపుఁడగు పరాత్పరుం బ్రార్థించెను. తల్లియుల్లంబు పల్లవింప

మునితల్లజుచిత్తం బుల్లాసమొంద నాహరిణశాబకము నిద్ర
నుండి లేచునట్లు పొరలిపొరలి లేచి మౌనినాయకునిచెంతకు
వచ్చెను. దానింగాంచి దూరముగనున్నదానితల్లి త్వరపడి
వచ్చి తనబిడ్డను నాకుచు నిలువంబడెను. వటువులు తమ
దుశ్చేష్టకుఁ గుందుచు నింటికింబోయి గురువున కావార్తం దెలిపి
తెల్లవాఱకముందే యడవికింబోయిరి. ఆ సునీథుఁడే యీ
వ్యాఘ్రము. దాని కీదినమున శాపవిముక్తి యయ్యెను. నీకుం దెలిసి
కొన శక్యముగాని యాకృతితో నొకవ్యక్తి దానికిం గనం
బడెను. తద్దర్శనమున నది క్రూరవ్యాఘ్రరూపముం దొఱంగి
యూర్ధ్వలోకంబునకుం జనియె. ఇందులకే నిను నిచటికిం
దోడ్కొనివచ్చితిని. అజగర మీపర్వతముననే నొకచోట నీకుం
గనంబడియెఁగదా. దాని కింకను శాపవిముక్తికాలము రాలేదని
నమ్ముము. ఇఁక నీస్థలమాహాత్మ్యమును వినుము.

### స్వర్ణమందాకిని. (కాంచనగంగ)

వత్సా! తూర్పున నత్యున్నతశిఖర మొక్కండు కనంబడి
యెడిని. చూడుము. అది యాకాశమువలెఁ గనంబడును. పరీ
క్షించి చూడుము. అత్యున్నతము, తుహినసాంద్రసమాక్రాం
తము నగుట శైలశృంగమా యాకాశమా యనుసంశయ
మొందవచ్చును. కాని యాకసమునుండి సెలయేఱు ప్రవహిం
చుట కలదా. ఆగుఱుతునుబట్టియైన నిది మహత్తరపర్వతమున
నొకశృంగమని గ్రహింపుము. ఆ నది స్వర్ణగంగయనుపేరంబరఁ
గును. ఆయున్నతశిఖరమునుండి నిర్గమించుచున్నది. నూటయొని
మిదిధారలుగా నది భూభాగమునకు దిగుచున్నది. అసదిని
బట్టియే యాశిఖరమునకుస్వర్ణగంగయనుపేరు ప్రసిద్ధమయ్యెను.

నీ కింకను శృంగమేది యనుసందియము తొలఁగినట్లు కాన
రాదు. ఆగంగధారలు నిర్గమించుచోటికి నిరుప్రక్కల దృష్టిని
బఱపుము. వృక్షము లున్నజాడ లగపడియెడిని. మంచు దట్ట
ముగాఁ బైఁ గప్పుకొనినను నల్లగా నున్నట్లు కనఁబడుటలేదా.
మహోన్నతవృక్షము లట్టులున్నవి. అని యెంత చెప్పినను
మహాత్మా! ఆజాడ నాకగపడలేదంటిని. నవ్వి యొకలతావిశేష
మును జూపి దానిపసరు కంటిపై స్పృశింపఁజేయుమనియె. ఆలత
రక్తవర్ణముగా నుండెను. దానిపూవులుపచ్చగా నుండెను.
పత్రములకుఁ బూవులకు భేద మగపడకుండెను. పరిమళమును
బట్టి యిది పుష్పమని యది పత్రమని గ్రహింపఁ దగియుండెను.
దాని నింతకుముందెన్నఁడు విన్నదియు లేదు. గ్రంథములను
జదువునపుడు నట్టిదున్నట్టు లెఱుంగను. చాల వింతగా నుండెను.
దాని పత్రసారమును గైకొని కనుల పైభాగమునఁబూసితిని.
ఏమని వర్ణింతును. బట్టబయలుగఁ దోఁచెను. దూరముగా
నున్న యాయత్యున్నతశిఖరము చెంతనున్న యట్లగపడియెను.
మహాత్మా! చక్కఁగాఁ గనుఁగొనఁజాలితి నంటిని.

నవ్వి యామహాత్ముఁడు వత్సా! ఇందుండియే యీ
మందాకిని యవతరించి యదృశ్యమై యింతకుముందు నీకుఁ గనఁ
బఱచినచోట స్పష్టముగాఁ గనఁబడును. అంతదనుక భూస్ప
ర్శము కాక పర్వతోర్ధ్వభాగముననే ప్రవహించుచుఁ బోయి
యాచోటున దిగి భూమిమీదం బ్రవహించును. దీనిచరిత్ర
మత్యద్భుతము. శతధారలుగాఁ బడఁగారణమే మందువా యొక
ధారగా నిది యవతరించిన యీపర్వతమే నిలువఁ జాలదని
నమ్ముము. ఆగంగావిర్భాగమునకుఁ బైననున్నదియే శిఖరాగ్రము.

ఇటనుండి సత్రిపాదక్రోశమున్న తిగలవని యెఱుంగుము. ఈశిఖరమునకు శంకరశిఖర మనునామాంతరము కలదు. ఉమామహేశ్వరు లీశిఖరాగ్రమున విహరింతురు. అత్తఱి దేవతాధీశులకే నిది యగమ్యము. ఈశృంగము దర్శనమాత్రమున సకల పాపముల నడంచును. ఈశిఖరాగ్రమున నొకశిలాఫలకము కలదు. అందు శంకరుఁడు పార్వతిం గూడి ప్రమథులు సేవింప నుండఁగా జాంబవంతుఁ డను భల్లూకరాజు వచ్చి సేవించెను. ఆయన వంశమునకు సంబంధించినభల్లూకము లిందు వేనవేలుగా నున్నవి. మనచెంతఁ బాఱుచున్ననదిని బరీక్షింపుము. గుఱ్ఱము లెన్ని కలవో అవి సలిలాశ్వము లనఁబడును. నీటి యేనుఁగులు గలవు. ఈభాగమున విశేషసంఖ్యలుగా మృగము లుండును. స్థలజంతువు లెన్నిగలవో జలజంతువు లన్నియు నిందుఁ గలవని తలంపుము. వనవృషభము లందందు అంకెలు వేయుచున్నవి. అవి మనుజులజోలికి రావు. మాంసభక్షకములు కావు. తృణపర్ణాశనములు. కాని మనుజులు తమ్ముఁ బట్టఁబూనుదురని తోఁచినఁ గొమ్ములం గ్రుమ్మి తప్పించుకొని పోవును. హరిణజాతు లనేకములు గలవు. అవి తఱచు నాశ్రమములయందు శయనించును. సాధు తమజంతువులుగాన శాంతధనులగు మహాత్ముల పొంతనే యుండును. విశేషించి వ్యాఘ్రాదిక్రూరజంతువులు తమ్ముం దఱిమి చంపునసుభీతి వానికిం గలదు. అట్టియాశ్రమములయందు వ్యాఘ్రాదిక్రూరజంతువులవలని బాధ కలుగదనియు నివాసార్హములాశ్రమములే యనియు వానికి విశ్వాసము. మునులు కూడ వాని నతిప్రీతిం బెంచుచుందురు. వారు సమాధియందుండుతఱిని వారియంకపీఠముల నవి శయనించి

నెమరు వేయుచుండును. తదంగస్పర్శము పవిత్రమనిమానులు భావింతురు. ఆహారిణము లీచోటఁ బెక్కుజాతులు గలవు. అల్లదిగో యొకగుంపు పోవుచున్నది చూడుము. అవ్వియు హారిణజాతికిం జేరినవే. రురుజాతియని దానియవాంతర భేదము. వాని యంగములనిండ మచ్చలు గలవు. కొమ్ములమూలముల నెఱ్ఱని మచ్చలుగలవు. తీఁగలనమలియు నాకులఁ జప్పరించియుఁ దృణమును మేసియు హిమజలములఁ ద్రావి యవి జీవించును. హారిణములలోనివి యెత్తైనవి. కొమ్ములు వాడిగా నుండనేల యని సందేహింతువా. ఎవ్వరేఁ దమ్ముఁ బట్టుకొన వానిసాయమునఁ దప్పించుకొనఁ గలమని వానికి నమ్మకము గుదురుటకై యవి నిర్మింపఁబడినవనియు నవి యందులకుంబనికివచ్చుననియు నెఱుంగుము. ఇట్టిపావనభాగమును దర్శించితివి. ఇందొక్క మహర్షియాశ్రమము కలదు. దానింజూపుటకే నిన్నిటకుం దోడితెచ్చితివి. అనుచుండునంతలో నొకభయంకరాకారముగలపక్షి పోవుచుండెను. మహాపురుషా! యదేమి జంతువు? భయమగుచున్నదంటిని. శ్యామసుందరమూర్తి నవ్వి వత్సా! పురాణములఁ జదివితినంటివే. దీని నెఱుంగవా యని ప్రశ్నించెను. బదులిడఁజాలక యూరకుంటిని. నాశంక నెఱింగి యిట్లు పలికెను.

బాలకా! ఇదియే గండభేరుండ మనుపక్షి. పక్షిజాతులయందింత క్రూరస్వభావముగలది వేఱొకఁడు లేదు. ఇది సదా హింసాకర్మమున జీవింపఁగోరును. ఎట్టిమృగమునైన నిది కాళ్ల సందున నిమిడించుకొని సులభముగాఁ బోవును. దానిపాద తాడనమున మృగదేహము రెండగును. ఇది 'వచ్చువేగమునకే వ్యాఘ్రాదిజంతువులు తూలి యొకయోజనదూరమునఁబడును.

మంచియేనుగులు దీనిగాలి సోఁకినంతన వృక్షమూలములం
బరుండును. వృక్షచ్ఛాయ నున్న నిది రాదని వానిభావము.
అనావరణస్థలముల నున్నచో నీగండభేరుండము గజమును
గాళ్లందన్ని కొనిపోవును. ఏనుగును దన్ని మోచికొనిపోవఁ
గలదా యని సంశయింపకుము. దీనియాకారము భద్రజాతి
గజరాజమునకన్న నాఱింత లుండును. పక్షము లిరువదిబాహు
వులవిశాలము గలిగి బలిష్ఠములై యుండును. ఆపక్షవాతము
నకుఁ జిక్కిన యేజంతువైనను నిలువఁజాలదు. దానింబరిశీలింపుము.
గున్నయేనుఁగును జంపికొని పోవుచున్నది. ఒక్కదినము
కడుపార భుజించిన నిది పదిదినములదనుక నాహారమును
గోరక సుఖముగాఁ దనయావాసమున నుండును. మిక్కిలి
భుజించినచో నిరువదిదినములు వెలుపలికి రాఁగోరదు. ఇది
వృక్షములనుండుపక్షి కాదు. గుహాంగణముల నివసించును.
ఇంతజంతువునకు సర్పమువలన భీతి మెండుగ నుండునట్లు విధి
కలదు. అజగరముల నిది లెక్కింపదు. సామాన్య సర్పములం
గాంచిన నిది వణఁకుచుఁ బాఱిపోవును. అవి గుహాంగణమున
నిది శయనించియుండుతఱి దీనికర్ణవివరమును జొచ్చి యందుఁ
గల మృదుపదార్థమును దినును. ఆబాధ కది తాళఁజాలక
మృతినొందును. కావుననే సర్పములంగాంచిన నిది భయం
పడును. ఇది యుండుతావునను దట్టముగా మంచు గప్పి
యుండును. ఆచోటికి సర్పములు పోఁజాలవని దీనివిశ్వాసము.
గండభేరుండము పేరువిన్న సింహములు శరభములు గడగడ
వడఁకును. కాని సాళువము దీని నవలీలంజంపును. అది యింత
పెద్దపక్షి కాదు. కాని వజ్రతుండమున దీనిం బొడుచును.

ఆజాతి యీభాగమున లేదు. ముందు చూడఁగలవు. అని పలికి మఱియు నిట్లు పల్కెను.

## సిద్ధాశ్రమము

ఇఁక జూడఁ దగినయాశ్రమమునకుం బోవుదము. అని కొంతదూరము నడచి నన్నుంజూచి వత్సా ! ఈసానుమూలమున నల్లదిగో, గండశిల కనఁబడుచున్నదికదా అచ్చటికిం బోయినచోఁ జిన్నిద్వారమొకఁడు కనఁబడును. దానింజొరుము. ఆవల నాశ్రమము తోఁచు. నిశ్చయముగా నరుగుమని వీఁపు తట్టఁగా భయమనునది నామది నుండి పరుగిడెను. ఇఁక నేజంకు లేక యరిగెదనని సెలవంది వెడలుచుండఁగా నాపరమపురుషుఁడు నీవెప్పుడు స్మరింతువో యప్పుడే కనఁబడుదునని యభయప్రదానమున నన్నలరింప నేనాచోటికింబోయితి. అందు గండశిల ఛత్రాకారముగనుండెను. దాని క్రింద వేయిమంది నిలువవచ్చును. దానియందుత్తరభాగమున నొకవివరము గనఁబడెను. చీఁకటిగా నుండెనుగాని మనుష్యుఁడు వంగిపోఁదగినంత మాత్రమంతర మందుఁగలదు. శ్యామసుందరుని మదినుంచుకొని నిశ్చయముగ నే ప్రవేశింపఁజాలితి కాని ప్రవేశించునపుడు సర్పములు మృగము లున్ననాపని యేమగునా యను శంకమాత్రము కలుగకపోలేదు. ఏమో మొండిధైర్యముచేసి ప్రవేశించితిని. నాలుగుమూరలుపోవునప్పటి కందు వెలుతురు కనఁబడియెను. బాలమూర్తిధరుఁడు చెప్పినట్లే కొలఁదియడుగులు పెట్టుదుగదా యాశ్రమమే గోచరించెను. ఆశ్రమమనఁగా నంతకుముందుఁ జూచినట్లుగాక సమీపముననే శిలాధఃప్రదేశము. అదియే యాశ్రమమని నాకుం దోఁచెను. ఆభాగ

మున కించుకసమీపమునకుంబోవ నందుఁగొందఱు కూరుచుండి పరస్పరము మాటలాడుజాడ కనఁబడియెను. మఱింత సమీపించితిని. వారు నన్నుంగని యేమో చెప్పుకొన్నయట్లుండెను. సాష్టాంగనమస్కారమందుండియే యాచరించితి. నాగోత్రసూత్రముల వినిపించితిని. రావచ్చునన్నమాట వినఁబడియెను. చెంతకుంబోయితి. వారాఱుగురుమునులు. ఇరువురువృద్ధులు. మువ్వురు విగళితవయస్కులుగాఁ దోఁచిరిగాని యంత ముదుసలు లనవలనుపడదు. ఒక్కరుమాత్రము తరుణవయస్ఫురితులు. ఇట్లాయాఱుగురు నాకు నేత్రపర్వ మొనరించిరి. వారిని దర్శించినంతనే నాకెంతో యానందము భక్తియుఁ దోఁచెను. మరల నమస్కరించితి. వారియనుమతిచేఁ గూరుచుంటిని. ఆసనమొకటి యుండెను. దానిమీఁదనే కూరుచుంటిని. ఆయాసనము నే నెఱుంగనియాకులతోడనో యొకవిధమగునారతోనో యల్లినట్లగపడియెను. దర్భాసనముమాత్రము కాదు. దానిపైఁగూరుచుండఁగా నాగమనకారణం బేమని యొకముని ప్రశ్నించెను. దర్శనమునఁ బావనమతి నగుటకు మహాత్మప్రేరితుఁడనై వచ్చితి నంటిని. ముదుసలిముని వత్సా! ఎఱుంగుదు నీయాగమనకారణమును. మహాపురుషప్రేరితుఁడ వనియు నెఱుంగుదు. చాల సంతోషము. వినఁగోరినవిషయమును దెల్పుము. అనఁగా నేను ప్రాంజలినై మహామునులనామధేయములను వినఁగోరెదను. ఈయాశ్రమనామమును వినఁ గుతూహలము గలదు. ఇవేల యనిభావింపక నాపైఁగలపుత్త్రవాత్సల్యమునఁ దెలుప వేఁడుచున్నాఁడను. అనుటయు నావృద్ధతపస్వి యించుక యోచించెను. ఆకసమువంక దృష్టి నిగిడించెను. మరల నన్నుం

జూచెను. మరలఁ దక్కినమునులంగాంచెను. మరల నాకస
మును గనుఁగొనియెను. వారును వృద్ధమునిని గనుఁగొనిరి.
ఏమో మాటలాడుకొనిరి. ఆభాష గీర్వాణభాష మాత్రము
కాదు. ప్రాకృతము కాదు. సంస్కృతభాషను బోలియుండెను.
కొలఁదిక్షణములకు వృద్ధమహర్షి ననుఁగాంచెను. ప్రసన్న
ముఖుఁడైనట్లు నాకుఁదోఁచెను. అది యాలోచనమునకుఫలము
కాఁబోలు.

వత్సా! చక్కనిప్రశ్నము చేసితివి? కాని మానామ
ధేయశ్రవణమునఁ గలుగుఫలమేమియో తెలియకున్నది. నీవు
చేయఁబోవుప్రశ్నముల కదిముఖ్యమనియుఁ దోఁచెను. కాన
వచించెద. ఇది సిద్ధాశ్రమము. పూర్వ మిందే శంకరుఁడు తప
స్సొనరించెను. కామదహన మిందే సాగెను. నాటంగోలె నిది
సిద్ధాశ్రమనామమునఁ బ్రసిద్ధమయ్యెను. మహాత్ము లెందఱో
తపంబొనరించి సిద్ధిపొందిరనువిశ్వాసమున మేమందఱ మిటఁ
జేరితిమి. భగవంతు నారాధించుచున్నవారము. శంకరాజ్ఞ
చేతఁ గాఁబోలు కందమూలాదు లిందు సమృద్ధిగా నుండును.
ద్వంద్వబాధ లిందుఁ బొడసూపవు. తుహినబాధయు లేదనియే
నమ్ముము. నాత్యుష్ణముగను, నాతిశీతముగ నీయాశ్రమభాగ
ముండును. దేవతార్చనము నిమిత్తము పరిమళవంతములు
పరమపావనములు నగుసుమము లిందెల్లకాల ముండును.
చెంతనే మందాకినీశాఖ ప్రవహించుచుండును. ఆశ్రమము
దాఁటి యేకార్యమునకును మేమావలఁ బోవనక్కఱయుండదు.
పుణ్యాశ్రమాంతరదర్శనాపేక్ష గలిగెనేని పోవుదుము
అంతియగాని మాకుఁ గావలసినవస్తువులకొఱకుఁ బోవనక్కఱ

లేదు.ఇది యీయాశ్రమచరిత్రము. ఇందుండుమా పేరులు మునులని తెలిసికొనుట చాలదా. మాపేరులు విన్నఁ గలుగు లాభమేదియో గోచరింపకయున్నది ? మహాపురుషానుమతుఁ డవుకావునఁ జెప్పెదను. నన్నెల్లవారు మైత్రేయుఁ డందురు. ఈతఁ డుద్ధవుఁడు. ఆముని గార్గి. ఆవలిముని శమీకుఁడు. తరువాతితపస్వి జాబాలి. వారికవ్వలఁగూరుచున్న యాావటువు శృంగి.ఇవియే నామధేయములు. ఇంక నేమి వినఁగోరెదవు? అన నానందాశ్రువులు వెల్లిగొన నిట్టులు విన్నవించితిని. మహాత్ము లారా ! మీనామధేయశ్రవణమున నాశ్రవణములే కాక యితరేంద్రియములును ధన్యము లయ్యెను. నాజన్మము కృత కృత్య మయ్యెను. నాపుణ్యములు ఫలించినవి. సకలవ్రతదానము లొనరించితినని స్పష్టమయ్యెను.

శ్లో. "న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అన్నయభియుక్తోక్తి నమ్మియున్నాఁడ. కావున మహాత్ములరగు మిము దర్శింపనోచితి. నాయొనరించినపాపములు భస్మములయ్యె నని నమ్ముచున్నాఁడను. భక్తి నామది నిఁకఁ బాదుకొనునని తలంచెదను. మునీంద్రులారా ! భాగవతాదిపురాణవర్ణనము లందుఁ దమనామధేయములఁ జదివితిని. పూర్వపుణ్యవశమున నిపుడు సందర్శించితిని. నామనస్సందేహములు తొలఁగు కాలము వచ్చినది. శిష్యుఁ డింక నొక్కమాఱు ప్రశ్నింపవేడుక పడియెడు. సెలవైనఁ బ్రశ్నించు నంటిని. ప్రసన్నవదను లై యట్లే యడుగవచ్చు ననిరి. ప్రాంజలి నై ధన్యమతులారా ! తమరెల్లరిచ్చటి కరుదెంచి యెంతకాలమయ్యె. అంతకుముం

చెందు నివసించి యేభూభాగము కృతపుణ్యముగాఁజేయు చుంటిరి ? ఆఱుగురొక్కపర్యాయమే వచ్చితిరా ? అపుడపుడు వచ్చితిరా ? అను నీవాక్యములు ముగియకముందే మైత్రేయ ముని వత్సా ! విన వేడుకపడుచున్నాఁడవు. దీని నెఱుంగుటచేఁ గల్గులాభము తెలియఁబడదు. ఐన నుత్తర మిచ్చెదను. అవ ధానమున వినుము. ద్వాపరాంతమున శ్రీకృష్ణనిర్యాణ మున కించుకముందే నేను హిమాలయమున కేతెంచితిని. నీవింతకుముందే చూచియున్న యాశ్రమమునఁ గొన్నిదినము లుంటిని. ఉద్ధవుఁడు మఱి కొలఁదివత్సరముల కరుదెంచెను. గార్గియు జాబాలియు నాకంటె ముందే యిందుఁ జేరి తపస్సు చేయుచుండిరి. కృష్ణనిర్యాణానంతరమునఁ గొలఁదివత్సరము లకు శమీకముని తనయుఁడగు శృంగిని గూడి వచ్చెను. ఇయ్యాశ్రమమున నింకను గొందఱు మునులు గలరు. వారం దందు వృక్షమూలముల వసియించి యున్నవారు. ఈయాశ్ర మము వర్తులముగాగణించిన నొకయోజనము గలదు. ఎందఱో మునివర్యులీసిద్ధాశ్రమమున నున్నవారు. వారిపేరులు నాకును దెలియవు. ఇదియ మాయందఱయుదంతము. నీమది తృప్తి నొందినదా. వత్సా ! ఏల యింతయాసక్తితో నడిగితివో మా యుదంతము నాలకించునపుడు బాష్పముల వదలుచున్నవాఁ డవో వచింపుము. అని పరమాదరమున నడిగెను.

ఆమహామునియాదరంబునకు సంతసించుచు నిట్లు విన్న వించితిని. పరమపావనము మీవృత్తాంతము. ఇది వినుటకంటెఁ బుణ్యకార్యము వేఱొండు లేదని నావిశ్వాసము. కృతార్థుఁడ నగుట కిదియే నాకుంజాలును. ఒక్కవిన్నపముగలదు. దానికి

నుత్తర మనుగ్రహించి యీవీను నుద్ధరింపుఁడు. సెలవే యని విన్నవించితిని. నాయనా! అడుగుము. తెలిసినవిషయమును దాఁపక చెప్పెదను. అని యాదరము మీఱంబలికెను. మహాత్మా! ఈప్రశ్నమునకు ఫలమేమని యాలోచింపకుఁడు. పామరుఁడను గాన నడుగుచున్నాఁడను. పరీక్షిత్తును శపించినదిశృంగిమహా ఋషియే కదా. శమీకముని నాఁడు పరీక్షిత్తువైచినసర్పశవమును మోయుచు నారాజేంద్రునిపై నీసువూనని మహాత్ముఁడీయనయే కదా అని వేడితి. నవ్వుచు నౌనని బదులు చెప్పెను.

ప్రశ్నము—బాలుఁడగుశృంగి రాజును శపించినట్లు.

శ్లో. "తస్య పుత్రోఽతితేజస్వీ విహరన్ బాలకార్భకైః,
రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా తత్రేదమబ్రవీత్.
అహో అధర్మః పాపానాం పీవ్నాం బలిభుజామివ,
స్వామిన్యఘం యద్దాసానాం ద్వారపానాం శునామివ. 33
బ్రాహ్మణైః క్షత్రబంధుర్హి గృహపాలో నిరూపితః,
స కథం తద్గృహే ద్వార్థస్సభాండం భోక్తుమర్హతి. 34
కృష్ణే గతే భగవతి శాస్తర్యుత్పథగామినామ్,
తద్భిన్నసేతూనద్యాహం శాస్మి పశ్యత మే బలమ్. 35
ఇత్యుక్త్వా రోషతామ్రాక్షో వయస్యానృషిబాలకః,
కౌశిక్యాప ఉపస్పృశ్య వాగ్వజ్రం విససర్జ హ. 36
తతో లంఘితమర్యాదం తక్షకస్సప్తమేఽహని,
ధక్ష్యతి స్మ కులాంగారం చోదితో మే తతద్రుహమ్. 37
తతోఽభ్యేత్యాశ్రమం బాలో గళే సర్పకళేబరమ్,
పితరం వీక్ష్య దుఃఖార్తో ముక్తకంఠో రురోద హ." 38

అను నీ శ్లోకములుమూలమునఁ గనఁబడియెడిని. 'గ్రహణధారణ పటుర్బాలః" అను నియమము ననుసరించినను బండ్రెండువత్సర ములకంటె మించియుండవనుట విరసోక్తి కాదు. ఇపుడు ముప్పది వత్సరములవయస్సుగలవాఁడుగాఁ గనఁబడియెడిని. ఐదువేల వత్సరములు దాఁటినవి. ఇది యెట్లు పొసఁగునా యనుశంక యజ్ఞానమునఁ గలిగి బాధించెడిని. దీనిందీర్చి నన్నను గ్రహింపుఁ డని ప్రార్థించెదను.

ఉత్తరము—మునిమునినప్పులు గనంబడుచుండఁగా వత్సా! తంత్రములంజదివితివికదా. ఘుటికాసిద్ధి, పాదుకాసిద్ధి, అంజన సిద్ధి యను నీమొదలగుసిద్ధు లున్నట్లు తెలియదా. జరా వ్యాధులు బాధింపకయుండ మూలికాప్రభావమున మును లుందురు. యోగాభ్యాసప్రభావమున నందును లంబికాది యోగాభ్యాసమున దీర్ఘకాలము జీవింపఁగలుగుదురు. ఈ శృంగి బ్రహ్మచారి. విశేషించి యోగాభ్యాసనిరతుఁడు. జితేంద్రియుఁడు. కావున నిర్జరులవలె నుండుట గొప్పది కాదు. అదియు నొకవాంఛయే కావున నేవాంఛలు లేని మాబోంట్లకు వ్యాధిభయము కల్గదు. గాన జర ప్రవే శించెను. అదియుఁ దొలఁగవలెనన్న నోషధిప్రభావమునఁ దొలఁగును.

ప్ర—స్వామీ! దానిని దొలఁగించుకొనిన యోగాభ్యాసమున కనువగుమార్గ ముండునుగదా. ఇదియు సద్వాంఛయేకదా. అంటిని.

ఉత్త—సద్వాంఛయేగాని జరవలన నేబాధలు మాకుం గన్పడ లేదు. యోగమునకది యంతరాయమును గల్పింపఁజాలదు.

చిరంతనాభ్యాసవశమున నింద్రియములు స్వాధీనమున నున్నవి.

ప్ర—మహాత్మా! భారతభూమిని వీడి యిట నుండఁ గారణ మెఱుంగఁజాలను. ఆశ్రమప్రభావమున మీకుఁ గల్గఁదగిన ఫల మేదియో యెఱుంగను. సిద్ధసంకల్పులుకదా మీరు. తమ సన్నిధానప్రభావమునఁ బామరులు జ్ఞానులు కా నవ కాశము గల్గును. అధర్మము జంకుచుఁ బావనస్థలములఁ బ్రవేశింపకుండును. ధర్మరక్షణ మందఱకుం గర్తవ్యముకదా. ఆపనిమాని యిందుండుటకుఁ గతమేమో?

ఉత్త—వత్సా! ఇంచుక వచించెదను. ఇపుడు భారతభూభాగ మున భగవత్సన్నిధానము స్వల్పము. యుగము కలినామ కము. దానిమహిమ కొన్ని దినములు సాగవలయును. దాని కడ్డుపడరాదు. అధర్మము ముదురుచుండ నడ్డుట కొకభగ వంతునకు సామర్థ్యము కలదు. కాని యితరులకు లేదు. పాపలోకముల నుండఁదగుజీవులు పెక్కుమంది పుట్టిరి. పుట్టు చున్నారు, పుట్టఁగలరు. వారికర్మానుభవముల మాన్పఁ జాలువాఁడు లేఁడు. కర్మానుభవము తప్పదనునది భగవదాజ్ఞ. దానిని దలఁదాల్పవలయును. మావంటివారితపశ్శక్తి యధ ర్మము నెల్లయెడల నడంపఁజాలదు. సహస్రసంఖ్యాకులు మునులుచేరినను గలిధర్మములఁ దొలఁగింప సమర్థులు కారు. మును లాకార్యము నేల చేయరాదనుశంక నొందకుము. సాగవలసినవి సాగకపోవునా యని తలంచి యుద్యోగమును మానుము.

ప్ర—కలియుగమున నైదువేలయేండ్లకు మరలఁ గృతయుగ ధర్మములు నడచుననియు నది యైదువేలేండ్లుండి త్రేతాయుగ ధర్మములు సాగ నవకాశ మొసఁగుననియు నవియు నైదు వేలయేండ్లుండి ద్వాపరయుగధర్మములు నడవ నవకాశ మొసంగుననియు నిట్లే రథచక్రమువలెఁ గాలము తద్ధర్మములు మాఱుచుండుననియుఁ గలిధర్మములే సర్వకాలము నిలువవనియు నాహేతువుసుబట్టి యైదువేలేండ్లు మిాఱినవి కావున నికఁ గృతయుగధర్మము లారంభించుననియుఁ గొందఱు పల్కుదురు. ఇదియంతయు సత్యమా? కొంత మాత్రము సత్యమా? అంతయు నసత్యమా?

ఉత్త—నవ్వుచు బాలకా! నీప్రశ్నమునకు నుత్తరము చెప్పుటకు ముందే యొకప్రశ్నము చేసెద. బదులిడుము. అనఁగాఁ జిత్తమంటిని. అయిదువేలయేండ్లు దాటి కొలఁదివత్సరము లయ్యెఁగదా. తపస్సెట్లున్నది? వాక్కులయందును బుస్తక ములయందు నాట్యమాడుచున్నది. అడవులనుండి యాశ్రమ ములు గల్పించుకొని యందు నివసించువా రెందఱున్నారు! అటవీపాలకోద్యోగులు తప్పటులు నున్నవారు. నాల్గుజాతుల వారును గ్రామములలో నగరములలో హాయిగా నున్నవారు. ఆయుద్యోగులలోమాత్రము కొందఱుబ్రాహ్మణులున్నవారు. నిత్యకృత్యములనంబడుప్రాతస్స్నానాదికము లెట్లున్నవి? ప్రాత స్స్నానముచేయువా రంపందు యోగదృష్టిం గాంచినఁ గనం బడుదురు. వారిలో ఫలాహారార్థము కొందఱు స్నానము చేయుదురు. మిగిలినవారిలోఁ గొందఱు సంధ్యావందనము

చేయుదురు. అందును గొందఱు మాత్రమే గాయత్రీ జపము చేయుదురు. వారిలోను గొందఱకుమాత్రమే గాయత్రి చక్కఁగా నుచ్చరింప ననువైయుండు. భస్మధారణము చేయు వారు వారిలోఁ గొలఁదిసంఖ్యగలవారే యంటిని.

అందుల కాముని యచ్చెరువంది నిట్టూర్పులు పుచ్చి ధ్యాననిష్ఠనుండి మరల నన్నుం జూచి ఇఁక బ్రహ్మయజ్ఞాదుల మాట యడగవలసిన యవసరమే కనఁబడదే. అనునంతలో మహాత్మా! బ్రహ్మయజ్ఞము పర్వములయందుఁ జేయువారుకూడఁ గలరు. శ్రాద్ధదినమునందును మానువారు కలరు. అదేదో గొడవ యని దాని నెఱుంగనివారు పెక్కుమంది గలరు. తక్కిన జ్యోతిష్టోమాదియజ్ఞములు కుండలధారణార్థము చేయువారు కొందఱును, వివాహాది శుభకార్యములయందు ద్విగుణతాంబూలార్థము చేయువారు కొందఱును, భగవత్ప్రీతిగా జేయువారు మిగులసంఖ్యాకులును గలరు. మఱియుఁ గాలము గడుచుకొలఁది యజ్ఞములు క్షీణించుచున్నవి. పంచమహాయజ్ఞముల వలన విఖ్యాతి రాఁజాలదు గాన నవి వదలఁబడుచున్నవి. అను నామాటలు కర్ణశూలములుగా నుండుటంబట్టి కాఁబోలు వానిని విన్నంతనే మోము వెలవెలఁబాఱఁగాఁ దోడి మౌనులం గాంచి వింటిరిగదా కలిప్రభావమును మనమనుకొనినటు లగుచున్నది. ముందేమి జరగనున్నదో చూచుచుందము. అని పలికి నన్నుం గాంచి యట్లు పలికెను.

ఉత్తమవత్సా! వినుము. పంచసహస్ర వర్షముల కొక్క పర్యాయము యుగధర్మములు మాఱుననునవి కపటోక్తులు. అందు సత్య మిసుమంతయు లేదు. కలియుగమునఁ గృతయుగధర్మములు

నడచుట కల్ల. క్రమముగా నధర్మము ధర్మమనఁబడుచు నదియల
వాటుపడి మానవుల కిది యధర్మమని తోఁపక యుండఁజేయుచుఁ
గాలము మార్పునొందినట్లు కనఁబఱచును. ధర్మము దాంభిక
మనియుఁ దోఁచునట్లు చేయును. భోజననియమము కూడదనియు,
నుపవాసములు నిరర్థకము లనియు వ్రతాదులు భోజనాతిశయ
మునకే యనియు స్నానము దేహ మలిననిర్మూలమునకే యనియు
నెల్లరకుఁ దోఁచునట్లు చేయును. అనియతభోజనమునఁ నపరిశుద్ధ
ఫలాదిభక్షణమున, నాచారవర్జనమున నారోగ్యము చెడియా
యుస్సు నశించును. కలియుగమునఁ గొంతకాలముజరఁగఁగా
నాయువు తగ్గుచువచ్చి వచ్చి పదాఱు వత్సరము లగును. ఆ
పదాఱువత్సరములును జీవించువారు కొందఱే యుందురు. సర్వ
కష్టసుఖముల నాయత్యల్పకాలమునందే యనుభవించి వేసరువారు
కొందరు. ఒక్కయుగమున నితరయుగధర్మము నారంభవిరామ
సంధికాలములయం దించుక గానంబడును గాని విశేషించి
కనఁబడవు. కృతయుగధర్మములు నడచినచో నాల్గువందల
వత్సరము లాయుస్సుండవలయుఁ గదా. అట్టిమాటలు నమ్మ
రాదు. కలియుగమున వర్ణాశ్రమధర్మములు శూన్యప్రాయము
లగుననిపురాణము లెన్నివత్సరములకుముందో చెప్పలేదా.
వానిని నాదరమున జూడనికతమున నిట్టిశంకలు గల్గును.
అల్పమతులు గురువులై సర్వజ్ఞత్వమును వహింతురని పురాణ
ములయం దుండలేదా. అదేరీతిగా నిపుడు సాగుచుండ నేల
వానిని నమ్మరాదు? అట్లు నమ్మక యుండఁ జేయునది కలి
కాలమున విఱ్ఱవీఁగునధర్మమే గాని వేఱొండు గాదు.

వంచకులు త్రికాలవేత్తలగుదురు? వారినే యెల్లవారు గురు
వులని పూజింతురు. తెలియనివిషయములఁ దెలిసినచందమున
నుపన్యసింతురు. వానిని విని యెల్లవారు నమ్ముదురు.
పెక్కండ్రు మతస్థాపకు లగుదురు. వారికి శిష్యులు పెక్కండ్రుం
దురు. అనధికారులు శ్రుతులం బఠింతురు. కాని తత్ఫ
లము దుష్ఫలముగాఁ బరిణమించును. శాపానుగ్రహ
సామర్థ్య మడుగంటును. వంచనసేయు సామర్థ్యము
వెల్లివిరియును. ధర్మకార్యసమాచరణము నశించును. ధర్మ
కార్యనిరతి యుపన్యాసములయందు మాత్రము నటిం
చును. సత్యము మర్యాద లేక యుండును. అసత్యము
గౌరవమును గాంచి యిల వెలయును. స్త్రీలమర్యాద లోక
విధముగా మాఱియుండును. వారి ప్రాచీనమర్యాద గౌర
వమునకు దూరమగును. స్త్రీపురుషుల కన్యోన్యసంగతి
హెచ్చును. అది లోకమునకు మహోపకారివలెనియుఁ దోఁచును.
పరస్పరవంచనాది కార్యములు స్వభావము లగును. కపట
స్నేహము పెచ్చుపెరుగును. నిష్కపటమైత్రి యొకానొకచోఁ
గనఁబడుచు నదృశ్యమగుచు విద్యుల్లతికవలె నుండును. ఆత్మ
స్తుతిపరాయణత్వ మధికమగును. పరస్తుతి కార్యానుసార
ముగ నుండును. పరనింద యెల్లరకు కలపాటగును. ముఖస్త
వముసర్వసామాన్య మగును. పరోక్షస్తుతి యరుదగును.
వర్ణాశ్రమధర్మాభిమానము నామమాత్రముగ నుండును.
వర్ణాశ్రమ ధర్మదూషణము వృద్ధినొందును. లోకవంచకులు
మెండుగ నుందురు. లోకోపకారతత్పరులు మిగుల నరు
దుగ నుందురు. ఇట్లు వివరింపఁబూనిన నింక నెన్నియో

విషయములు గలవు. వానినన్నింటిని బేర్కొన నిప్పు డవ
కాశము చాలదు. అని మహానివర్యుఁ డూరకుండెను. ఆ
వాక్కులకెంతయు నచ్చెరువందుచు మరల నిట్లు ప్రశ్నించితి.

ప్ర—మహాత్మా! సంశయింపక యడుగునంత చనవిచ్చితిరి. కానఁ
బ్రశ్నించుచున్నాఁడను. మతధర్మములు పాటింపఁదగవనియు,
నవి తెలివితక్కువచేఁ గల్పింపఁబడినవనియు, వానినడంగ
ద్రొక్కఁగాని వాస్తవమగుజ్ఞాన ముదయింపదనియు, మత
ధర్మములనునవి మానవునియభివృద్ధికి భంగకరములనియు,
నెంతవేగమున వాని నశింపఁజేసిన నంత వేగముగా విజ్ఞానము
పొడసూపుననియు, నామహాకార్యమున కెల్లరుఁ బ్రయత్నింప
వలయుననియుఁగొందఱు పలుకుదురు. ఇది సత్యమా! లేక
తెలివితక్కువ ప్రసంగమా? మఱియు,

శ్లో. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్."

అను మహాభారతాంతర్గత భగవద్గీతావాక్యము నుదహ
రించుచు నీచాతుర్వర్ణ్యము గుణకర్మవిభాగమునుబట్టి వచ్చు
చుండునుగాన శూద్రుఁడైనను వేదాభ్యాస మొనరించిన
సద్బ్రాహ్మణుఁ డగుననియు, బ్రాహ్మణుఁడు నీచకార్యరతుఁడైన
శూద్రునికంటె హీనుఁ డగుననియుఁ గావునఁ బూర్వకల్పితవర్ణ
ములు మార్పునొందఁ దగుననియు భగవత్కారుణ కెల్లవారును
పాత్రులే యనియుఁ బలుకుదురు. ఇందలియాథార్థ్యమును సెల
వీయఁ బ్రార్థించెదను. పైసిద్ధాంతముక్రొత్తదిగాన దానిననుసరించి
నచోఁ దండ్రి శూద్రుఁడుగను కుమారుఁడు బ్రాహ్మణుఁడుగను
గావచ్చును. కొంతకాలమున కాతనిగుణములను గర్మములను

బట్టి వేఱొకకులమునకుఁ జేరవచ్చును. ఒక్కమనుష్యుని జీవిత మునందొక్కడే బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను నాలుగుజాతుల యందును జేరి యెన్నియోపర్యాయములు మాఱ్పునొందు చుండవచ్చును. కావున జాతిమతములు నీటిబుగ్గలవలెఁ బ్రతిక్షణ మున నడంగవచ్చును. ఈవిషయమున మీభావము నెఱుంగఁ గోరుచున్నాఁడను. మిమ్మే ప్రశ్నించి యీవిషయమును దెలిసి కొనుటకుం గలకారణమును బిదప విన్నవించెదను. శిష్యరక్షణ బద్ధదీక్షులు గావున మీరీవిషయమును దెలిపి నన్నుం గృత కృత్యుని జేయుదురని నమ్మియున్నాఁడను.

అను నీనాప్రశ్నము ముగియఁగనే యామైత్రేయమహా ముని జొటజొటఁ గన్నీరు ప్రవహించుచుండఁగాఁ గొంతసే పూరకుండి ధ్యానస్తిమితలోచనుఁడై కన్నులువిప్పి నిట్టూర్పులు పలుసారులు పుచ్చి దీర్ఘముగ యోజించెను. అత్తఱి నాకించుక భయము తోఁచెను. విషాదకరమగు నీప్రశ్నము నేల చేసితి ననియే యాభయము. దాన నొడలు వడంకెను. మాటవెడల నంతగా నాకంపము మాఱెను. అద్దానిని గ్రహించి యాముని వరుఁడు వత్సా! భయంపడకుము. నీప్రశ్నము నాకు విచారము గల్గించెననియూహించి భయంపడ నవసరములేదు. నీప్రశ్నము సమంజసమే. నాచింతదానఁగాదు. కాలవిపరిణామమునుగూర్చియే యని నిశ్చయింపుము. ప్రతిక్షణము వంశములు వృత్తులు మాఱుచుండుననుటకన్న దుష్కాలపరిణామ మింకేమిగలదు? భగవంతుఁడిట్లు చెప్పెనను వారుండుకాలమునకంటెఁ గలికాలము వేఱొండుగలదా? కలికాలమెంత విచ్చలవిడిఁ బరుగిడుచున్నది! ధర్మభీతి నెంతవేగముగ నెడఁబాసెను! అని యించుకసే పూర

కుంచి నన్నుం దిలకించి వత్సా! కాలత్రయమును బరిశీలించి యాయాయి ప్రాణికోటి కాయాకులములు వృత్తులు కర్మాను సారము విభజించితినని భగవంతునియాశయమని గీతావాక్యము తెల్పును. ఆయాకాలానుసారము మార్చుకొనుడని శ్రీకృష్ణుడు వచింపలేదు. "తస్య కర్తారమపి మామ్" అనియెడు నుత్తర వాక్యము తెల్పున దిదియే. సంసారమునకు లోబడితివని యర్జునుడు ప్రశ్నించునేమోయని "విద్ధ్యకర్తార మవ్యయమ్" సగుణబ్రహ్మత్వముననను నిర్గుణబ్రహ్మత్వము నంగీకరించువాడను నేనే యని యాశ్లోకచతుర్థపాదము బోధించును. ఏయేజాతుల నెట్టియెట్టి వారు జనించి యాయాజాతిధర్మముల నభివృద్ధి చేయుదురో నశింపజేయుదురో వారెల్ల నాజాతి గౌరవా గౌరవములకుఁ బాత్రు లగుదురు. పతితులైనచో నరకప్రాప్తు లగుదురు. వజ్రమనుమణియందు నించుకగనో గొప్పగనో మచ్చగలిగిన నంపది యల్పమని తెల్పునేకాని జాతిని మార్పఁ జాలనట్లు బ్రాహ్మణుడు మఱియొకజాతిధర్మముల నాచరించి తనధర్మముల వదలినపుడు తత్పాపవశమునఁ దిర్యగ్యోనుల యందు సంభవము గాంచును. అంతియగాని తావన్మాత్రమున వర్ణాంతరుఁ డనఁబడఁడు. అట్లుచెప్పుట న్యాయము కాదు. ఆజాతిబ్రువుఁ డనఁబడునని యెఱుంగుము. వత్సా! భగవద్గీతలు ప్రమాణములని యంగీకరించువా రింకను గలరని నీప్రశ్న మూలమున నెఱింగితిని. అటు లైనచో

శ్లో. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవినిర్ణయే,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అను నీయది భగవద్గీతావాక్యమే కదా. దీనికేమి సమాధానము చెప్పెదరు ? స్మృతిశాస్త్రముననుసరించి కర్మముల నాచరింప వలయునని భగవంతుఁడు విధించెను. వానిని దృణీకరించిన వారు గీతావాక్యములను దృణీకరింతురనుట కేమిసంశయము? దీనింబట్టి భగవద్గీతలఁ గాలక్షేపమున కుపయోగింతురనియుఁ దదుక్తధర్మాచరణము లేదనియు నిశ్చయింపవలెను. అట్టివారికి గులము లేల ? ఆచారము లేల ? భగవంతుఁడేల ? కలికాలమునే యాశ్రయింతురుగాక. త్రికాలవేత్తలగుమహాత్ములు మతధర్మముల నేర్పఱచిరి. అవి తెలివితక్కువచేఁ గల్పింపఁబడిన వను వారుగలరే ? వానినడంగఁద్రొక్కినఁ గాని జ్ఞాన మునయింపదా? అదియా వాస్తవజ్ఞానము? మతధర్మములు మానవునియభివృద్ధికి భంగకరములా ? కటకటా ! ఎట్టిదుష్టవాక్యము వినవలసి వచ్చినది. అట్టివాక్కుల నాచరించువారు పెక్కండ్రుండుదురు గాక. కలికాలమున నిచ్ఛానుసార మధర్మము వ్యాపించుఁగాక. ఈశ్వరేచ్ఛ యదియే యగు. నిర్మలబీజముల భావిప్రజార్థము భగవంతుఁడు పరికించుఁగాక. వేదశాస్త్రప్రమాణబుద్ధులు కొంద ఱుండినను జాలును. ఇంతియు నీకిపుడు చెప్పందగు సమాధానము. అని యామహర్షి యేమో యోజించుచుండెను. నేనును జాలక్షణము లూరకుండి వారి కీప్రశ్నములవలన నసూయ కలుగలేదని నిశ్చయించి మరల నిట్లు పలికితిని.

మహాత్మా! మఱొక్కవిషయమును గూర్చి ప్రశ్నింప వేడుకపడుచున్నాఁడను. సెలవే విన్నవింతు. తమయమూల్య భగవదారాధనకాలమును వ్యర్థముచేయుచున్నాఁడని విసుగు

నొందరని నమ్మెదను. మీవంటినిర్మలస్వాంతులు నావంటియల్ప మతికి దొరకు టెట్లు?

అనునా ప్రార్థనము విని యించుక నవ్వి వత్సా! ఏల జంకుపడియెదవు? అడుగుము. కలియుగవార్తాశ్రవణమున నించుక యచ్చెరువు కలుగుచున్నది. నీ మదింగల శంకాలేశ ముఁ దీర్పఁబూనియే కాచియుంటిని. భగవదాజ్ఞ మెయి నీవరు దెంచితివి. కడుంగడు సంతోషించుచున్నాఁడను. అని యా మైత్రేయముని పలుకఁగా నిర్భయమున నిట్లు ప్రశ్నించితిని.

ప్ర—ఈప్రస్తావ మేలయని మాఱుపలుకక యీపాదసేవకుని ప్రార్థనముచు జెల్లింపుఁడు. కొందఱు వృద్ధులు తమరు మా దేశము నుద్ధరింప దయచేయుదురనియుఁ గ్రొత్తయాచార ములు నెలకొల్పి యెల్లరఁ బరిశుద్ధాత్ములనుగా నొనరింతు రనియుఁ బలుకుదురు. వీరభోజవసంతరాయలని తమకుఁ బేరుఁ గల్గునని కొందఱందురు. మఱికొందరు తమ రవత రించితి రందురు. ఇంకనుంగొందఱు తమరొక్కమహాత్మునియం దావేశింతు రందురు. అపుడు వర్ణాశ్రమధర్మములు బూటక ములని మీరుపదేశింతురనియు మఱికొందఱందురు. పెక్కండ్రు పెక్కురీతులఁ బలుకుచున్నారు. ఇందెంత మాత్రము సత్యముగలదు? తమ రింతవఱుక వర్ణాశ్రమధర్మ ములు తాఱుమాఱయ్యెనని నేఁ జెప్ప విని చింతించితిరి కదా. అట్టిమీరె ట్లుపన్యసించి యవి నిరర్థకములని నిరూ పింతురు? ఈ సంశయముఁ దీర్చి నన్ననుగ్రహింపుఁడు. అని మఱియేమియుఁ బలుకక యూరకుంటిని. నాప్రశ్నము ముగి

యుట కించుకముందే మోమునఁ గ్రోధావిర్భావలక్షణ
ములు దోఁచెను. బొమ్మ లించుక ముడివడియెను. అధరము
కంపించెను. దేహమంతయు నించుక చలించినట్లే నామదికిఁ
దట్టెను. అత్తఱి నాకు స్వామీ! యీక్రోధము నన్నేమి
చేయునోకదా యనుశంక జనించెను. దాన బుద్ధితక్కువ
యగుటఁ బ్రశ్నించితినే. ఇఁకఁ జేయు నుపాయమేది? నాగతి
యేమగును? మహాశాంతాత్ముని మోమునఁ గోపలక్షణము
లగపడుచున్నవే! నన్ను రక్షించువారెవ్వరు? అను నూహ
కలుగఁగనే యెవ్వరో వీఁపును దట్టి భయంపడకుము అని
హెచ్చరించిన ట్లయ్యెను. వెనుకకు దృష్టిని బఱపితిని. కాని
యం దెవ్వరు కనఁబడలేదు. శ్యామసుందరమూర్తియే
యైయుండనోపునని నిశ్చయించి యాకస్మికముగా భీతి
తొలఁగి ధైర్యోత్సాహములు కలుగుట కానందించి యుత్త
రమునకై యెదురుచూచుచుంటిని. ముహూర్తమాత్రము
వారిమోమునుజూడక క్రిందుచూచుచుంటిని. తలయెత్తి
మైత్రేయుమోమును జూచితిని. అత్తఱి నేననుకొనినరీతి
మహత్తర కోపమాకృతిందాల్చినట్లు కనంబడియెను. కాని
యంతటి కోప మామోమునఁ దాండవమాడుచుండినను
నాకించుకంతయు భీతి కలుగకపోవుట భగవదనుగ్రహ
మనియే తలంచితిని. అంతలో నామైత్రేయునిమోము వింతగ
మారెను. సుముఖముగఁ దోఁచెను. ఇంక నాప్రశ్నమునకు
బదులు వచ్చునన్నయాశ జనించెను. ఇంచుకసేపు సమాహిత
చిత్తుఁడనై యుంటిని. అంత నామహర్షి నాపై దృష్టినిలిపి

ఉ_త్త—వత్సా! నీ ప్రశ్నము నాకత్యంతవిషాదమును గల్గించి నది. దాన నీపై నాకాగ్రహము లేదు. కాని లోకమున నెందఱు ధూర్తులు కలరు? వారి యసందర్భప్రలాపముల కర్థము గలదా? వారిమాటల నమ్మువారును బెక్కండ్రు కలరనుటయే విషాదమును గల్గించెను. కానిమ్ము. కలికాల మున నింకనిట్టి వెన్నియో జరగఁగలవు. ఎందఱెంద ఱవత రింతురో వచింపఁదరముకాదు. కలికాలప్రారంభముననే యిట్టులుండఁగా నిఁక నాకాలము నంతరమున నంతమున నెట్టివిచిత్రములు కలుగునో! ఇఁక నుత్తరమును వినుము. భగవంతుఁ డేయేకారణమున నేనవతరించును. లేక తనయంశ మునో, తదేకదేశమునో యొకరియందుఁ జేర్చును. పరశు రామవ్యాసాదులట్టియవతారపూరుషులే యని యెఱుం గుము. మేమన్ననో భగవత్పాదసేవకులము. తత్సేవచే నొక యానందముగలుగునని నమ్మియున్నవారము. ఒకప్పు డద్దాని ననుభవించుచుండుటయుఁ గలదు. ఎప్పుడే నొక్కక్షణకాల మాయానందము ననుభవించునదృష్టముకలదా యని యహో రాత్రములు పరాత్పరపాదారవిందముల ధ్యానించుచు నుందుము మే మవతరించుట యనఁగా నసంగతము కాక వేఱే మగును? సర్వదా యిది యనృతము. ఎవ్వరో ధూర్తులు కల్పించి గౌరవము నొందవలయునని ప్రవర్తింతురని తోఁచె డిని. ఇట్టి కల్పనల నమ్మకుము. నాయవతారకల్పనమున నేమేని సనాతనవర్ణాశ్రమధర్మములకు హాని కలిగినదా? తెలు పుము. విని విషాద మనుభవింతుము. అని యూరకుండెను.

నేను నామాటల కద్భుతంబందుచుఁ దెలిసినవిషయ
మును దాఁచిన శపించునేమోయన్న భీతిచే నిట్లు పలికితిని.
మహాత్మా! పరిశుద్ధచిత్తమున్నంజాలుననియుఁ, బ్రాఁతయాచార
ములు, యజ్ఞాదికర్మములు వదలవలయుననియు, దానిచే జగద్గురు
దర్శనమగుననియు ముక్తి గలుగుననియుఁ గొంద ఱుపదేశించు
చుండఁగా విన్నాఁడను. అనఁగనే మైత్రేయమహర్షి చెవులు
మూసికొని హరిహరీ! నాకేమి దుష్టగ్రహచారము పట్టినదో
తెలియదనుచుఁగన్నీరువదలెను. నేనేలయీమాటలుచెప్పితినని
నేనును విచారించితిని. కొలఁదినిమేషముల కాముని వాక్కు
లీట్లు వెడలెను. వత్సా! ఒకమాట చెప్పెద. చక్కఁగా నాలకిం
పుము. చిత్తము పరిశుద్ధముగా నుండవలయునన్న ననేకసత్కర్మ
ముల నాచరించుచు, యోగానుష్ఠానము చేయుచుఁ గర్మ
ఫలము నించుకంతయుఁ గోరక భగవత్పాదారవిందములకే
సమర్పించుచు ననేకజన్మముల నీరీతిగా నాచరించినఁ గాని
కలుగదు. స్వేచ్ఛగాఁ జరించుచు నిష్ఠాహారముల నియమము
లేక భుజించుచు నెల్లరతో సర్వదా మాటలాడుచు నుండు
వారి కా చిత్తశుద్ధి కలుగుననుమాట గగనకుసుమమే యని
నమ్ముము. శిష్యుల నభివృద్ధిచేసి దానఁ గీర్తి సంపాదింపఁ
గోరి తెలియనివిషయములఁ దెలిసినట్లుపన్యసించుచు నుండు
వారు దాంభికు లనఁబడుదురు. వారి కేవిషయము తెలి
యదు. జగద్వంచకులు. రామకృష్ణాద్యవతారలక్షణము లెట్టివో
పురాణములనుండి గ్రహించితివి కదా. వీరియం దాలక్ష
ణము లున్నవా? వేదములు ప్రమాణములు కావనువారు
నాస్తికప్రాయులుగాక మఱేమగుదురు? వారిమాటలనమ్మువారు

మఱెంత యజ్ఞానులు. ఒకప్పుడు వారిమాటలు నమ్మినను ఆవిశ్వాసము చిరకాలముండదు. క్షణభంగురమన్న నీతి కుదాహరణముగ నుండును. ఆయుపన్యాసములకుగాని వారియుపదేశములకుఁగాని మూల్యము శూన్యమే. కావున నట్టివారిమాటలను సాధువులు నమ్మరు. నమ్మువారే యధికసంఖ్యాకు లందువేని వారజ్ఞాన ప్రధానులు. మతతత్త్వము వా రెఱుంగరు. అట్టివారిసంఖ్య యెంతవృద్ధిగాంచిననేమి? వారెల్లఁ గలిపురుషాంశము గలవారే. కావున సనాతనధర్మము నశించునని భయంపడకుము. అది కాలానుసారము క్షీణించినట్లు కనఁబడినను మరల వృద్ధి నొందఁ గలదు. దాంభికుల మాటలకుఁ జెవియొగ్గకుము. స్వేచ్ఛా ప్రవర్తకులకు వేదమార్గములు గిట్టవు. అవి వారి స్వేచ్ఛనడ్డగింపఁ జూచును. కావున వారు బౌద్ధతుల్యులు. నాయవతారమని పల్కువారు వంచకులని తలంపుము. నే నెవ్వరియందు నావహింపఁజాలను. భగవత్పాదపద్మములయం దావహింప నాతలం పూహించుచున్నది. అది యెప్పుడగునో అపుడే కృతార్థుఁడ నగుదును. మహర్షులు లోకవ్యవహారములయందుఁ బాల్గొనరు. వారు నిస్సంగులుగా నుండఁగోరుదురు. నీప్రశ్నమునకు బదులు చెప్పితిని. మఱేమి వినఁగోరుదువు?

అని మైత్రేయుఁడు పలుక నాకచ్చెరువు చింతయుఁ గలిగెను. లోకమున నెందఱెన్ని వేషములఁ దాల్చుచున్నారన్న యూహా కలిగెను. అయిన నింకఁ బ్రశ్నింపకయుండుట మంచిది గాదనియుఁ దోఁచెను. వారికి నాయందుఁ గల వాత్సల్యము మఱెంత నన్నుఁ బ్రోత్సహించెను. ఇట్లు మరలఁ బ్రశ్నించితిని.

ప్ర—మైత్రేయమునీంద్రా! శ్రీమద్భాగవతమున విదురునకుఁ దమరు వర్ణాశ్రమధర్మములంగూర్చి యేమి యుపదేశించితిరి? ఆయుపదేశమునకు విరుద్ధముగాఁ గాలము మాఱినందున మీరు కాలానుసారము మాఱి వర్ణాశ్రమధర్మముల వదల వలయునని బోధించితిరని తెలుపుచున్నారు. ఇందలి యాథార్థ్యము నెఱుంగఁ గోరుచున్నాఁడను.

అనునామాటలు ముగియఁగనే యామైత్రేయముని నన్నుంగాంచి బాలకా! శ్రీమద్భాగవతమున విదురునకు నాకు సంవాదము గలదంటివే. దానిం జదివితివి. నే నేమని విదురునకుం జెప్పితినో యెఱింగితివికదా. వర్ణాశ్రమధర్మముల వదలవలయుననుటకం దేదా బాపము వేఱొక్కటి కలదా? అది నాస్తికులు పలుకుమాట. బదులు చెప్పెద వినుము.

ఉ—కర్మము లనేకప్రకారములు. అందఱు కన్నిరూపములు నవి ప్రతిఫలించుచుండును. సుఫలదుష్ఫలములు లందఱును సమాన ములు కావు. ఏయేధర్మముల నెవ్వరెవ్వ రాచరింప నర్హులో వారొనరించిననే యవి ఫలము నిచ్చును. రాజసింహాసనమున నితరులు కూరుచుండ రాజ్యలక్ష్మి వారికిం జేకూరునా? అట్లే వర్ణోచితకర్మములును నెఱుంగుము. స్వస్వ వర్ణోచితకృత్యములను భక్తిమై నొనరించినచో ఫలము సమానముగాఁ గల్గును. పౌండరీకము చేసిన విప్రునకు, ఖలయజ్ఞము భక్తిభావమునఁ జేసిన శూద్రునకు ఫలము సమానముగా స్వర్గమును లభించును. శూద్రుఁడు పౌండరీక మొనరించినను విప్రుఁడు ఖలయజ్ఞము సులభము [illegible] యాచరించినను ఫలము శూన్యము మాత్రమేగాక పాపః

ముగాఁ బరిణమించును. మంత్రసహితముగాఁ గర్మములు
చేసినవిప్రునకు, మంత్రరహితముగాఁ గర్మములఁ జేసిన
శూద్రునకు దేవతలు పితరులు సమానముగా దయచూపు
దురు. కావునఁ బక్షపాతము దేవపితృమునులకు లేదని
యెఱుంగుము. తారతమ్యము లేక లోకప్రవృత్తి సాగదు.
ఎల్లరు రాజులైనను, ఎల్లవారు సేవకులైనను రాజ్యపాలనము
సాగదు. రాజు సేవకుఁడు నను భేదమేలయుండవలయునని
ప్రశ్నింపరాదు. ఆప్రశ్నము తెలివితక్కువనే తెల్పును.
రాజసేవకులకు భేదము కల్పించినందున దేవతలు పక్షపాతము
గలవా రనరాదు. కర్మానుసారము మర్యాద కలుగుచుండును.
కొందఱు చిరకాలము జీవించుటయు మఱికొంద ఱల్పకాల
మున మరణించుట యేల యని ప్రశ్నించు టెట్టిదో యీ
ప్రశ్నము నట్టిదియే యగు. ఏకాలమునఁ గాని మానవులంద
ఱొక్కరీతిగా నుండరని నమ్ముము. దేవతలట్టివారే. సింహ
మున కేల యంతబల ముండవలయు? నక్కకేల యుండ
లేదు? అని ప్రశ్నించిన లాభమేమి? కర్మములు బహువిధము
లని, తమరు చేసికొన్నకర్మముల ననుసరించి జన్మముకలుగు
నని, ఆజన్మమునకుఁ దగినకర్మములనాచరించినను త్తమజన్మము
కలుగునని యెఱుంగవలయును. ఏజాతియందైన నుత్తమ
జ్ఞానముకలవారు ముక్తులగుదురు. బ్రాహ్మణుఁడై పుట్టినఁగాని
ముక్తిలేదని వాదించువా రల్పమతులు. అట్టినిర్మల జ్ఞానము
కలుగుటకే వర్ణాశ్రమధర్మములు నియమింపఁబడినవి. మహా
పురుషదర్శనాదులవలన నేజాతికిఁగాని నిర్మలజ్ఞాన మలవడ
వచ్చును. దాన వాఁడు ముక్తినొందును. కావున నట్టి

యితరుల కట్లు బోధింతురు. వారి ననుసరించువా రట్టివారే. వారినిగురించి చింతించిన లాభమేమి? కలియుగమునఁ గర్మ ముల నాచరించువా రత్యల్పసంఖ్యాకులు. ఆస్తికప్రాయులు పెక్కండ్రుందురు. కలియుగస్వభావ మదియేకాన దానిం గూర్చి చింతించి లాభము లేదు. విదురుఁడు నన్నుం బ్రశ్నింపఁగా నే నిట్లు పల్కితిని.

శ్లో. "ముఖతో వర్తత బ్రహ్మ పురుషస్య కురూద్వహా,
యస్త్వాన్ముఖత్వాద్వర్ణానాంముఖ్యోఽభూద్బ్రాహ్మణో గురుః.
బాహుభ్యో వర్తత క్షత్రం క్షత్రియ స్తదనువ్రతః,
యో జాతస్త్రాయతే వర్ణాన్ పౌరుషాన్ కంటకక్షతాన్. ౩౧.
విశో వర్తంత తస్యోర్వో ర్లోకవృత్తికరీర్విభోః,
వైశ్య స్తదుద్భవో వార్తాం నృణాం యస్సమవర్తయత్. ౩౨
పద్భ్యాం భగవతో జజ్ఞే శుశ్రూషాకర్మసిద్ధయే,
తస్యాం జాతః పురా శూద్రో యద్వృత్త్యాతుష్యతే హరిః.
ఏతే వర్ణాస్స్వధర్మేణ యజంతి స్వగురుం హరిమ్,
శ్రద్ధయాత్మవిశుద్ధ్యర్థం యజ్జాతాస్సహ వృత్తిభిః." ౩౪

శ్రీమద్భాగవతము. ౩స్కం. ౬ అధ్యాయము.

ఇదియే నాయభిప్రాయము. అపు డిట్లు పలికి యిపుడు మతమును మార్చుకొని తుచ్ఛవాక్కు లేల పల్కుదును? అట్లు నేను బల్కితినని వంచకులు పలికినను లోకులు బుద్ధిమంతులే గైన నమ్మరు. దుర్బుద్ధులు నమ్మిన నేనేమి చేయఁగలను? అని పలికి యామైత్రేయముని యూరకుండెను.

వారి యాశయము చక్కఁగా నెఱింగి నేనేమియు మాటలాడక కొలఁదినిమేషము లుండి మహాత్మా! సర్వసంశయ

ములు తీఱినవి. తమపాదదర్శనమునఁ గృతార్థుఁడ నైతిని. ఇఁక నాకుపదేశింపఁదగు విషయములను దెల్పి ధన్యుం జేయుఁడు. నాకేమి కావలయునో నేనే యెఱుంగఁజాల కున్నాఁడను. అని పలికి యూరకుంటిని.

మైత్రేయమహాముని వత్సా! గురూపదేశమునొందఁదగినవిషయమునే చక్కఁగా నభ్యసింపుము. దేవతాద్వేషము నీకు లేకుండుట నీపూర్వకర్మవిశేషము. నీవభ్యసించుయోగమే చాలును. ఉపాసించునపుడు జపమాలికపై దృష్టి నునిచినను [illegible]లినను దేవతాపాదారవిందములయం దునుచుట ముఖ్యము కాదా యని నీవూహించినయది సత్యమే. సంఖ్య లేక చేసిన జపము ఫలించదనుట పామరులకొఱకు. నీవు నమ్మియున్న దేవత సత్త్వరూపిణి. కావున సర్వదా నీకు మనోమోదము నొసఁగఁజాలును. విగ్రహార్చనము మానితివి కాన నాయుపదేశమావిషయమునను నిఁక నక్కఱలేదు. అహంకర్తృత్వమును మాని యాపరమేశ్వరినే నమ్మియున్నాఁడవని యెఱుంగుదును. ఆదేవతయే కదా నిన్నిక్కడకుం దెచ్చెను. ఆపరమేశ్వరికరుణకుం బాత్రుఁడవు కాన నిన్నాశీర్వదించుచున్నాఁడను. ఇఁకఁ బొమ్ము. మేమును యోగనిష్ఠనుందుము. కన్నులు మూసికొనుమని యామహాత్ముఁడాజ్ఞాపించెను. నేనట్లే చేసితిని. కన్నులు తెఱచునంతలో శ్యామసుందరచక్రవర్తి నన్నెచ్చటనుండి పొమ్మనెనో యాచోటనుంటిని. నాపార్శ్వమున నామహాపురుషుఁడు తోఁచెను. వారి దర్శనమున నాకుంగల్గినయానందపారవశ్యమునకుఁ బరిమితియే లేకుండెను. ఆమహాత్మునింగాంచుచు నానందబాష్పములు ధారాగాఁ బ్రవహింప నూరకుంటిని. శ్యామసుందరమూర్తియు బాలకా!

వేఱొక-చోటు కనఁబడుచెదర. రమ్ము. అని ముందు నడువ సాగెను. నేనును బోవసాగితి. వేగమున నడచుచుండ నొకశిఖరము దృగ్గోచరమయ్యెను. ఇంతకుముందుగాఁ జూచినతావునకుఁ బడమటి భాగమున నది యున్నట్లు బొడకట్టెను.

## అద్భుతశిఖరము

ఆశిఖరమును జూడఁగనే నాచిత్తమున నొకవింత దోఁచెను. అదియొకరమ్యహర్మ్యశ్రీ మైనట్లును, దానియందుఁ బెక్కండ్రు దేవత లుండినట్లును దెల్లముగ నా కగపడియెను. ఏమి యుందోఁపక నిలుచుంటిని. వెనుకకుఁ దిరిగి చూచి కుమారా! ఏమట్లు నిలుచున్నాఁడవు! దీనిసొబగు చూచియా? నాచెంతకు రమ్ము. అని పిలువ నేను శ్యామసుందర మూర్తిదరి కరిగితి. వ్రేలు చూపుచు దానింజూడుము. ఇదియే యద్భుతశిఖరము. ఇది యున్న యట్లు మానవు లిటీవలఁ గనుఁగొనిరి. మన మింతకుముందు చూచినశిఖరమున కిది పశ్చిమభాగమని యెఱుంగుము. ఈశిఖరము దూరముననుండి పరికించిన యంబరమున మేఘమాలికరీతిఁ గనఁబడును. దీనియున్నతము సార్ధక్రోశద్వయము. (28278 అడుగులు. అనఁగా నైదుమైళ్లు 2 ఫర్లంగులు. 186 గజములు) అద్భుతాకృతిగలది. చూచువారల కిది యొకహర్మ్యముగాఁ గనంబడును. దీనియందు సిద్ధులు నివసింతురు. వేనవేలుగాఁ గనఁబడుదురు. వారెల్ల భగవదారాధనతత్పరులు. మర్త్యలోకమునకు మేలుగోరువారు. ఆసిద్ధులు రెండుతెగలుగా నున్నవారు. పితృదేవతలకు సంబంధించినవారు కొందఱు దేవతలకు సంబంధించినవారు కొందఱు. అందుఁ బితృసంబంధము గలవారు తమతమగోత్రాభివృద్ధినే

గోరుచుందురు. దేవతాసంబంధముగలవారు సకలప్రజాభి
వృద్ధిని గోరుదురు. ఇదియే వారికిం గలభేదము. నావ్రేలుమూల
ముగాఁ జూడుము. అల్లదో యొకవృక్షషండము గనంబడును.
దానినడుమ నొక యాశ్రమమున్నది. చూడుము. కనబడుచున్న
దియా? పరికింపుము. కనఁబడకున్నను మోమోటమిఁగనఁబడిన
దనకుము. అనఁగా జక్కఁగాఁ గానంబడినది. తమయనుగ్రహ
మున్నఁ గానరాని దెద్ది? అని పలికితిని. నవ్వి యాశ్వాసముం
దరమూర్తి వత్సా! ఆయాశ్రమమున సిద్ధులు పెక్కండ్రు గలరు.
నరనారాయణులను నాదిమమునులు కొంతకాల మిందు నివ
సించి తపముచేసిరి. ఆయాశ్రమమునకుఁ గొంతదక్షిణభాగ
మున నొకసానువు కనంబడును. దానినుండి యొకనది ప్రవ
హించుచున్నది. చూచితివా. ఆజలము వెంటఁ బెద్దకొండల
వలెఁ గొన్ని పడుచున్నవి. ఏమని నీయూహ? అనఁగా నవి పర్వత
శిఖరము లంటిని. పక్కున నవ్వి బాలకా? కావు కావు. అవి
తుహినము గట్టిపడఁగా గండోపలములవలెఁ గానంబడును.
మంచుగడ్డలు సుమా! అవి కరఁగఁజాలవు. జలమున నుష్ణ
గుణము లేనికతన నాజలమున మునుఁగుచుఁ దేలుచు నవి పోవు
చుండును. అవి సర్వదా జలవేగమున నాకృష్టములై పడుచునే
యుండును. ఆచెంత నెవ్వరుగాని నివసింపఁజాలరు. ఆజలపాత
స్థానమున నొకగండోపలము గలదు. అదియే లేకయున్న నీపా
టికి భూమిని వివరముపడియుండదా? ఈనదీవేగమును భరిం
చుట కలవియగునా? ఈనదియే గంగానదికుపనదియై స్వకీయ
జలప్రవాహమున దానిని వృద్ధిచేయుచుండును. ఇందు ముని
వరులు త్రికాలములయందు స్నానము చేయుచుందురు. కొంత

కాలమిాఁ జలము గడ్డకట్టినట్లుండును. కాని యట్టిమాసముల యందు దుర్భరశీతజలమున మహామునులు స్నానము చేయు చునే యుందురు.

ఈశిఖరమున నొక్కవిశేషము కలదు. ఈశిఖరోపరిభా గము స్పష్టముగాఁ బరికింప శక్యముకాదు. సూక్ష్మదృష్టి నొసం గెద. పరికింపుము. శ్యామలవనావళి కనఁబడుచున్నది కదా. అందు దృష్టి నిలిపి చూడుము. ఒక్కచెట్టునుండి వేఱొక్క వృక్షమున కెగురుచున్నపక్షులను జూడుము. అవియే ఋషి పక్షులు. వానినే గబ్బిలము లందురు. వానివర్ణము లనేకములు. ఎంతపెద్దవిగా నున్నవో చూడుము. ఈశిఖరమునఁదప్ప నిం కెక్కడ నిట్టివి లేవు. వృక్షశాఖలఁ గదలక మెదలక యున్న జంతువులఁ గాంచితివా? అవి వానరములు. నా తర్జనిమార్గమున లక్ష్యమును భేదించునట్టి దృష్టిని బఱపుము. ఆ తెల్లనివృక్షము చెంత నున్న దేదో తెలిసికొంటివా? అదియొక చిఱుతపులి. అది పరుండియున్నది. ఇప్పుడే మదపుటేనుఁగంత యున్నది. లేచినపు డెంత యుండునో యూహింపుము. ఇట్టిచిఱుతపులు లింకెం దును గానరావు. ఈజాతిలో ననేకవిధములు గలవు. వాని నెల్ల నిపుడు తెలుపవలనుపడదు. ఈశిఖరాగ్రమున శ్రీభవానీ పరమేశ్వరులు కొలఁదిదినములు నివసింతురు. ఆచోటు పరమపావనమని మహర్షులు దేవతలు దర్శించి పోవుచుందురు. ఒక్కముహూర్తమాత్రమోర్చుకొనుము. సంతసముప్పొంగ నొక్కవిశేషము చూడఁగలవు. అనిపలుకుచుండఁగనే యత్యంత దూరోర్ధ్వభాగమున మేఘమాలికవలె నొక్కవస్తువు నా నేత్రములకుఁ బండువు గావించెను.

దానింగాంచినంతనే నాకు నచ్చెరువుగల్గ శ్యామసుందర మూర్తీ! ఇదేమని ప్రశ్నించితిని. నవ్వుచు నామహాత్ముఁడు వత్సా! అది యొకవిమానము. నీవు దానిని మున్ను చూచిన గండభేరుండపక్షియని భావించి కదా ప్రశ్నించితివి. అందున్న వారు దేవతలు. విమానారూఢులై తమయుస్నులమిన్నలం గూడి విహరింప నరుదెంచినవారు. ఈశిఖరమునఁ గల పార్వతీ పరమేశ్వరావాసముం జూడ వచ్చియిందుఁ గొలఁదిముహూర్తము లుందురు. అందున్నవారు స్పష్టముగాఁ గనఁబడుచున్నవారా? అన లేదంటిని. ఇంకొక్కసారి చూడుమనియె. అంతలో నాకన్నుల కొక్కక్రొత్తచూపు కలిగెను. అందున్నవారెల్లఁ జెంత నున్నయట్లే కనఁబడిరి. వారిదివ్యతేజస్సు నాదృష్టి చూడఁ జాలెను. ఔరా! వారియాభరణములు విచిత్రతమములు అనుపమానములు. అసాధారణములు. వారిచెంతనున్న కాంతలు పదాఱువర్షముల ప్రాయములు కలవారు. వారింగాంచి నమస్కరించి మహాత్మా! వీరెవ్వరని మరల ప్రశ్నించితిని. కరుణాచే నాశ్యామసుందరమూర్తి బాలకా! దేవతలని చెప్పితిని గదా. వారిపేరు లిపుడు చెప్పరాదని మానితిని. ప్రశ్నింపకుము. అన విని యిందఱు కాంతామణులు కలరు. కాని యొక్కరిచెంతను శిశువులు లేరే. ఏల యని ప్రార్థించితిని. దానికి బదులు చెప్పబూని తొల్లి దేవతలను పార్వతీదేవి సంతానహీను లగుదురని శపించెను. శాపమునకు ముందుగాఁ బుట్టినవారు తప్ప మరల సంతతి లేదు. అందు దివ్యసింహాసనమునఁ గూర్చుచున్న వాఁడు జయంతుఁడు ఇంద్రపుత్త్రుఁ డనియెను. నేనామాట విని

మహానుభావా ! చిన్ననాట నేను జంపూరామాయణమును బఠించితిని. అందు

"అనపత్యానథామర్త్యాక్ బహుభార్యాం చ మేదినీం,
అకరోదంబికాకోపః పుత్రాభావసముద్భవః."

అనుశ్లోకము గలదు. షణ్ముఖజననఘట్టమున దీనింజదువునపుడు కల్లయని భావించితిని. ఇపు డట్లుభావించుట తప్పని తెలిసెను. అనఁగానే శ్రీశ్యామసుందరుఁడు వత్సా ! తెలియని వన్నియుఁ దప్పులని భావించుమూర్ఖులయాశయము నంగీకరింప కుము. దేవరహస్యములు మానవుల కగమ్యములు. అల్ప మతులు దురూహాములగువిషయము లసత్యములందురు. ఆ మాటల విశ్వసింపకుము. మహర్షి వాక్యము లన్నృతములు కావని నిశ్చయింపుము. అని మందమందమృదూక్తులం బలుక విని మరల నిట్లు ప్రశ్నించితిని.

విమానము లిపుడు మానవలోకమునఁగలవు. వానియా కృతికిని దీనియాకృతికిని బోలికయైనను సరిపడదు ఏల ? నాకుం దెల్పుమా యనగానే పక్కన నవ్వి యేల యిట్లు ప్రశ్నించె దవు. ఇవి మంత్రసిద్ధములు. కామగమనములు. ఏనాటికిఁ జెడు నవికావు. తపఃఫలసంజాతములు. ఇవొక్కక్షణము స్వర్గమునకుం బోవఁగలవు. మానవకల్పితములు సాపాయములు కృత్రిమములు వానికి వీనికిని సాటి యెట్లు ? ఈ శిఖరమును బరిశీలింపఁగోరిన మానవులు భగ్నాశులై పోయిరి. ఈ హిమాలయమునఁగల విచిత్రము లేకాలమునను మానవులకు గోచరింపవని నమ్ముము. బుద్ధిమంతులు తపస్సొనరించి దైవబలమున వీనిం జూడఁగలరు. మానవబుద్ధిబలమే కార్యక్షమమని భావించువారి కీపర్వతవిశే

షములు దుర్జ్ఞేయములని నిశ్చయింపుము. ఇంక నీశిఖరమునఁ గలవిశేషములఁ గనఁబడఁజేసెదనని పలుకునంతలో మేమిరువుర మా శిఖరాగ్రమున నుంటిమి. నాయొడలు కంపింపసాగెను. భయంపడకుమా. హిమానీభాధ నిన్నలముకొనఁ జాలదని యాపరమేశ్వరుఁడు హెచ్చరించెను. దాన ధైర్యము యథాపూర్వముగా నాకుం గల్గెను. అత్తఱి నామహాపురుషుఁ డిట్లనియె.

### పరమేశ్వరస్థానము

వత్సా! ఇదె మున్ను తెల్పినపావనస్థానము. ఈవటమహీరుహాముక్రింద నీశ్వేతపాషాణముమీఁదఁ బార్వతినిగూడి పరమేశ్వరుఁ డుండును. ఆతరుణమున బ్రహ్మాదు లాయాదిమదంపతులఁ గొలువ నరుదెంతురు. అటు చూడుము. ఆచోట మునులు కూరుచుండువారు. పరమేశ్వరుఁడు వారికిఁదత్త్వము నుపదేశించును. ఈపాషాణమునకుఁ దలసోఁక నమస్కరింపుము. అని పలుక నట్లే నమస్కరించితి. ఆచోటునకు దక్షిణభాగమున నున్నసరోవరమును జూపి యాసరోవరజలముల శిరస్సునఁ జల్లుకొనుము. ఆసరస్సు పార్వతీసరస్సనుపేరం బరఁగు. ఆదేవి యందు నప్సరఃకాంతలంగూడి జలకమాడును. అందెవ్వరుగాని మునింగిన స్త్రీలగుదురని యాశర్వాణి మున్ను నియమము చేసెను. కావునఁ బ్రమాదమున స్నానము చేయుదువేమో యనఁగా మహాపురుషా! ప్రమాదంపడి మునిఁగి స్త్రీనైన నన్నుఁ బురుషునిగా మార్ప నీవుండలేదా యంటిని. నవ్వి శ్యామ సుందరమూర్తి తెలియక యిట్లు పల్కితివి. ఆమహాదేవి యానతి మీఱ నెవ్వరికేఁ దరమా? త్రిమూర్తులా జగజ్జనని మ్రోల సేవని చేయశక్తులు గారని నమ్ముము. నీవు భక్తిభరిత

స్వాంతుఁడవై యుపస్పర్శన మాచరించి రమ్ము. వంశమున
కొక్కఁడవేకదా పురుషుఁడవు. స్త్రీత్వమందిన నెట్లు? అని పరి
హసింప నామహాత్మునానతి మఱాళిందాల్చి యట్లే యొనరించి
తిని. ఆసరోవరమునకు నలుఁగడల మహీరుహము లంబర
మును ముద్దుపెట్టుకొనుచుండెను. వానిపై ననేకపక్షులు కూరు
చుండి యానందమునఁ గిలకిలాలాపములు సలుపుచుండెను.
అవి యెట్టివారికైన నానందమును గూర్పకమానవు. ఒక్కొ
విధమగురంగుగలపక్షు లొక్కచోఁ గూరుచుండఁ జూడఁ
జూడ వేడుకగా నుండెను. ఆపత్త్రులచెంత వింతవింతరంగులు
గలవానరము లుల్లాసమునఁ గిచకిచలాడుచు నుండెడు. వానిం
గాంచినంతనే భీతిజనించెను గాని వానినించుకతడవు చూచి
నంతనే యుల్లాసము గలిగెను. అవి పరమసాధుజంతువులనియే
తోఁచెను. క్రోఁతిచేష్టలనుమాట యటఁ గల్లయాయెను.
అందుఁ గొన్ని నీలవక్త్రములఁ గన్పట్టెను. అవిమాత్రము నన్నుఁ
జూచి వింతపడి చెంతకరుదెంచెను. కాని యవిచెంతకు రాఁగా
నాయొడలువడఁకసాగెను. శ్యామసుందరమూర్తి వత్సా! భయం
పడకుము. ఇంచుక వానిమనస్థితిని బరిశీలింపుము. ఆవల నీకే
యానంద ముదయించుననియె. ఎట్లో యామాన్యునిమాటఁ
బట్టియుంటిని. అవి చెంతకరుగుదెంచి నిక్కిచూచి నాలుగు
ప్రక్కలు తిరిగి మరల నన్నుంగాంచి యేమో మాటలాడెను.
ఆమాటలయర్థము నేనెఱుంగఁజాల నైతిని. మహాపురుషుఁ
డబ్బాయియా! యీస్థలమునకు మానవులు రాఁజాలరే. నీ వెట్లు
వచ్చితివని యడుగుచున్నవనఁగా నీమహాపురుషుని సాయమున
నని బదులిడితిని. ఆమాటలయర్థము నెట్లు తెలిసికొంటినో

యెఱుంగఁజాలను గాని వెంటనే యథాస్థానమున కరిగి వాని జాతివానరములతో నేమేమో చెప్పుచు నవ్వుకొను చుండుటఁ గన్నులారఁగాంచితిని. ఆవిచిత్రచర్య యావజ్జీవము మఱపునకు రాదని గట్టిగాఁ జెప్పఁగలను. ఆసవన్నును గాంచుచుఁ గొన్ని నిమేషము లుండఁగా నామహాపురుషుఁడు వేఱొకతావునకు నడువసాగెను. వెంటనే నేనును బోవసాగితిని. ఒక్కశిలాఫలకము గనంబడెను. అందు వాడనిపుష్పములు కుప్పగాఁ గనఁబడియెను. ఇవేమంటిని. ఇది శివపాదచిహ్నితపావనస్థలము. నిత్యము మహామునులు స్నానానంతరము మంచిపూవులంగోసి యీశిలాఫలకముపైనిడి నమస్కరించి యాశ్రమములకుం బోవుదురు. ఇంక నొకక్షణమునకు మరలఁ గొందఱరుదెంతురు. అని పలుకుచుండఁగనే పదునొకండ్రు మునులబాలకులు తడి వస్త్రములతో నరుదెంచి పూవులనవలంద్రోచి తమరు సేకరించి తెచ్చినవాని నందిడి తలసోఁక మ్రొక్కి యొక్కఁడొక్కఁడుగా నడువసాగిరి. మేమున్నజాడ వారికిఁ గనఁబడినజాడ నాకుఁ దోఁపదయ్యె. వారరుగ మహాపురుషా! వీరియం దెవ్వరుగాని మనలఁ బలుకరించలేదే? ఏల? అని యడిగితిని. నవ్వి కుమారా! మనము వారికిం గనఁబడినఁ గదా ప్రశ్నింతురని బదులు చెప్పి యేదో యొకశబ్దము నుచ్చరించెను. ఆచోటువాసి యొక్కడికో పోయితిమి.

## కైలాసము (ఎవరెస్టు)

ఆచోటు మేము చేరితిమిగాని నాకేమో దిక్కు తెలియ దయ్యెను. ఇంతకుముందు నే నెన్నితావులలో చూచితిని గదా. దీనిలో శతాంశమున కవి సరిపోలవని తోఁచెను.

మేమున్న చోటు సమప్రదేశమే.దానికిఁ దూర్పుగా నొక యున్నత ప్రదేశము కనఁబడియెను. అది పర్వతభాగమని యూహింప శక్యమే గాదు. ఆకాశమున శ్వేతాభ్రము లావరించియున్నట్లే తోఁచెను. మహాపురుషా! పర్వతము సమాప్తి నొందినదా? ఈ సను ప్రదేశమునుండి యెచ్చటికిఁ బోవలయును? అని ప్రశ్నించితిని. పకపక నవ్వుచు నాభాగము నంగుళింజూఁపి కనఁబఱచుచు నదేదో తెలిసికోనఁగలవా యనెను. అది తెలిసికొంటిని. తెల్లని మేఘము లావరించిన యాకాశము. వర్షధారలు విడిచి యీావర్ణమును మేఘములు దాల్చును.

శ్లో. "త్వదన్యతస్తావదనన్యకార్యో
గుర్వర్థమాహర్తుమహం యతిష్యే,
స్వస్త్యస్తు తే నిర్గళితాంబుగర్భం
శరద్ఘనం నార్దతి చాతకోపి."

అని రఘువంశమునఁ జదివితి నంటిని. పరిహాసము చేయుచు మంచిపరిశీలకుఁడవుగా నున్నావే? చాలుఁ జాలు చక్కఁగాఁ బరీక్షింపు మనియెను. లక్షించి చూచి యార్యా! శరత్కాల మేఘమాలికలచే నావృతమగునంబరమే. సంశయ మేల? అని నిర్భయముగా బదులిడితిని. ఇంకనైనఁ దెలివి కలుగలేదే యని పరిహసించి శరద్ఘనము లావరించినవియా? కావ్యశ్లోకములు చదివితివిగాని లోకజ్ఞానము శూన్యముగాఁ దోఁచెడిని. ఇంకొక్క మాఱు పరీక్షింపుమనియె. ఒక్కముహూర్తమాత్రము తదేక దృష్టిం బరికించి మహానుభావా! ఏల నన్నుఁ బ్రతారించెదరు. చక్కఁగా మేఘమాలిక లగపడుచున్నవి. అవి యాకసమునే కదా యావరించును? సంశయమేల? అని దిట్టతనమున బదు

లిచ్చితిని. నాపైఁ జూపాలయఁగా బుద్ధిహీనుఁడవుగా నున్నాఁడవు. మేఘమాలికలనుండి నదులు ప్రవహించునా? ఆసెల యేఱు కనఁబడలేదా? అని యొకచోటు చూపెను. అందు ననర్గళ వేగముతో జలప్రవాహము గనఁబడియెను. ఇదేమి వర్షము? కుంభవృష్టియని వింటినికాని యిది పర్వతమంతధారగాఁ బరుగిడుచున్నదే. ఏమి వింత! ఏమి వింత! దీనిపేరేమో తెలియఁగోరెదను. నన్నూటాడింపక తెల్పుఁడు. అని వేఁడితిని. నాయజ్ఞానమునకు నచ్చెరువంది యిఁక నీవు కనుఁగొనఁజాలవని తెలిసినది తెల్పెద. ఆలకింపుము.

ఇది హిమాలయ శిఖరము. మర్త్యలోకమున దీనిని మించినది లేదు. దీనినే కైలాసశిఖర మందురు. మనమున్నతావు నుండి సార్ధపంచక్రోశములయెత్తుగలదీశిఖరము. (5 మై. 3 ఫ. 207 గజములు.) వీనిని మానవులు పరిశీలింపఁజాలరు. ప్రయత్నించిన వారు భగ్నాశులు గాక తప్పరు. దీనిమహాత్త్వము నాలకింపుము. సంశ్రవణమాత్రమునఁ బాపములు తొలంగును. దీని యగ్రముననే భవానియు భవుఁడును బ్రమథగణములం గూడి యుందురు. దర్శనార్థులై పర్వములయందు బ్రహ్మయు విష్ణువు సురేశ్వరుఁడు లోనగువారు వచ్చుచుందురు. మహామును లచ్చోటికిం బోయి పరశివపాదారవిందములకుం బ్రణమిల్లి తదుక్తుల వినుచుందురు. నందీశ్వరు నానతిం గైకొనక యెవ్వరే నరుగ వలంతులు కారు. అంగుళి దర్శనమాత్రమున సురాసురుల నడలింపఁజేయు నందికేశ్వరుఁడు ద్వారమున నుండును. ఈశిఖరాంతరమున నొక్క కొందఱు మానవు లుందురు. వారు నిరీహులు నిర్ద్వంద్వులు. మృగసహాయులు. తపోధనులు నై

యుందురు. వారింగాంచి మృగములు బెదరవు. అవి యొక్క-
జాతిమృగములనియే యవి తలంచును. వారిమనస్సులు కరుణా
రసపరిపూర్ణములు. కావున నాఁకొన్న మృగములు వారిం జేరం
జని వారియొడళ్లను రాపాడును. వారు వానియంగద నెఱింగి
యాహారమిచ్చి పంపుదురు. భూతదయ యన నిట్లుండవల
యును. వత్సా! ఈమాటలఁ జక్కఁగా మనోవీధిని బదిలపఱు
పుము. "భూతదయ గలవారమని చెప్పుకొనువారు వంచకులు
ఎవ్వారింగాంచినఁ గ్రూరమృగములు సైతము చెంత కరిగి
ప్రేమించునో తమబాధలఁ జిహ్వాములచేఁ దెలుపునో వారే
భూతదయావిశిష్టులు" అని నమ్ముము. అట్టివా రీశిఖరాంతర్భాగ
ములఁ గలరు. మంచుగడ్డ లిందలిభాగములనుండి దొరలునపుడు
గజఘటలు వాని క్రిందఁబడి మృతినొందును. మఱియు వానిశరీర
శకలములు హిమాకృతిందాల్చి యెంతకాలమునకునట్లే యుం
డును. ఇందలివాయువులు సోఁకినంతన మానవులు రోగపీడితు
లగుదురు. ఇది యడుగుభాగమునఁ గలవార్త. పైభాగమున
మానవశరీరములు నివసింప సమర్థములుకావు. అది పుణ్య
భూభాగము. పాషాణములు హిమావృతములగుట వెండికొండ
యనివేరు దీనికే గలిగెను. ఇందు మందాకినీనామమున గంగా
నది ప్రవహించును. అందలికమలములు స్వర్ణవర్ణములుగా
నుండును. సౌగంధికము లనునొక జాతిపుష్పము లిందలిసరోవర
ముల నుండును. వానిసౌరభ మనుపమానము. సహస్రపత్ర
ములుగల కమలములే యిందుండునవి. వానింగోసి దెచ్చి పరమ
శివుని మహర్షులు పూజింతురు. ఇది కేవలపుణ్యతమ ప్రదేశము.
ఈశిఖరమునకు నమస్కరింపుము. పరశంకరునిగా దీనినే ధ్యానిం

పుము. అని పలుక నానందాశ్రుపులు కనులనిండ "ఓం నమ శ్శంకరావానాయ పర్వతేంద్రాయ సుధీశసేవితాయ మహోత్తుంగ రూపాయ" అని సాష్టాంగనమస్కార మాచరించితిని. లేచి ప్రాంజలినై నిలువంబడితిని. కాని నాకేమియుం దోఁపుపయ్యెను. శరీరము మ్రాన్పడినట్లుండెను. భయమునకవకాశమే లేదు. ఏల యిట్లున్నదని నాలో నేనే ప్రశ్నించుకొనుచుంటిని. నాయీ వ్యాకులత నెఱింగి శ్రీశ్యామసుందమూర్తి యిట్లు పలికెను.

వత్సా! ఎట్టివారింగాని యీ మహోన్నతోత్తమతమశిఖరము మ్రాన్పడఁజేయకపోదు. ఇందు దేవతలు మహర్షులుందురు. సాక్షాత్పరమేశ్వరుఁడు నివసించుతావిది. దీనిని స్మరించినంతనే పాపములడంగును. ఇఁకఁ బ్రత్యక్షముగాఁ గాంచినఁ జెప్పవలసిన దేమి? వేలుగా భావింపకుము. కృతార్థుఁడవైతివి. సకలపాపములు నశించెను. నీకులపూర్వులు తరించిరి. ఈపంక్తిలోనున్న శిఖరములే పెద్దవి. అందు నిది సర్వోన్నతము సుస్థమమునగు. ఎన్ని జన్మములఁ జూడఁగోరి తపమొనరించినఁగాని యిది సందర్శించుభాగ్యము లభింపదు. అందును గృతకృత్యతంగోరి దర్శించువారికే ఫలము గల్గును. దీనివినోదముగాఁ జూచువారికొకవిధముగఁ దోఁచుఁగాని యందలి దేవతలు కనఁబడరు. మహర్షులు కనఁబడరు. దివ్యవృక్షములు కనఁబడవు. మంచు కరుడులు మాత్రము కనఁబడును. గండశిలలు సామాన్య వృక్షములు మృగములు సామాన్యపక్షిజాతులు చూడఁబడును. అంతియగాని కల్పవృక్షములు పావనమృగములు పరమ పతత్త్రులు చక్షుర్గోచరములగుట కల్లయని సమ్ముము. ఈశిఖరమున నీవాంటి నరుగఁడగుస్థల మొక్కఁడైన లేదు. కాని యిత

రుల కదృశ్యుఁడనై నీకుంగనంబడుచు మహర్షులంగూడ మాయచే నాచ్ఛాదించి నేనుందును. మహామునుల యాశ్రమముల కరుగు దము. నిమీలితనయనుండవై శంకరుపదపంకజముల ధ్యానించు చుండుము. అని పలుక నట్లే చేయుచుంటినిగాని నామనస్సున నెటకోయెగిరిపోవుచున్న జాడ పొడకట్టెను. ఏమియు నిర్ణయింపఁ జాలని యల్పమతినిగాన నూరకయుంటిని. కన్నులున్మీలనములు కావచ్చుననుమాట వినఁబడియె. అట్లే చేసితిని. ఒకదివ్యాశ్రమ మున నుంటిని. నాకుఁ గుడిపార్శ్వమున శ్యామసుందరమూర్తి కనఁబడుచునే యుండెను. నాకు నామహాపురుషునకు నంతర మొకబాహువుమాత్ర ముండునని నాయూహ.

## మహామునులు

ఇంతలో నొక్కమునికుమారుఁడు వచ్చి నన్నుంజూచి విచిత్రముగాఁ దోఁచినదికాఁబోలు. మాటాడక నిలుచుండెను. ఆకుమారునిముఖమున బ్రహ్మతేజస్సు తాండవమాడుచుండెను. దానింగాంచినంత నెట్టిపాపాత్ముఁడైనఁ బరమభక్తుఁడు కాకపోఁ డని నానమ్మకము. ముహూర్తమాత్రమట్లే యుండెను. నేనును బలుకరించిన నేమిబెడఁదయో యని యూరకుంటిని. మఱొక మునివరుఁ డరుదెంచెను. గీర్వాణభాషతో నాకుమారునిం గాంచి యేమట్లున్నావని ప్రశ్నించెను. మఱియు నీతఁడు మానవుఁడు. ఏటికో యెట్లో యరుదెంచినవాఁడు. పూర్వజన్మమునఁ జేసికొన్నపుణ్యవశమున నిచ్చోటికి కేతెంచెను. సంభాషింపుము అని పలికిపోయెను. ఆకుమారుఁడు నన్నుంగని నీ వెవఁడవు?. నీగోత్ర మేమి? ఏల వచ్చితివి? పేరేమి? అని ప్రశ్నించెను. నేనును

నించుక తెలిసినసంస్కృతభాషతో నేబ్రాహ్మణుఁడను. కాశ్యప సగోత్రుఁడను. పుణ్యస్థలదర్శనార్థినై యరుదెంచితిని. సంధ్యా వందనమునఁ బాండవకృష్ణశర్మననియు వ్యవహారమున శేషాద్రి శర్మననియుఁ జెప్పుకొందును. దీక్షానామము కలదు. అని దానిం గూడఁ జెప్పితిని. నాదీక్షానామమును గోత్రమును విన్నయం తనే పరమానందభరితుఁడై చెంతకు వచ్చి కౌఁగిలించుకొని యెను. ఒక్కసంప్రదాయమునకుఁ జేరినవారమే మనమిరువుర మని గ్రహింపుము. మనమిరువురము సోదరులము. ఏకగోత్ర జనితులము. అని యామునికుమారుఁడు పలుకఁగా నాకత్తఱిఁ గల్గినయానందాశ్చర్యములకు మేరయే లేకుండెను. క్షణకా లము మాటరామి నూరకుంటిని. పరంపడి ప్రయత్నపూర్వక ముగా నిట్లంటిని. మహాత్మా! మీమాటలు నాకర్థము కాలేదు. ఏకగోత్రజులము కావచ్చును. కాని యొకసంప్రదాయమునకుఁ జేరినవారమంటిరి. విశదముగాఁ దెలిపి నాశంకఁ దీర్పుఁడు. నేను కేవలము పామరుండను. అని విన్నవింపఁగా నవ్వి చేయి పట్టుకొని నాలుగుబాహువులదూరము తోడుకొనిపోయి వృక్ష మూలమున శిలాఫలకముపైఁ గూరుచుండఁ జేసి యిట్లు పలికెను.

సోదరా! గౌతమీతీరమున శ్యామశాస్త్రినాఁ బ్రఖ్యా తిని వహించి దీక్షానామమున (చెవిలోఁ జెప్పెను.) నిట్లు యశస్సు నార్జించినమహాత్ముఁడు కలఁడని నీగురువు చెప్పఁగా విన్నాఁ డవుకదా. వా రిందున్నారు. వారికి నేను శిష్యుఁడను. కావున మనము సోదరులము కామా? అన నేనించుక మాటలాడఁ జాలితిఁగాన నిట్లంటిని. మహాత్మా! శ్యామశాస్త్రిగారు వ్యతినంది

రని వారు యోగాగ్నిదగ్ధకల్మషులని కావున వారిని భూమి యందు యతీంద్రునివలె స్థాపించిరని విన్నాఁడను. నాగురువులా సంప్రదాయమునకుఁ జేరినవారలే. ఆశ్యామశాస్త్రిగారెట్లువచ్చి యిందున్నారో యెఱుంగఁజాలక యడుగుచున్నాఁడ. వినిపింపు మన్నంతనే నవ్వి సోదరా! మానవతనువును వదలి దేవతా శరీరమును దాల్చి యిందున్నవారు. ఈకలికాలమునఁ గూడఁ దమసంప్రదాయము నశింపకుండుఁగాక యని సర్వదా కోరు చున్నవారు. వారిని దర్శించి కృతకృత్యుఁడ వగునట్లు చేసెద. అని పలికి కుశలవార్తల నొకముహూర్తకాలము గడపి నన్నుందోడ్కొని లోపలికరిగెను. శ్యామసుందరమూర్తి కనఁ బడకుండెను. స్వామీ! నన్ను ఘోరాటవి వదలితివే యని చింతించితిని. అంతలోఁ గనఁబడి భయములేదు. సోదరదర్శనమున నన్ను మఱచితివని యూహించితిని. సంతోషము. కనఁబడు చుండెదను. భయంపడనేల? వాగ్దానము మఱతునా?

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అన్నశపథమును మఱతునా? అనియె. ఆమహనీయమూర్తి వెంటరా లోపలి కరిగితిని. అం దొకవిశాలస్థలము కనఁబడెను. అందుఁ గుశాసనములు కనఁబడెను. వానియందుఁ గూరుచుండి మహానియతిందపమాచరించు మహాత్ములు కనఁబడిరి. ఆముని కుమారుఁడు వారినడుమనుండి నన్నుఁ దోడ్కొని మఱొక్క తావున కరిగెను. అందొక్క మహాతేజస్వి వ్యాఘ్రాసన ముపైఁ గూరుచుండియుండెను. నమస్కరింపుమని యావటువు సంజ్ఞచేయఁగా గ్రహించి సాష్టాంగనమస్కార మాచరించితిని.

ప్రాంజలినై నిలువంబడితిని. కన్నులు విప్పిచూచి కూరుచుండ
నియోగించి యామహాత్ముఁ డిట్లు పలికెను. ప్రశిష్యా! నీగురువు
నకుం గుశలంబే? యని ప్రశ్నించి మీ గురుపరంపరలోనే
నేమానసనామమున శ్యామశర్మనని యీవటువు చెప్పెఁ గదా.
కను సంతసమయ్యెను. నీరాక మున్నే యెఱుంగుదును. అని
యొన్నియో వార్తల నడిగి యీయాశ్రమము మనుష్యా
గమ్యము. పూర్వపుణ్యమున నీకుం గన్పడెను. గురుపరంపర
నభివృద్ధి గావింపుము. కలికాలమైన నొకానొకఁ డుండకపోఁడు.
మంత్రమూలముననే కలియుగమునఁ బుణ్యము రావలయు
గాని వేఱొకనిర్మలమార్గము కానరాదు. యాగాదుల నొనరింపఁ
గలసాధుమతులు విరివిగాఁ గానరారు. నిరపాయమైన
మార్గ ముపాసనమే. కావుననే శ్రీకృష్ణభగవానులు గీతా
శాస్త్రమునందు "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" యని వివరించిరి.
ప్రాయశ్చిత్తములు లేక యెంతచేసినను ఫలము నొసంగుచు మన
శ్శాంతిని గల్గించుచు భక్తిని దృఢపఱచుచు జ్ఞానమును గల్గించి
వృద్ధిచేయుచు నుండునది జపయజ్ఞమే యని తలంపుము.
గురుపరంపరాప్రాప్తమగు నామార్గమును విడువకయుండుట
మేలని నీకుఁ దెలిసినదియే కదా. మనపరంపరను బెంపొందిం
పుము. అందును దేవీసమర్చనము సామాన్యపుణ్యమున లభించు
నది కాదు. కావున నెవ్వఁడే నద్దానిం గోరిన నాలసింపక యొసం
గుము. దైవీపూజ పరమపురుషార్థము నొసంగునన్న నమ్మకము
గలవారికే యద్దానిం దెల్పుము. దేవీమంత్రముల నుపదేశింప
నెవ్వఁడు ప్రయోగరూపమున నితరుల బాధించునో వానికిం

దెల్పుకుము. వత్సా! నిన్నుంగంటిని. చాల సంతోషించితిని. నావార్త నీశిష్యుఁడు తెల్పెఁ గదా. ఎక్కువగా నేనేమియుఁ జెప్పఁ దలంచుకొనలేదు. ఇఁక నేమేని వినఁగోరిన నడుగుము. అన విని నేనెంతో మోదమున నిట్లు ప్రశ్నించితిని.

మహామతీ! సద్గురువర్యా! లలితాసహస్రనామపీఠికయందు "స్వజన్మత్రితయేఽపి చ". అని యుండెడు. దానిభావ మేమో వినఁగోరెదను. ఎందఱో వేఱువేఱుమార్గముల నర్థముం దెల్పెదరు. ఆవిషయమున నాకు సంశయము వీడకున్నది. అనుటయు మోదమున నానందముప్పొంగ నిట్లు బదులుపల్కెను. శిష్యా! జననము, ఉపనయనము నను రెండును గాక మూఁడవది దీక్షాకాలమని యెఱుంగుము. శాంభవీపద్ధతి ననుసరించి మంత్రదీక్షగైకొనుటయే మూఁడవజన్మము. కొందఱు సన్న్యాసము మూఁడవజన్మమందురు. మహావాక్యములు కూడ శాక్తదీక్షయందు లభించును. కావున నదియే మూఁడవజన్మము. దానినుండి తరించుట సులభము. యోగశాస్త్రము తదంతర్భూతమని యెఱుంగుము. ఎప్పుడుగాని శాక్తమతవిషయమై దుర్వాదము లొనరించుమూర్ఖులతో బదులు వాదింపకుము. అది మనశ్శాంతికి భంగ మొదవించునని నమ్ముము. ఎన్నిజన్మములకైన నుపాసకుఁ డయియే తరించును. రిక్తశాస్త్రార్థములు చేయువారు దురభిమానులు. తరణోపాయము వారికి దొరకదని నమ్ముము. జపకాలమున బుద్ధినభీష్టదేవతాపాదారవిందములయందు సంలగ్నముగావింపుము. అదియే యోగశాస్త్రఫలము. మోక్షసాధనమగును. ఊరక గ్రంథములఁ జదువుచుఁ బ్రొద్దుపుచ్చకుము. తెలిసినదాని నుపాసింపుము. అదియే చాలును. పుస్తకపాండిత్యము

వ్యర్థమగును. విశేషించి పరప్రతారణమును జేయఁదగునను బుద్ధిని బుట్టించును.

శ్లో. "నాపృష్టః కస్యచిద్బ్రూయాన్న చాన్యాయేన పృచ్ఛతః,
జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్."

అను మనుస్మృతి ద్వితీయాధ్యాయప్రమాణమును స్మరింపుము. పంక్తిపావనులంగూడి భుజింపుము. అట్టిభోజనముదొరకినపుడు జపమునకు విఘ్నము కలిగినను సంశయింపకుము.

శ్లో. "అగ్ర్యాస్సర్వేషు వేదేషు సర్వప్రవచనేషు చ,
శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాః పంక్తిపావనాః.
త్రిణాచికేతః పంచాగ్నిస్త్రిసుపర్ణష్షడంగవిత్,
బ్రహ్మదేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవచ.
వేదార్థవిత్ప్రవక్తా చ బ్రహ్మచారీ సహస్రదః,
శతాయుశ్చైవ విజ్ఞేయా బ్రహ్మణాః పంక్తిపావనాః."

అన్న మనుస్మృతి తృతీయాధ్యాయప్రమాణమును మఱువకుము. సభలలోఁ గూరుచుండి ఖ్యాతినిగోరి మంత్రరహస్యములఁ దెలుపకుము. అది చేయరానిపని. మఱియుఁ దెలియని విషయమును దెలిసినట్లు నటింపకుము. తెలిసినవిషయము నభ్యసింపక యింకను దెలిసికొనవలయునని ప్రయత్నింపకుము.

శ్లో. "అజ్ఞేభ్యో గ్రంథినశ్శ్రేష్ఠా గ్రంథిభ్యో ధారిణో వరాః,
ధారిభ్యో జ్ఞానినశ్శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః."

అనుమనుస్మృతి పండ్రెండవ యధ్యాయప్రమాణము నెఱుంగుము. దానిని మీఱి ప్రవర్తింపకుము. విశేషించి దుస్సహవాసమును వదలుము. దేవతాదూషకులు దుష్టులని మొదట

నెఱుంగుము. వారికంటె దుష్టులు లేరనియు నమ్ముము. అని యనేకభంగుల నుపదేశించి వత్సా! చాలసంతసము గల్గెను. ఇంకేమేని వినగోరిన నడుగుమనియె.

ఆమహాత్మునియాదరంబున కలరి స్వామీ! యిందున్నవా రెవ్వరని ప్రశ్నించితిని. నాప్రశ్నమును విన్నయంతనే కుమారా! వీరెల్లఁదపఃప్రభావముననీరోగులై జితేంద్రియులై యాకల్పము జీవింపఁజాలి మానవులకు మేలుగోరుచుఁ గలికాలమున నశించు విద్యలనెల్లఁ గృతయుగమానవుల కుపదేశింపఁ గోరి యిందున్న వారని యెఱుంగుము. వీరినామముల వచింప వలనుపడదు. వీరెల్లఁ దాపసులు. శాంతధనులు. పరమార్థతత్పరులు. సకల విద్యావిదులు. అని మాత్రమే నీకెఱింగింపందగు. వీరికెల్లర కొక్కసారి భక్తి నమస్కరింపుము. అని పలుక వారి నందుం డియే కాంచుచు సాష్టాంగవందనముల నాచరించునంతలో వేఱొకచోటున నుంటిని. శ్యామసుందరమూర్తి నాప్రక్కన నవ్వుచుండెను. నాలుగుదిక్కులు చూచుచు విభ్రాంతుఁడ నై యుంటిని. ఏమి చూచెదవని ప్రశ్నించెను. మహాపురుషా! నేను మాటలాడుచున్నవారేరీ యని యడుగ నింక నాప్రస్తావము వదలిపెట్టుము. నీకెంత కావలయునో యంతయు జరగును. ఈశిఖరమునఁ జూడఁదగినవిశేషములు గలవు. వానింజూప నెంచితినని నాకన్నులుకానరాకయుండఁ గరకంజములఁ గప్పెను. అంతలో నొకప్పుడేఁదలంపనట్టిచోటున నుంటిని. కన్నుల మూయుటమాని యిట్లనియెను.

## పరమేశ్వరస్థానము

వత్సా! ఇది పరమేశ్వరస్థానము. ఇందే సనకాదియోగీంద్రులు శంకరు నారాధింతురు. విగ్రహారాధనము పామరులకు ఫలము నొసంగును. ఇది మానసికపూజకు సాధనము. లింగరూపమున శంకరు నారాధించుట యత్యుత్తమము. అది నిర్గుణమును బోధించును. నిరాకారుఁడు కదా భగవంతుఁడు. అట్టి భగవంతుని గిరీటాదిభూషణముల నలంకరించి ధ్యానించు టుత్తమము గాదు. అది పామరులకు మేలు కూర్చును. కొంత కాలమున కా నియతి మాని నిరాకారునిగా నాదిదేవు నారాధింపవలయును. ఆవల వ్యక్తిపూజయే మాని మానసమునఁ దేజోరూపునిగా నుపాసింపవలయు. తరువాత సర్వభూతాంతర్యామిగాఁ దలంచుటయే యుపాసన మనంబడును. దానికి మించినది లేదని నమ్ముము.

శ్లో. "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే."

అనుగీతోపనిషత్షష్ఠాధ్యాయమునఁ గల ప్రమాణవాక్యములఁ దలంపుము. సంశయములు తొలంగును. మఱియు నిందుఁగల విశేషముల నెఱుంగుము.

ఇందుఁ గలజంతువులన్నియు నైజవిరోధమును మాని సాధుసోదరులవలె నుండును. ఏలయని ప్రశ్నింపఁ దలంచితివి

కదా? వినుము. భగవంతునితేజస్సు విశేషముగ నేచోటవ్యాపిం చునో, ఆచోట దానిశక్తినిమీఱి యేవిగాని తిరుగఁ జాలవు. దుర్ధర్ష మాతేజస్సే కదా. ఇందుఁ జొచ్చినజంతుకోటి పరమ శివభక్తిం గ్రాలుచునుండు. ఇట్టిపరమపావనస్థానము వేఱొ కటి లేదని తలంపుము. సకలదేవతలు మునులు బ్రహ్మాదు లీచోటును దర్శించి యీలింగవర్యమును బూజించి కృతార్థు లనుగాఁ దమ్ము నెంచుచుఁ బోవుచుందురు. నాయొసంగు దివ్య దృష్టివలన నిందుఁ గలతేజోలింగమును దర్శింపుము. ఆతేజస్సు సామాన్యదృష్టికిం జూడఁ దరముకాదు. అని పలకునంతలో నాయెదుట నిరుపమానతేజోరాశి యగులింగమొండు గనం బడియె. ఆతేజస్సు

శ్లో. "పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమంతాత్
దీప్తానలార్కద్యుతిమప్రమేయం."

అని గీతాశాస్త్రమునఁ జెప్పఁబడిన ట్లుండెను. అబ్బబ్బా! దాని వర్ణింప నాకుఁ దరంబగునా ? బ్రహ్మాదులకేఁ దరంబా యని నాయూహ. ఆతేజస్సును జూచుచుండఁగా నాకన్నులకుఁ జల్లఁగా నుండె గాని భీతికరముగా లేదు. మహానంద ముద యించెను. ఒక్కక్షణమున కాతేజస్సు నాపైఁ గ్రమ్ముచున్నట్లు తోఁచఁగా వెనుకంజవేయ సాగితిని. వీఁపుతట్టిశ్యామసుందర మూర్తిసాష్టాంగ నమస్కార మొనరింపుమని యుపదేశించెను. "త్రాహిమాం పరశంకర" యని సర్వాంగాలింగితభూతలుండనై తదేకాగ్రమనస్కుఁడ నైతిని. అదేమిమాయమో కాని యిఁక లెమ్మా యనునంతలో వేఱొకచోటున నుంటిని. నాకుఁ గుడి ప్రక్కన మహాపురుషుఁ డుండి వత్సా! యందుండఁదగినకాల

మంతియే పరమశివుని జూచితివి. చాలును. అని యీచోటునకుం జేర్చితి. ఇది కైలాసశిఖరమధ్యమభాగము. ఇందు మానవులు నిలువఁజాలరు. హిమశీకరములు ప్రాణములఁ దీయక మానవు. ఇందుఁగలవ్యాఘ్రములు పరమసాధువులే యైనను జూచినంతనే భీతిని బ్రాణభీతినిగూడఁ గల్గింపక వదలవు. వత్సా! ఇందున్న మానవులం జూడుము. అల్లవారె స్నానముచేసి దిగంబరులై కొందఱును, కృష్ణాజినముల ధరించి కొందఱును బోవుచున్నారు. వారెల్లఁ జిరకాలముగ నిందే యుండి సంతతిింగని తపోధను లనఁ బరఁగువారు. వారివెనుకనే పోవుచున్న హరిణములం జూడుము. వారియడుగులజాడనే పోవుచున్నవి. వీనికాహార మును వారు ప్రసాదింతురు. వారు నియమానుష్ఠానతత్ప రులై యుండ నీహరిణములు వారిచెంతనే శయనించి నెమరు వేయుచుండును. వారివలన నే బాధలు కలుగవని వాని నమ్మ కము. ఇంతకంటెఁ బుణ్యదేశము కలదా?

శ్లో. "కృష్ణసార స్తు చరతి మృగో యత్ర స్వభావతః,
స జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశ స్త్వతః పరః."

అనుమనుస్మృతి ద్వితీయాధ్యాయశ్లోకము నెఱుంగుదువేకదా. అది యిందే చెల్లునని నమ్ముము. ఈభాగమునఁ జూడఁదగినవిశే షము లివ్వియే. అనిపలికి చిటికె వేసెను.

## కైలాసోర్ధ్వభాగము.

మఱుక్షణమునకు శిఖరమునూర్ధ్వభాగమున నుంటిమి. ఆభాగమును జూడఁగనే నాకుఁగల్గినయానందమునకుఁ బరిమితి లేదు. ఏమి యాప్రదేశమహాత్త్వము! ఏమి యాదివ్యక్షేత్ర ప్రభావము! చూడ రెండుకన్నులు చాలవు. వర్ణింపఁబూనిన

సహస్రముఖములు కావలయును. ఆవసనములకుఁ దగినట్లు బుద్ధిచమత్కృతి యుండవలయును. అప్పు డేమైనఁ బ్రయత్నము చేసి చూడవచ్చును. కాకులు తెల్లగాఁ గొన్నియు నల్లగాఁ గొన్నియు నుండెను. అవి ధ్వనిచేయుచుండ శ్రుతులకు నానందము గలుగుచుండెను. అవి కాకములా యని యడుగ నామహాపురుషుం డౌననెను. ఇంతశ్రావ్యనాదమా యన నిది కైలాసశిఖరము కాదా యనుబదులు వచ్చెను.

తే. "ప్రమదమునఁ దేఁటు లెలుగెత్తి పాడుచోట
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోటఁ
బావురము లారజంబులు పల్కుచోట."

అనుమనుచరిత్రపద్యము స్మృతికిరాఁగా నంతకుమున్నిది కేవల వర్ణనమే యనుకొన్ననేను మహాకవిపెద్దనగారివాక్కు సత్యపూతమనియే తలంచితిని. కాకులట్లు శ్రావ్యముగాఁ గూయుచుండఁగా నితరపక్షులగళనాదమేమని చెప్పవలయును! పిచ్చుకలు పసుపువర్ణము కలవి కొన్ని యగపడెను. అవిమాటలాడుకొనుచుఁ గిచకిచలాడునట్లు వినఁబడుట లోకస్వభావము. ఆచోట నట్లుగాక శుకములవలె మాటలాడుకొనుచుండెను. ఆపచ్చనియాపిచ్చుకలకుఁ గంఠముచుట్టు నల్లనిరేఖ యుండెను. కొన్నింటికి కెఱ్ఱనిరేఖ యుండెను. ఆభేదమేమని ప్రశ్నింపస్త్రీపురుషభేదమును దెలుపునని యాశ్యామసుందరమూర్తి బదులిడెను. మఱికొన్నితావుల నెఱ్ఱనిదేహము పచ్చనిపక్షములు నల్లనిమెడయు నాకుపచ్చరంగుగలతోఁకయుఁ గలపక్షులు కొన్ని కనంబడఁగా నవేమని ప్రార్థించితిని. అవి వనచాతకము

లనంబడునని చెప్పెను. చాతకము లంబుప్రవాసములని కాళి దాసమహాకవి చెప్పెనే యన నవ్వి వనచాతకములంటినే యని బదులాడెను. చాతకములు రెండువిధములని. ఆకాశచాతక ములు, వనచాతకములు అను భేదములని తెలిసికొనినాఁడను గదా యని యబ్బురంపడితిని. వాని గళనాద మాలకింప నాల కింప విపంచీనాదము తుచ్ఛతమమని నాకుం దోఁచెను.

క. "వీనులవిందై యమృతపు
సోనలపొందై యమంద సుమచలదళినీ
గానముక్రందై యాస్వన
మానందబ్రహ్మమైన నధిపతి వల్కెన్."

అనువసుచరిత్రమునఁ గలపద్యము మదికిం దోఁచెను. ఆమహా కవి యింతలోకజ్ఞానము గలమహానుభావుఁడా యనితలంచితిని. అంతలో నాశ్యామసుందరచక్రవర్తి కనుసంజ్ఞచే మాటలాడ వలదని తెల్ప నేమియుఁ బ్రశ్నింపక మ్రాన్పడినట్లు నిలిచితిని. ఇంచుకదూరమునుండి యొకనాదము వినఁబడినెను. అవి వినఁ బడుచున్నదా యని చేసన్న నడుగఁగా శిరఃకంపమున నౌనని తెలిపితిని. చెవియొగ్గి వినుమనఁగా నొకమహాస్వరకాలము తదేకాగ్రచిత్తుండనై యాలకించితిని. ఏమనితోఁచుచున్నదని యాపరమపురుషుఁడు ప్రశ్నించెను.

శ్లో. "ఆలాపకాలసమపల్లవితాంకవీణా
సౌరభ్యపాతి మధుపారవసంకులస్య
తంత్రీస్వరస్య సమితౌ తరుణీస్వనస్య
జానాతి యత్ర చతురోఽపి న తారతమ్యమ్."

అనుచంపూభారతమునఁ గలయనంతకవికుంజరువాక్కు స్ఫురిం

చెను. దాని మదినూహించి కంఠస్వరమన వలనుపడదు. క్షణము
నకు మార్పునొందుచున్నది. చక్కగా నాలోచింప తంత్రీస్వన
నితంబినీకంఠస్వరముల కూడికయని తోఁచెడి నంటిని. వత్సా!
యెట్లు పల్కితివని మరలఁ బ్రశ్నింపఁగా మహాపురుషా!

శా. "నాదంబొక్కటి పిక్కటిల్లె దిశలన్ సవ్యామృతావ్యాహతా
స్వాదంబై విననయ్యెడిం బ్రియవయస్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠనాదమొ మరున్నారీమణీవల్లకీ
నాదంబో వివరింపరాదు పరమానందానుసంధానమై."

అని యట్లున్నదంటిని. పక్కున నవ్వి వత్సా! కిన్నరీగానము
వీణతోడ్పాటునసాగుచున్నదని తెలిసికొంటివి. సత్యము. అచ్చర
మిన్న శంకరునిధ్యానించుచుఁ బాడుచున్నది. వినుమా యా
గేయమును. ఉపనిషదవేద్యా యని యందు వినఁబడలేదా? భక్తి
భావమున నాకాంతామణి పాడుచున్నది. ఆచోటునకుం బోవఁ
దలంతువేమో. అది మానవాగమ్యము. శ్రవణపటుపేయమగు
దాని నాలకింపుము. కృతార్థుఁడవగుదువు. అనఁగానే నేనీ
మహారణ్యమున నామెయొంటిగా నుండఁజాలునా యనిప్రశ్నిం
చితిని. దేవతాకాంతలు కామగమనంబున నిటకువచ్చుచుఁ
బోవుచునుందురు. వారికిఁ గాననభూమిభయము కలుగదు.
జంతువులకుఁ గానరాకయుండఁగలరు. అదియుంగాక శంకర
భక్తుల నేసత్త్వములు చేరవెఱచును. ఈశిఖరమున నేజంతువు
గాని హింసచేయదని తలంపుము. ఇదిశంకరావాసము కాదా.
పూర్వపుణ్యంబునఁ జూడఁగంటివి. మున్నర్జునునకు శ్రీకృష్ణుఁడు
పాశుపతాస్త్ర మిప్పింప స్వప్నమున నిటకుం దోడితెచ్చెనని భారత
మునఁ జదివియుందువని తలంతును. శంకరు దర్శింప నిపుడు

శక్యముకాదు. ఇంకేమేని జూడఁగోరుదువా? అన విని కృతాంజలి నై యిట్లు ప్రార్థించితిని.

శ్లో. "అగ్రే దీర్ఘతరోఽయమర్జునతరు స్తస్యాగ్రతో వర్తనీ
సాఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా,
తస్యా స్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పంథానమవ్యాహతమ్."

అనుకర్ణామృతశ్లోకమును బఠింతును. అందుఁ బ్రతిపాదితమగు వ్యక్తియే చక్కనిమార్గమును జూపించునని పెద్దలుపలికిరి. మహాత్మా! శ్యామసుందరమూర్తీ! ఆకాలమున మిత్రుఁడు చుట్టమునగు నర్జునున కా శ్రీకృష్ణపరమాత్మ భగవంతుని గనఁ బఱచినట్లు నిన్నే నమ్మినయీదీన సేవకున కా పరమశివుని దర్శనంబగు నట్లు కటాక్షింపుమా. అని వేఁడుచుఁ దత్పాదారవిందముల పయింబడి లేవక గట్టిగా వానిం బట్టుకొంటిని.

ఆశ్యామసుందరమూర్తి కరకమలమున నాపీఁపు నిమిరి వత్సా! ఇంత ప్రార్థింపనేల? లెమ్ము. నీయిష్టంబు ఫలింపఁజేసెద. అని లేవనెత్తి నావగపు మాన్పి కన్నులుమూసికొని శంకరుని ధ్యానింపుమా యనియెను. అట్లే చేసి నాహృదయమునందు

శ్లో. "శాంతం పద్మాసనస్థం శశధరమకుటం
పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఘంటాం పరశుమభయదం
దక్షభాగే వహంతం
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం
సాంకుశం వామభాగే

నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం
పార్వతీశం నమామి."

అని ధ్యానించితిని. అంతలో వత్సా! భగవంతుఁడగు చంద్రశేఖరుఁ డిందు వేంచేసి యున్నవాఁడు. నమస్కరింపుమా యనుమాట వినఁబడెను. కన్నులు విప్పితిని. కన్నులకు మిఱుమిట్లుగొలుపు తేజోరాశి కనఁబడియెను. కన్నులు మూసికొని శ్రీహరీ! నాదృష్టికింపగినట్లు పాటవమును బ్రసాదింపుమా యని వేఁడితిని. క్షణమాత్రమున దివ్యదర్శనము లభించెను. మునులు పరివేష్టించియుండిరి. వామభాగమునఁ బార్వతీదేవి కూరుచుండియుండెను. సకలపరివారము గొలుచుచుండెను. శాంతమగుమోమునఁ జిఱునవ్వొలయ నాపరమశివుఁ డొప్పెను. చేతులు మోడ్చి తత్పాదారవిందములఁ దలంచుచు సాష్టాంగ నమస్కారము లాచరించితిని. ఏమో ప్రార్థింపఁదలంచి యట్లే శ్రీపాదముల మడిఁగుదురుపఱచుకొనుచుంటిని. ముహూర్త కాలమునకుఁ గన్నులు విప్పుదుఁగదా నేనొక కోనలో నుంటిని. శ్యామసుందరుంగాంచి యేమి యీకర్మము స్వామీ యని పెన్నిధిఁగోలుపోయిన పేదవలె నడిగితిని. నవ్వి వత్సా! అంతకంటె నెక్కువ కాల మాపరశంకరు దర్శించుభాగ్యము నీకు లేదు. చింతింపకుము. ఇంకఁ గొంతకాలమునకు మరల దర్శన మిప్పించెదనని యాహరి పలికెను. నిక్కమా యని ధైర్యమున నడిగితిని. అది నీకృషియందున్నది. పరశివుని ధ్యానించుచుండ మనస్సు పరిపక్వము కావలయును. అట్లగుచో నీప్రార్థన మక్కఱ లేకయే చేయించెదనని యూరకుండెను. దానికిఁ దగినమార్గ మాదేశింపుమా యని మరలఁ బ్రశ్నింపఁ దెలిసినమార్గము లే

చాలును. క్రొత్తమార్గము లేల? సర్వదా క్రొత్తమార్గము లేవని వెదకువా రిహపరములకు దూర మగుదురు. ఆచరింపక మార్గముల నడుగుచుండిన లాభము లేదు. కావున నీవెఱింగినమార్గములే మిక్కిలిగా నున్నవి. నీయాచరణమందు వేయవపాలు గూడఁ గానరాదు. కావున నింకఁ గ్రొత్తమార్గము లేవియా యని యాలోచించి కాలము వ్యర్థపుచ్చక తెలిసికొన్న మార్గములం బరిశ్రమము చేయుము. వత్సా! ఇఁక నింకఁ దిరుగుట చాలును. చూడఁదగినతావు లెన్నియో యున్నవి. వినఁదగినప్రభావము లెన్నియో యున్నవి. నీమనమందు గల శంకలు చాలభాగము తొలఁగియుండునని నాభావము. మహర్షు లెన్నియో విషయములఁ జెప్పిరి. వానిమూలమునఁ గలికాలవార్త లెన్ని కల్పితములో ఎందఱు జగద్వంచకులు గలరో తేటపడియెను గదా. ఎన్నియో కృత్రిమమార్గములఁ గల్పించి జగమును వంచించి మర్యాదను గాంచువారు గలరు. వారిమాటలను నమ్మి వారింబూజించుపామరు లెందఱో గలరు. ద్రవ్యార్జనమునకై కొందఱు మంత్రములఁ బామరుల కుపదేశించుచుందురు. వారు సిద్ధపురుషులని భ్రాంతిపడుచు వారిం బూజించుచుఁ బామరులు తుదకు లాభము లేకపోఁగా వారినే దూఱుదురు. మఱికొందఱు కాముకులై వేదాంతుల వలె నటించుచుఁ బరవనితల శిష్యురాండ్రగా నొనరించుకొని సుఖింపఁ బ్రయత్నించి కొంతకాలమున కామూలమున దుర్మరణమునకుఁ బాలగుదురు. మఱికొందఱు మతముల స్థాపింపఁబూనుదురు. కొందఱు మతస్థాపకు లగుదురు. తన్మూలమున శిష్యులం జేర్చుకొనుచు మర్యాదలనందఁజూచుచు ద్రవ్యము నార్జిం

చుచుం దుదకు నపకీర్తిం బొంది కుందుదురు. ఇంకను గొందఱు స్త్రీమూలమున జగత్తు బాగుపడవలయునని వారికి ధర్మోపదేశము చేయువారివలె నటించుచు వ్యభిచారవృత్తికిం దిగి తుదకు మృతి తన్మూలమున నొందుదురు. కొందఱు శాక్తుల మని పేరు పెట్టుకొని మద్యపానము చేయుచు మాంసముం దినుచు భ్రష్టు లగుదురు. మఱియును గొందఱేదానియందు ద్రవ్యము దొరకక నీచసేవలం జేయుచు జాతిభ్రష్టు లగుదురు. ఇట్లు కలికాలమున నెందఱో మహానుభావులు మహర్షుల మనుకొనువారు గలరని మహర్షులవాక్కులనుండియే తెలిసికొంటివికదా. ఈవిషయముల మదిం బదిలపఱుపుము. నీకు శక్తియుండునంతదనుక భగవత్సేవ సేయుము. మతములయందు లోపములు గలవని దూషింపకుము. తెలియని విషయములం దెలిసినట్లు నటించుచు నితరుల కుపదేశింపకుము. దానం బాపమార్జించుకొనుటయేగాని వేఱులాభమును గాంచలేవు. కావునం బదుగుండ్రకు శిష్యుఁడవై యుండుము. అంతియగాని యొక్కనికైన గురువుగా నుండం దలంపకుము. గురుపరంపరను ధ్వంసము చేయక సాగింపుము. చెప్పందగిన విషయములు చెప్పితిని. మహర్షులు కొన్ని చెప్పిరి. కనంబరుపందగినస్థలములు కనంబఱచితిని. భగవద్దర్శనము చేయించితిని. గంగాదిపావననదులను దర్శించితివి. పావనమహీరుహాములను సేవించితివి. పర్వతసానువులను, కందరములను జూచితివి.. ఇంక నీకోసను గూర్చి వినంగోరునట్లున్నది.

## దక్షిణామూర్తిస్థానము

ఇది పర్వతమధ్యభాగము. అంతియగాక యొక పావ
నాశ్రమము. దక్షప్రజాపతితనయ సతీదేవి శంకరుపత్ని యని
యెఱుంగుదు కాదే. ఆమె దక్షుఁడు చేయుయాగంబున శరీరంబు
యోగాగ్నిచే భస్మముగ నొనరించి రెండవజని హిమాలయపుత్రి
కగాఁ గాంచెను. ఆమెయే పార్వతి. ఇంతకుముందే వర్ణించితివి
కదా. ఆపార్వతి వివాహమునకుముం దీశ్వరుఁడీసిద్ధాశ్రమమున
దక్షిణామూర్తి యనునామమున మహాత్ములు తన్ను స్మరింప
నుండెను. కావున నిది దక్షిణామూర్తిస్థానమనఁ బ్రసిద్ధి గాంచెను.
ఇది మానవుల కగమ్యము. ఈయాశ్రమమున మహాత్ము
లున్నవారు. కాని యిది వారియోగాభ్యాససమయము. కావునఁ
బ్రవేశింప వలనుపడదు. అనఁగా నిందున్నవారందఱు శంకర
భక్తులాయని ప్రశ్నించితిని. శంకరభక్తులు విష్ణుభక్తులును గలరు.
శివవిష్ణువులకు భేదము స్వల్పబుద్ధులకే గాని మహాత్ములకు లేదని
యెఱుంగుము. ఇంక మరలుదము అని పలుకఁగా నమస్కరించి
మహాపురుషా! తమయపారకరుణచే సన్నిధియుఁ గాంచితి.
ఒక్కవాంఛ గలదు. మానససరోవరమును గాంచి స్నానము
చేయవలయునని. ఈవాంఛను దీర్చి కృతకృత్యుం జేయుదురా
యని ప్రార్థించితిని. నాప్రార్థన నాలకించి మంచిది పోదము
రమ్మని పలుకుచు నొకయట్టహాసము గావించెను. ఏమిదియని
యామహాపురుషునిమోము చూచుచుంటిని. అంతలో వేఱొక
తావున కేగుచున్నచిహ్నము లగపడెను. నలుప్రక్కలు
కలయం బరికించితిని. సిద్ధాశ్రమము కాక మున్నెన్నఁడు చూడని
స్థలము కనంబడియె. ఇది యేదిక్కైయుండునా యని యూహించు

చుండుసంతలో నాశ్యామసుందరమూర్తి! బాలకా! ఈ పావనమనోహరస్థలమును జూడుము. నీవాంఛితము లన్నియు ఫలించుననఁగా నొకవిశాలసమభాగము చక్షుఃపాత్ర మయ్యెను. అంత నాజగజ్జనకుఁ డిట్లు పల్కెను.

## మానససరోవరము

అబ్బాయీ! ఇదియే మానససరోవరము. ఇది మానవు లకు గోచరింపదు. లోకమున నింకొకదానికి మానససరోవర మను పేరు గలదు. అదిమానససరోవరము. ఇది మానససరోవరము. సృష్టికర్తయగు బ్రహ్మమానసమున మునిజనసేవ్యమగు సరో వరమున్న బాగుండునని తలంచెను. వెంటనే యీచోటు మదికిఁ గోచరించెను. కావున మానససరోవరమని మునులు పేరిడిరి. ఇందు స్నానముచేసిన మానసము శాంతముగ నుండుననియు నాధివ్యాధులు తొలఁగుననియు బ్రహ్మ శాసించెను. కావుననే యాతనివాహన మగుహంస మిందు విహరింపఁ జనుదెంచు. తజ్జాతిపక్షులన్నియు నిందు విహరించును. ఇందుహంసలకును బరమహంసలకును గావలసినపదార్థము లున్నవి. సహస్రదళ ములుగల కమలము లిందుఁగలవు. వానితూఁడుల నమలిన హంసలకు క్షుత్తు తొలఁగును. ఇందు స్నానముచేసి బ్రహ్మాశాసన ముంవలంచినఁ బరమహంసలు శాంతధనులై యవ్యయానం దము నొందుదురు. ఈపర్వతపంక్తులం జూడుము. ఇవి మేఘ మాలికలని భావించుచున్నావా యేమి? కావు కావు. పర్వత ములు. నలుప్రక్కల నావరించియున్నవి. ఈజలము పర్వతపంక్తుల నుండి హిమమయపాషాణము లాసంగినదియే. మిక్కిలి నైర్మలఁ బొంగి ప్రవహించును. ఆతెల్లనిప్రవాహ మదియే. అగాధజల

ముగల యానవెని వర్ణింపుము. ఈ మానససరస్సు విశాలభాగము నాక్రమించియున్నది. చతురశ్రముగాక త్రినాభిచక్రాకృతి నిచెయున్నది. పొడవు పదునైదు యోజనములు. వెడల్పు పదునో కంటు యోజనములు. దీనినాశ్రయించి యెన్నియో యాశ్రమములున్నవి. అందుఁ దాపత్రయరహితులై ధ్యానతత్పరులయి యలరారు మునులున్నవారు. వారు జితేంద్రియులు. శీతోష్ణాది ద్వంద్వములు వారిని బాధింపవు. నీకిప్పుడిందలి శీతవాతము బాధించుచున్నదా. లేదు కదా. ఏలయని యూహించితివా? అన్నంతనే మాటనందుకొని మహాపురుషా! తమదయాతిశయమున నంటిని. నవ్వి నాయనా! మహానుభావులగు మునులకుఁ బరమేశ్వరానుగ్రహమున ననిరి. నీకంటెఁ బరమేశ్వరుం డెవ్వం డని యడిగితిని. బదులు లేదు. ఆమాట మఱచునట్లు ముని సమాశ్రయంబగు నీకాసారవరమునకు నమస్కరింపుము. చెంతకుం బోయి సంకల్పపూర్వకముగా జలముల స్పృశించి శిరమునఁ జల్లుకొమ్ము. స్నానము చేయవలయునని కోరికకదా. అర్ధరాత్రమున స్నానము పనికిరాదనెను. అర్ధరాత్రమా యంటిని. అది మఱికొంచెమునఁ దెలియఁ గలదని పలికెను. నేనట్లే చేసితిని. ఆచమనము చేసితిని. ఔరా! యా జలముల మహిమ మేమో కాని నాకందే నివసింపఁదగునను నూహ కలిగెను. త్వరగ నమ్మని యాజ్ఞాపనము వినఁబడెను. ఆమహాపురుషునాజ్ఞ మీఱరానిదని మరలి వచ్చితిని. ఆచమించితివే యేల? అని యడుగ నాకుం గలభక్తిభావముచేతనని విన్నవించితిని. ఇంకమన మరుగునమని యాశ్యామసుందరమూర్తి మరలుజాడ కనంబడుచుండగా నల్లనఁ దంద్రీ! హిమాలయ దిక్కున

మున ధన్యుఁడనైతిని. ఇఁక నెందుఁ బోవుద మని ప్రశ్నించితిని. కన్నులు మూసికొని యుండుమా యని యాజ్ఞాపించెను. నేనట్లేచేసి యెచ్చటికిఁ దోడుకొనిపోవునో యని మనస్సు తదేక ధ్యానమున నిల్పితిని. భూమిని స్పృశింపక యతివేగముగాఁ బోవుచున్నట్లు తెలిసికొంటిని క్షణకాలమున కింక శయనింపు మనుమాట వినఁబడఁగాఁ గన్నులు తెఱతునా యంటిని ఊఁ అని వినఁబడియె. కన్నులు తెఱచిచూతును గదా నాచిన్నిమంచము. ఆచోటు. అన్నియు నట్లే యుండెను. శ్యామసుందర మూర్తి వత్సా! ఇఁక శయనింపుము. ఈయాత్ర మఱువకుము. ఇందుఁ గల్గినవిజ్ఞానము నెల్లరకుం దెల్పుము. కోటి కొక్కఁడైన గ్రహించుంగాక ఇఁక నేఁ బోయెదనని పల్కెను.

నేను మహానందము చింతయుఁ బెనఁగొన మహాపురుషా! నన్నువదలిన నాగతియేమని వేఁడితిని. నన్ను నీవు వీడకున్న నిన్ను నే వీడనని వాగ్దాన మొసఁగెద ననియె. మఱియు నేమో చెప్పఁబోవుచుండఁగాఁ దండ్రీ! నీనామమును దెల్పుమాయని యభ్యర్థించితిని. నీవేమనుకొంటివని ప్రశ్నించెను. నేను శ్రీకృష్ణమూర్తివని తలంచితినంటిని. మంచిది. అట్లే తలంపుము. అని నవ్వెను. స్వామీ! యీయాత్రయందు మహర్షులు పలికినవాక్కులన్నియు నాకు మఱపునకురాకుండ నిల్పుకొనుశక్తి గలుగ ననుగ్రహింపుమని యడిగితి "తథాస్తు" అని వరమిచ్చెను. ఇప్పటి యవతారపురుషులమాట సత్యమా యనునాప్రశ్నము రాకమునుపే యంతయు హుళక్కి. ఇదంతయు హుళక్కి. సర్వము హుళక్కి. ఇదంతయు మిథ్య. కల్పితము. ప్రకల్పితము. సంకల్పితము. వత్సా! ఇంక నీవిట్టిసందియముల నొందకుము. కాలము

నుపాసింపుము. చేయఁబూనిన కార్యమును వదలకుము. మేలు గలుగును. మేలు గలుగును. అనుచు నదృశ్యుఁ డయ్యెను. శ్యామసుందరమూర్తీ! యని స్మరించుచుండఁగా మెలఁకువ వచ్చెను. నలువైపుల దృష్టిఁ బ్రసరింపఁ జేసితిని. నాపంచమే. నాయున్న యింటిగదియే. ఆయంధకారాగారమే. ఇదేమిచిత్రమా యనుకొనుచుండ ఘటికాయంత్రము వాడుకచొప్పున ధ్వని చేసెను. స్నానమునకు వేళయాయెఁ గదా యని యూహించుచు భగవంతుఁడు తానదృశ్యుఁడగుచు నిరంతరము హాళిక్కే యని యొసఁగడా యని తలంచుచు నిత్యకృత్యముల నెఱవేర్ప నెంచితిని. శ్యామసుందరమూర్తి కరుణానిధి సర్వజనులఁ గాపాడుఁ గాక యని కోరుచు నాకృత్యమునకుం బూనితిని.

స్వస్తి సర్వేషాం సన్మంగళాని సంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

స్వప్నయాత్ర సంపూర్ణము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—15-4-1955.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| సామవేరాష్ట్రయాత్ర, జొన్నలగడ్డ సత్యనారాయణ | ... | 4 | 0 |
| నేరములుచేయుంజాతులచరిత్ర, ప్రతిమలతో | ... | 1 | 0 |
| నేటి కాలపు కవిత్వము, శ్రీ అక్కిరాజు ఉమాకాన్తముగారిది | ... | 4 | 0 |
| పంచతంత్రము, వచనము | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, శ్రీ జనమంచి శేషాద్రిశర్మ విరచితము | | 1 | 8 |
| సంగ్రహభాగవతము, ,, | ... | 2 | 8 |
| సంగ్రహభాగవతము (సంగ్రహింపబడినది) విద్యార్థులకై | ... | 1 | 0 |
| జగత్కథ, కొమాండూరు శఠకోపాచార్యులుగారిది | ... | 6 | 0 |
| భోజకాళిదాసకథలు, I-వ భాగము | ... | 1 | [illegible] |
| II-వ ,, | ... | 1 | 4 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| సంస్కృతనాటకకథలు, సీతారామశాస్త్రిగారిది 1 2 భాగములు | | 2 | 0 |
| ,, 3 వ భాగము శ్రీ ములుసు వేంకటరమణయ్యగారిది | | 2 | 0 |
| అరేబియన్ నైట్సు కథలు, పంగూరి సుబ్బారావు | ... | 2 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 3 |
| ,, A. S. P. అయ్యరుగారిది | .. | 0 | 2 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| రాజశేఖరుడు, గోపాలుడు | ... | 0 | 12 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 6 |
| కాశీమాహాత్మ్యము, తెనుగువచనము | ... | 1 | 0 |
| గయామాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 10 |
| పురాణగాథలు I భాగము | ... | 1 | 0 |
| ,, II భాగము | ... | 1 | 0 |
| త్రిలింగకథలు | ... | 1 | 0 |

